ప్రచురణ నెం: 494
ప్రథమ ముద్రణ :
ఏప్రియల్, 1963
1000 కాపీలు

వెల : { సాదా ప్రతి రు. 3.00
మేలు ప్రతి రు. 4.00 }

ముద్రణ :
స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు,
విజయవాడ-4.

# వ్యాస ప్రణాళిక





# 1. ఒకటి రెండు మాటలు

ఎదురుగా సముద్రం ఉంది. ఎగువను ఆకాశం. గట్లూ గనిమలూ లేనివి ఆ రెండున్నూ. అద్భుతాలకు పుట్టిళ్ళు.

గురజాడ నాకు కనిపించేది అట్లాగే. నావి చిట్టిబారలు, పొట్టి అంగలు. బారలు చాపి అగాధసముద్రాన్ని, అంగలువేసి అనంతాంబరాన్ని కొలిచి, వాటినుంచి పరమాద్భుతాలను ఒలిచి, పాఠకుల ముందు రాశిపోస్తున్నాననే భ్రమలేదు నాకు. కాకుంటే, మేరలను సూచిస్తున్నాను. కాబట్టి ఈ గ్రంథం ఒక రేఖాచిత్రం వంటిదేగాని నిలువు చిత్రంవంటిది కాలేదు. ఒక మహామనస్వితో పరిచయం కలిగించుకొని, పలుతెన్నులుగా సాగిన అతని భావనా భాగీరథిని ఊహాకే వదిలిపెట్టగలనుగాని ప్రత్యక్షం చెయ్యలేనుగదా!

ముఖ్యంగా, విశాలాంధ్ర ప్రచురణాలయం ఏడుసంపుటాలుగా ప్రచురించిన గురజాడ వాఙ్మయం ఎదుటలేకుంటే, నా చెయ్యి ఆడి వుండేదేకాదు. సెట్టి ఈశ్వరరావు, అవసరాల సూర్యారావు, శ్రీ శ్రీ వంటి రచయితలు నాకు అగ్రేసరులుగా ఉన్నారు కాబట్టే నా వ్యాఖ్యకు ఒక తెన్నంటూ సమకూరింది.

అయితే ఈ పుస్తకం పూర్తిగా గతానుగతికం కాదు. యువక స్వాభావికమైన సాహసికత్వం ప్రేరేపించగా, కొన్నికొన్నిచోట్ల నేను స్వతంత్రించి కొన్ని ఉలిపికట్టె అభిప్రాయాలను ప్రకటించాను. ఇవి నిర్ధారణలేమీకావు. ముందుముందు వెలుగుచూడగల కొత్త సామగ్రి వీటిని సరిదిద్దనూవచ్చు, ధృవీకరించనూవచ్చు.

విడివిడిగా రాసిన ఈ వ్యాసాలలో చాలమట్టుకు 'విశాలాంధ్ర', 'యువజన', 'విశ్వవీణ', 'సారంగి' పత్రికల ముఖాన వెలువడినవే. పాద పీఠికలు (Foot notes) ఏ పేజీకి ఆ పేజీ కాక, వ్యాసాలచివర వరుస క్రమంలో చేర్చి వున్నాయి. ఇప్పుడు దీనికి గ్రంథరూప మిస్తున్న విశాలాంధ్ర ప్రచురణాలయం వారికీ, పైన పేర్కొన్న పత్రికా సంపాదకులకూ రుణగ్రస్తుణ్ణి.

కావలికళాశాల, కావలి
20-2-1962

భవదీయుడు,
కె. వి. రమణారెడ్డి



# 2. అంచనా

మహావ్యక్తి కాజాలనివాడు మహాకవి కాదగడు.

గట్టినేలపై కాలు మెట్టి కూడ, చుక్కలకు మెడనిక్కించే ఊహామతి, శిఖరాలనే గాక అగాధాలను చూడగలిగిన చూపరి, నిన్నటి మన్నులో వేళ్లు తన్నుకొన్న మొక్క నేడు తొడిగిన పూత పిందెలలో రేపటి ఫలరాశిని భావించగల మనస్వి, దంభాచారాల నొల్లని సరళ వర్తనుడు, జాతికంటి పొరలను, కంటిని గాయపరచకుండా, అపహాస్యమనే శస్త్రికతో తొలగించగల నేర్పరి, నేల నాలు గంచులలోగల మంచిని తుంటలుగా తునుకలుగా కనిపిస్తున్న దానిని తెచ్చి సమగ్ర రూపిణిగా తీర్చగల పనివాడు, ప్రజనుపట్టి పల్లార్చుతున్న మూఢవిశ్వాసాలను అవిద్యను అహంకారాన్ని అణగ ద్రొక్కితేనేగాని ప్రజకు మూకగుణం పోయి జనం కాదని గ్రహించగలిగిన హితైషి — గురజాడ అప్పారావు ఆంధ్రజాతికి "అప్పాజీ".

ఎదిరిమనసు నొవ్వనీయని తెనుగుతేట సరసంవేమన్న నుండి, అనుక్షణం తనవ్యక్తినీ లోకవ్యక్తినీ విశ్లేషించి చెడుగును చేరదీసి దాని అంతుపట్టి సంస్కరింపజేయగల నాటకీయ దృష్టి బహుశా తిక్కన్ననుండి, ఎండిపోతున్న కవిత్వపు నాడులలోనికి దేశీయ సారస్వత సంప్రదాయంనుండి కొత్త నెత్తురు నెక్కించి నిలువ బెట్టవలెననే దీక్షను సంస్కృతములో యితోధిక బాంధవ్యము నెరపి అదే ఫలితాన్ని చేకూర్చిన నన్నయనుంగి, పాటకజనాల బ్రతుకులపై ఆసక్తిని స్కాట్స్ మహాకవి రాబర్టు బర్న్సనుండి, అచ్చపు ప్రకృతి

అందాలపై మోజును వర్డ్సువర్తు మహాకవినుండి అప్పారావుగారు అరువు తెచ్చుకొన్నారు. ఆయన సాధ్వగ్నిశిఖ పైపై చూపులకు శీతభానుడుగా కనిపించినా, ఆయన నిజానికి ప్రళయకాల దుర్నిరీక్ష్య మార్తాండుడు. తమ ఒక్కరిలో ఒక యుగానికి నిష్క్రమణంచూపి, మరొకదానికి స్వాగతం పలికిన అప్పారావుగారు రెండు యుగాల వాకిలిలో నిలిచినా, కాళ్ళూ కళ్ళూ గడపకీవలే నిలిపారు. కాబట్టే మనకు అతిశయోక్తి అలంకారం మూర్తీభవించినట్లు దర్శనమిస్తున్నారు.

"వెనుకజూచిన కార్యమేమోయ్ ?
మంచిగతమున కొంచెమేనోయ్ !
వెనుకబడితే వెనుకేనోయ్ !"

ఇది కింకర్తవ్యతా విమూఢమై భూతకాల ప్రేతాత్మల ఏలుబడికే మన సప్పగించి వుండిన ఆంధ్రులలోని అర్జున చిత్తవృత్తికి గీతా ప్రబోధం; మిత్రసమ్మితమనిపిస్తూనే ప్రభు సమ్మితమైన దివ్యాదేశం. రాజకీయ బంధాలనుండి విముక్తమైన యీ జాతిని వర్తమాన మహాకవి నామధారులు కొందరు మతానికీ గతానికీ కట్టివేయాలని వుచ్చులు పన్నుతున్న నేడు ముంగాలి బందాలతో మూరెడుకూడ కదలలేని గోవువంటి యీ జాతిలో జాతాన్ని రగిలించి పరుగుకు ప్రేరేపించిన మహాకవియొక్క ఘనత స్పష్టతరంగా తెలియవస్తుంది. మరొక దాస్యాన్ని మెడలపై మోపుకొనేందుకే ఒక దాస్యాన్ని వదలమని కొందరు వుపదేశించారు. భాషాసంస్కృతీ స్వాతంత్ర్యంలోనే రాజకీయ స్వాతంత్ర్యం భాసిస్తుందని గురజాడ వుపదేశించారు. ఇరువురిలో ఎవరు దేశికులు ? ఎవరు వంచకులు ?

మానవ విజ్ఞాన పురోగతి మతానికి ఆస్తికత్వానికి నష్టదాయకమౌతున్నదని గుర్తెరిగి కొందరు ఆర్షధర్మం పేరిట గీర్వాణ సంస్కృతీ మతసంప్రదాయం పేరిట జాతిని తిరుగుప్రయాణం కట్టమంటున్నారు. యాంత్రిక నాగరికత కుహనా సంస్కృతి అంటున్నారు. సర్వాంశలా లోకం జీవనయోగ్యం కావలెనంటే, చిత్తసంస్కారంతోబాటు భౌతిక

సాధనాసంపత్తి పెంపొందవలెనని అప్పారావుగారు విశ్వసించారు. ఇరువురిలో ఎవరు లోక శుభంకరులు ? ఎవరు విపత్కరులు ?

అలంకారశాస్త్ర ప్రమాణాలతో కవితా ప్రౌఢిమ చాటుతూ, ప్రవాహగతిలో నడుస్తున్న కవిత్వాన్ని గర్హిస్తున్నారు కొందరు. ఆన కట్టలు వేయజాలక, గట్లు పోయుమని వుపదేశిస్తున్నారు. నేటి దేదీ మేటిదికాదని, నిన్నటిదే మిన్న అని అంటున్నారు. దండాన్వయాలతో, వ్యుత్పత్త్యర్థాల వివరణతో, నానార్థాల వల్లింపుతో, పర్యాయపదాల పట్టికలతో, దేశభాషా బోధనను విదేశీయ భాషాబోధనకంటె కష్ట తరం చేస్తున్నారు. భారత భాగవత రామాయణాది కథాభాగాలతో, పంచతంత్ర కథలతో పాఠ్య గ్రంథాలను నింపివేస్తున్నారు. లేకుంటే తమకు జీవికగాని, ఆధిక్యంగాని వుండదు. నడుస్తున్న భాషను ఆగి పోయిన భాషతో శాసిస్తామంటున్నారు. నేటిని నిన్నటితో దండిస్తా మంటున్నారు. కాని గురజాడ కోరింది సంప్రదాయంతో తెగద్రెంపులు చేసికోని సంస్కృతీ విలసనం. రేపటిపైపే ఆయన బరువు మోపినవాడు. ఈ ఇరువురిలో ఎవరి కామన జాతికి దీవెన ? ఎవరిది శాపనార్థం ?

ప్రాంతాన్ని, దేశాన్ని, సమస్త నరజాతిని గురజాడ పెను కౌగిలిలో పొదివి పట్టుకోగలిగారు. వాటి నడుమ వైరుధ్యాలు చూడ లేనంతటి అప్రయోజకుడు కాదాయన. కాని యీ చీలికలూ చీకులూ స్వల్పతర ప్రభావం కలట్టివి. "లోకమంతా వొక్కయిల్లై" వర్ణాలు, కులాలు, జాతులు – వీటి భేదాలు సమసి, చిత్తశుచి, ఋతగతి, సహ కారమతి పెంపొందవలెనని ఆయన ఆశించారు.

నిజాన్ని యెదుర్కొనే ధీమా, ఆదర్శాలను స్పృశించే ఆత్మ పరత, వున్నది వున్నట్లుగా లోకాన్ని ప్రేమించగలిగిన మనోవిశాలత – యివి గురజాడకు జన్మతః సంక్రమించిన వరాలు.

ఇట్టి వాడు మహావ్యక్తి ఎందుకు కాడు ?



# 3. ప్రవేశిక

గురజాడ అప్పారావుగారు విశాఖ మండలాన పుట్టారు, కాని ఆంధ్రదేశానికంతా చెందిపోయారు. నియోగి బ్రాహ్మణ కుటుంబంలో పుట్టి సమస్త వర్ణాలవారికీ చెందిపోయారు. 1861 నవంబరు 30 వ తేదీన జన్మించారు. కాని చనిపోలేదు. కనుకనే 1955 నవంబరు 30 వ తేదీన కూడ మన మాయనను స్మరిస్తున్నాము. * నశ్వరమైన పంచభూతాల సమ్మిశ్రమమైన ఆయన దేహం 1915 నవంబరు 30 వ తేదీన పనికి శాశ్వతంగా సమ్మెకట్టింది.

కట్టక మరేమి చేయగలదు? తెలుగు దేశపు వేడిమిని కూడ సహించలేని దుర్బలత్వంతో పుట్టిదికదా, విజయనగర ప్రభువుల వెంట నీలగిరులెక్కి యేటేటా రెండు మూడు మాసా లక్కడ వుండవలసి వచ్చిందికదా, చొక్కాపై చొక్కా, కోటుపై కోటు వేసుకోవలసి వచ్చింది కదా, తిన్న పిడికెడు తిండిని కూడా హరించుకోలేక పోయింది కదా, ఆమరణాంతమూ అజీర్ణానికి క్రుంగి వంగి పోయింది కదా, బ్రతికియుండగా రెండెడ్ల బళ్ళమీద విశాలంగా సుఖంగా బారుగదూది దిళ్ళకు ఆనుకోవలసి వచ్చిందికదా, పైపెచ్చు విజయనగర ప్రభువంశీయుల వారసత్వం దావాలో పది పూర్తి సంవత్సరాలు నిర్విరామంగా నిర్నిద్రంగా ఎలా పని చేయగలదు? కనుకనే ఆనాడు సమ్మెకట్టింది. 'పెద్దచెవులు, చవకపు చెక్కిళ్ళు, సొగసైన యవననాసం, అతివిశాలమైన ఫాలం, పెద్దకళ్ళు, నిండుగల గడ్డం,

---

* ఈ వ్యాసం 1955 లో వ్రాసింది.

యింపుగా కొనలుసాగిన మీసం" యివన్నీ చల్లబడిపోయాయి. కాని "కన్యాశుల్కం", "కొండుభట్టీయం", "ముత్యాలసరాలు" ఆయనగారి అమరాత్మాగ్నిప్రభా సంభరితా లయ్యాయి కృష్ణశాస్త్రిగా రన్నట్లుగా "గురజాడ అప్పారావుగారు 1915 లో చనిపోయినా, 1915 తర్వాతనే జీవించడం ప్రారంభించారు."

## జన్మకాల ప్రాముఖ్యత

ఆయన జన్మకాలం విచిత్రమైనదీ, విలక్షణమైనదిన్నీ. భారతజీవిత మంతా క్రొత్తపాతల నడిలోయలోపడి నడిచేరోజులు. పాత పడిపోనూ లేదు. క్రొత్త పైకొననూలేదు. రాజకీయంగా 1857 ప్రథమభారత స్వేచ్ఛాసంగ్రామం—ఝాన్సీ లక్ష్మీబాయియొక్క అడ్డంగా తెగిన వీర దరహాసాంచిత వదనంవలె, రగూను చెర కటకటాల నడుమయావజ్జీవ బందీ అయి ముఘలు సామ్రాజ్య రమ నిలిచి వెలిగే బహదూర్‌షా మోములోని నిరాశ నిసినీడవలె, మిగిలిపోయిన ప్రతీకార వాంఛ ముప్ఫైకోట్ల గుండెలలో గ్రుడ్లు పొదుగసాగింది. కాని నిరాశా నిస్పృహా సర్వత్రా వ్యాప్త మవుతున్నై. బ్రిటిషువాడి రైలుదారి దేశం గుండెల కొనలకు తుపాకుల బాటలు వేసింది. బ్రిటిషు వాడి తంతి దేశం గుండెలో మెదిలే చిట్టిపొట్టి అలకలను ఢిల్లీ, మదరాసు, కలకత్తా, బొంబాయిల చెవులలో వూదసాగింది. సిద్ధంగా వున్నై బ్రిటిష్ పశుబలాలు పైబడను. మరి, సంఘమో చింపిరి తలవలె తయారయింది. యమ శాసనాలు, ఆంక్షలు, బహిష్కరణలు, దుర్మద దుర్మోహాలు నిండి నిబిడీకృతమై ఆముదాల సంచివలె హిందూ సంఘం తయారయింది. భూమిని కౌలుకుతీసుకొని బ్రిటిషువాడి చరణాంగుళులకు తలలు చేరవేసే జమీందారులు తమ కౌలుదారులపైని త్రివిక్రములయ్యారు. ఈ జమీందారుల ఆగభోగాలకు వందిమాగధులైన అగ్రవర్ణంవారు భూస్వామ్య వ్యవస్థలో అంతర్భాగ మయ్యారు. ఇనాములూ, కృతిభర్తృత్వాలూ, అర్చకత్వాలూ పౌరోహిత్యాలూ, పాండిత్యాలూ - యీ విధంగా స్థానిక ప్రభువర్గమైన

జమీందారీ భూస్వామ్య వ్యవస్థకూ అగ్రవర్ణంవారి భూదేవత్వానికి లంకె ఏర్పడింది.

భూదేవులు దేవభాష నేకాని దేశభాషలను ముట్టరు. సంస్కృతము ద్వారా నే వీరికి ప్రత్యేకాధిపత్యము ఏర్పడింది. శ్రీ నిడుదవోలు వేంకటరావుగారన్నట్లు "క్రీ శ. 11 వ శతాబ్దినాటికి వుత్తమ సాహితీ విశిష్టత యేర్పడిన తెనుగున వైదిక మత ప్రాధాన్యమువలన సాహిత్యమంతయు సంస్కృత పండితాధీనమైనది. సంస్కృతభాషా గౌరవము బ్రాహ్మణజాతి ప్రత్యేకతయు వ్యాపించినవి. మతసంబంధమగు నాధ్యాత్మిక విషయ ముత్తమ సాహిత్య ద్వారమునగాని ప్రజా సామాన్యమున కందుబాటులోనికి రాలేకపోయినది. కేవల దేశికవితలయం దాదరము సన్నగిల్లినది. దేశీయముగాని మార్గకవితప్రకృష్టస్థాన మాక్రమించినది." స్థిరమైపోయి జడములైపోయిన సంస్కృత భాషా మర్యాదలు జీవద్భాష అయిన తెనుగు మెడకు కట్టిన గుదిబండ లయినవి. సరస్వతి కాకవుల చేతిలో దాసి అయింది. కవిత్వం వృత్తి అయింది. కళ శాస్త్రమయింది. పండితులే కవులయ్యారు. పరిస్థితి గొప్ప మార్పును కోరింది.

## విజ్ఞానయుగ భాస్కరులు

స్థితి దుస్థితి అయితే దానికి దుర్గతి తప్పదు. అది పురోగతికి ప్రతిబంధకమయితే మార్పు వచ్చి తీరుతుంది. కాని యింతటితో పైనుండి అవతారాలు ఆగిపోయి, క్రిందినుండి అధిరోహణ ప్రారంభమయింది. విశ్వాసయుగ మంతరించి విజ్ఞానయుగ మవతరించింది. ప్రభుయుగంపోయి సామాన్యయుగం వచ్చింది. "జనంనుండి జనంకొరకు జనంచేత" జీవితరంగమంతా పరిపాలింపబడాలనే అభిప్రాయాలు మొదలయ్యాయి. ఈజనం అలగాజనంకాదు – "శిష్టుల" నగర సంస్కృతి ప్రారంభమైంది. పొలం, దేవాలయం, దర్బారులనుండి బ్రదుకు, ఒక్కవుదుటున ఆఫీసు, క్లబ్బు, మహాసభ, సమావేశాలకు ఎగిరిదూకింది. అచ్చువచ్చింది. విద్య సామాన్యులవరకూ దిగివచ్చింది. ఈ విద్య పాత విద్యకాదు. హూణం గీర్వాణాన్ని ఫీటుకొట్టింది. 1855 యీ రెండు యుగాల నడిమి సంవత్సరం.

కందుకూరి వీరేశలింగము (1863), గురజాడ అప్పారావు (1861), గిడుగు రామమూర్తి (1866) యీ విజ్ఞానయుగ భాస్కరులు. వీరిని విడదీయడమే తప్పు.

"మూట పొరెడు రక్త మొక్కటె
మూట వెలిగెడు తేజమొక్కటె
మూడనుటె తప్పు,"

అనవచ్చును. వీరేశలింగంగారి సంఘ సంస్కారమూ, గిడుగువారి భాషా సంస్కారమూ, గురజాడవారి సాహిత్య సంస్కారమూ ఒక్క బోదెనుండి పుట్టిన శాఖలే. గిడుగూ, గురజాడా చిననాటినుండి సహాధ్యాయులు. వీరేశలింగమూ గిడుగూ మిత్రులు. గురజాడా వీరేశలింగమూ పరిచయులు.

తన సాంఘిక సంస్కరణోద్యమంద్వారా వీరేశలింగం పంతులు హైందవ మతాచారాలనే సవాలు చేశారు. విధవా పునర్వివాహాలు, సానిమేళాల నిషేధాలు, విధవలనూ, సానులనూ మానవులలో జమ కట్టాయి. కనుక మానవవాదం యీ ఉద్యమానికి పునాది. తన భాషా సంస్కరణోద్యమం ద్వారా గిడుగు కావ్యభాషా పద్ధతులనే సవాలు చేశారు. వ్యావహారిక భాషోద్యమం సామాన్యుల శ్రేయస్సునుద్దేశించి జరిగింది. కనుక మానవవాదం యీ వుద్యమానికి కూడ పునాది. తన సాహిత్య సంస్కరణద్వారా గురజాడ సంఘ బహిష్కృతులలో ఔన్నత్యం, సంఘాధిపతులలో నైచ్యం చూపాడు. సాహిత్యానికి సంఘాభ్యున్నతియే ప్రయోజనమన్నాడు. శ్రీ కిళాంబి రంగాచార్యులుగా రన్నట్లు "ప్రజాసామాన్య సారస్వతరక్తధ్వజం ఎత్తబడింది. ఈ రక్తధ్వజమే పండిత వృషభములకు రక్త వస్త్ర శకలం అయింది... ఈ రక్తధ్వజాన్ని ఎత్తినవారిలో అగ్రగణ్యులు గురజాడ వేంకట అప్పారాయకవి." కనుక మానవవాదమే ఈ ఉద్యమానికికూడా పునాది. ఐతే ఈ ఉద్యమాలను ఎదిరించినవారు లేకపోలేదు. వేదం వేంకటరాయశాస్త్రిగారు వ్యావహారిక భాషోద్యమాన్నే గాక సంఘ సంస్కరణోద్యమాన్నికూడ వ్యతిరేకించారు. శ్రీ కొక్కొండ వెంకట

రత్నం పంతులు, శ్రీ జయంతి రామయ్యగారుకూడ యిందులోనివారే. జయంతి వారికి పిఠాపురం రాజాగారి అండదండ లున్నవి. వేంకట రాయశాస్త్రిగారికి వేంకటగిరిరాజుల అండదండ లున్నవి. కనుక యీ మూడు సంస్కరణోద్యమాల విరోధు లెవరు అంటే (1) సంఘాధిపత్యం కొనసాగింపదలచిన అగ్రవార్ణంవారు, (2) సంస్కృత భాషా ప్రాబల్యం ద్వారా పాండిత్య ప్రకర్షను చూపి విజ్ఞానాన్ని గుత్తకు తీసుకోదలచిన వారు, (3) యీ సామాన్యుల వుద్యమాలు మధ్యమ వర్గపు సంస్కర్తలతో ఆగిపోక, సమాజపు అట్టడుగున పడివున్నవారి వరకూ వేరు తన్నుకొని, వారి కళ్ళు తెరచి, నాల్క యిచ్చి, తెలివి చేపి, దారిచూపి, తమ హక్కు భుక్తాలను లాగివేయడానికి పూనుకొనే సమగ్ర సాంఘిక విప్లవంగా పరిణమించగలవని చూచాయగా కనిపెట్టిన జమీందారులు, భూస్వాములు. జయంతి రామయ్యగారు 1911 లో స్థాపించిన "ఆంధ్ర సాహిత్య పరిషత్తు" కు పిఠాపురం, వేంకటగిరి, ఉయ్యూరు రాజాలు మొదలైన 'మహాపురుషులు ప్రధాన పోషకులై వేలకొలది ధనమును విరాళముగా నిచ్చిరి" అనీ, వ్యావహారిక భాషావాదుల కాటపట్టయిన విశాఖపట్టణమువెళ్ళి గ్రాంధిక భాషను గురించి "గట్టియుపన్యాసం లీయవలసిందని (పిఠాపురం) మహారాజావారు నన్ను, పురాణపండ మల్లయశాస్త్రిగారిని, కూచి నరసింహంగారిని బంపిరి," (ఖర్చులిచ్చిరి) అనీ చిలకమర్తి వారు స్వీయ చరిత్రలో వ్రాశారు. కాబట్టి సమాజంలో అధికార స్థానాలలో వున్న వారే యీ ఉద్యమత్రయానికి అడ్డుతగిలారు. కాని యీ విరోధం నిలువలేక పోయింది. కొక్కొండ, జయంతి, వేదం ఓడిపోయారు; కందుకూరి, గిడుగు, గురజాడలు నేటికీ మనుతున్నారు.



# 4. నవ్యసాహిత్యం

సాహిత్యమనేది అఖండమైన ఒక ప్రవాహం వంటిది ఇది నవీన మిది ప్రాచీనమని విభజించడం. ప్రవాహాన్ని నిలిపి పూర్వోత్తర భాగాలుగా ఖండించబూనడం వంటి అసాధ్యమైన విషయం గావచ్చు. కాని వాడుకలో ఈ విభజన రూఢికెక్కింది ఉరామరికగా ఒక దశాబ్దాన్నో ఒకేఒక సంవత్సరాన్నో. రెండు సాహిత్యయుగాల సరిహద్దుగా నిర్ణయించడం అవివేకపు పని రెండింటి లక్షణాలు. భిన్నప్రమాణాలతో వేర్వేరు నిష్పత్తులలో ఒండొంటి నాశ్రయించుకొని వున్న సంధియుగం రేయింబగళ్ళ నడుమ ఒక సాయంత్రంవంటిదో ఒక వేగుజాము వంటిదో అయివుంటున్నది. ఈ ఉపమానాన్ని పొడిగిస్తే వాసవానికి దూరమవుతాము ఎందుకంటే ఒక సాహిత్యయుగంలో తత్పూర్వ సాహిత్య యుగధోరణులు మందరూపాలతోనైనా సాక్షాత్కరించక తప్పవు. దీనికి కారణం సాహిత్యపదార్థం మార్పును త్వరితగతిలో స్వీకరించక, మార్పుకు ఎదురొగ్గి. కొంత మేరకు పూర్వస్వరూపాన్ని నిలువబెట్టుకోగలుగుతుంది. దాని అంతస్స్వరూపం పరిణతి చెందుతున్నా. బహిస్స్వరూపం కొంత కాలంవరకు యధాపూర్వకంగా ఉంటుంది. కాని క్రమశః ఈ పైడొల్లకూడ చిదికి ముక్కలై వస్తువులో మార్పుకు తగిన రూపంకూడ దానికి చేకూరక తప్పదు. ఆంధ్ర సాహిత్యగతిని తర్కించడమే ఈ వ్యాసంలో నా ప్రధాన సంకల్పం.

## 1. రాత్రి దాటింది

ఔచితిని పాటించి వివిధ రసాలను పోషించిన ఉత్తమ సాహిత్య సంప్రదాయం శ్రీనాథాదుల కాలంనాటికే కొంతవరకు కథావశిష్టమై

పోయింది. సర్వావయవ సంపుష్టితో దర్శనీయమైన సాహిత్యం ఏకోన్ముఖమైన అభివృద్ధిని పొందసాగడం ప్రబంధధోరణిలో కనుగొనవచ్చును. కాని లోసుగులను కప్పిపుచ్చగలంతటి ప్రతిభ తమకు వున్నందుచేత, మహాప్రబంధకర్తలైన పెద్దనాదులు సాహిత్యగౌరవాన్ని యథాపూర్వ స్థానమందే నిలుపగలిగినారు. కాని వారు, తర్వాతి కవులకు పెట్టిన వరవడి వికటించి వక్రించింది. సంభోగశృంగార ప్రాబల్యమేమి, నాయికానాయక శీలచిత్రణమేమి, బంధకవిత్వ ప్రాచుర్యమేమి, పోగా పోగా సంపన్నమయమైన వైవిధ్యము కాకుండా, ఏకాకృతి కలిగిన ప్రతిభా దారిద్ర్యముగా రూపొందాయి. అపూర్వ సంఖ్యాధిక్య మొక్కటే కృతుల గుణాన్ని నిర్ణయించదు. యక్షగానాది నూతన కావ్యరూపావిష్కరణమే సాహిత్యమౌలికతకు గీటురాయికాదు. తంజావూరు, మధుర, చెంజినాయకరాజుల నాటి సాహిత్యానికి వాపేగాని బలుపులేదు. ఊరికొక దొరగా ఛిన్నాభిన్నమైన రాజ్య శరీరం, గిల్లికజ్జాలవంటి అంతఃకలహాలుతప్ప సాహసపూర్వమైన యుద్ధప్రీతిగాని విపుల సామ్రాజ్య నిర్మాణాశయంగాని లేని అలసత్వం, అంతఃపురాలకే అంకితమై ఆ స్థానాలకే పరిమితమైపోయిన ప్రభుజీవిత సంకోచం, పన్నువసూళ్ళుచేసి బొక్కసం నించి ముప్పూటలా విందుగుడిచి అందగత్తెలతో క్రీడించి ఇంద్రియ సంతర్పణగావించుకొనే లోలుపత్వం– సూక్ష్మంగా చెప్పాలంటే, బాహుబలం స్థానే ఉదరవైశాల్యం, సదాశయం స్థానే నీచవాంఛాతిశయం, క్రియాపటిమస్థానే నిత్యజడిమ, ప్రభువులగుణగణాలయ్యాయి. బహుభార్యాత్వ మటుంచి, కంటికి నచ్చిన సత్కులసంజాత నైనా తెచ్చి భోగవనితగా ఉంచుకొనే విశృంఖల నైతికవర్తనం రాజాధికారాలలో ప్రముఖమైంది. ఈ రాజులు కవిపోషణ చేయలేదా అంటే చేశారు. కాని ఆ చేతలో కవులస్థాయీ స్వరూపాలే మారిపోక తప్పలేదు.

కోడిపందేలకూ కవి సంవాదాలకూ నడుమ అంతరాన్ని గ్రహించజాలని ప్రభువులు అతిశయించారు. ద్వారం వెలుపల దర్శనార్థం పడిగాపులుపడే వాళ్ళలో కవి పండితులతోపాటు అన్నార్తులైన విద్యాశూన్యులుకూడ ఉండేవారు. ఆ స్థానంలో రాజనర్తకికున్న గౌరవ

1638

మర్యాదలు, దిట్టయైన కవి మహాశయునికి వుండేవికావు. భూమి మొదలు నానావస్తు సామాగ్రివరకు ప్రతియొక్కటీ నాల్కకో, కంటికో, చెవికో సంప్రీతి కావించ వలెననేవారే కవిత్వాన్ని ధర్మాసనంనుండి నెట్టివేయగా, అది వెలయాలి ఒడిలోనో, భట్రాజుల చావిడిలోనో పడిపోయింది. ఇంగ్లాండు చరిత్రలో రెండవ చార్లెసు, రెండవ జేమ్సు ప్రభువుల ఏలుబడిలో ఇటువంటి దుస్థితే కవిత్వానికి ప్రాప్తించింది! దానిని వర్ణిస్తూ ఒక ఫ్రెంచి విమర్శకుడు వ్రాసిన పంక్తులు కొన్ని ఉద్ధరిస్తే, మన ఆంధ్రయుగాంధ్ర కవితా స్వరూపంకూడా తెలుస్తుంది :

"The author of the day therefore became the com- plete and perfect sycophant. Against their better judget ment, they indulged in clowning. They recognised the better path, and chose the worse...They grew accustomed to be despised and became despicable. Their self-respec- being so small, they respected their professon little." (1)

బ్రతుకుదెరువు కోసం కొందరు, అదనపు వసతులకోసం కొందరు. కాని అందరూ పైవారి మెప్పుకోసం వ్రాయవలసి వస్తే, తమకు మంచిదని తోచింది గాక, యెదుటివారికి నచ్చుతుందని తోచిందే వ్రాయక తప్పదు పురాణ గాధలకు సంభోగ శృంగారం నేర్పి, ప్రభువుల 'రసదాహం' తీరిస్తే సరి. పద బంధాలలో వారి సంభోగ బంధ పాండిత్యాన్ని అనుకరిస్తేసరి. కాబట్టి దుష్ట ప్రబంధ కవిత్వమే కవులకు ఏడుగడ కాగలిగింది "మన పూర్వ సాహిత్యంలో ఒక్క ప్రబంధాలే కావు. స్తోత్రాలు, శతకాలు, చాటువులు, యక్షగానాలు, దరువులు, ఉదాహరణలు లక్షోపలక్షలు గలవు. దేశము వాటి నన్నింటినీ మరచిపోయి ఒక్క మార్గ కవితలోని ప్రబంధాలు మాత్రమే, అక్కడి వర్ణనలు మాత్రమే భాషా, సాహిత్యమూ అనుకొంది. (2) ఈ స్థితి తంజావూరు, మధుర నాయకరాజుల నాటిదికాదు. అటు పిమ్మటిది. అరాజకమే దేశ జీవితమైన రోజులలో, పాలెగాండ్లు జమీందార్లౌతుండిన రోజులలో, కారు నీడవలె అంగ్లేయ కుంపినీ అధికారం అదృశ్యంగా వ్యాపిస్తుండిన రోజులలో, కావ్య జీవితంకూడ

అ స్తవ్య స్తమై పోయింది ఈ అవ్యవస ఆనాటి శతక వాఙ్మయంలో స్పష్టంగా ప్రతిబింబించింది. అల్లరి చిల్లరిమూక ఏలుబడి చేయజొచ్చిన దుర్దినాలివి.

"మాన్యంబు లీయ సమర్థుఁ డొక్కఁడు లేఁడు
మాన్యముల్ చెరుప సామంతులంత" (3)

వంటి దుష్ట పభుగర్హణములెన్నో.

"కృపులం గొల్చుచు వేషధారి యగుచున్ బేరంబు లక్రాంతమున్
జపలత్వంబున సల్పుచున్ పరగృహ స్థానేచ్ఛ వర్తించుచున్
విపుల ద్రవ్యముగూర్చి మోదమునఁ బృథ్వీదేవ వంశ్యుండుదాఁ
గృపణుండై చెడుఁగాదె నిన్నెరుగ మిన్ శ్రీ సూర్యనారాయణా !"

అని వరాహ వేంకట నృసింహ కవి వాపోతాడు. ఆచారాలు పోయాయి, వేదములలో అసక్తి చచ్చింది, కుత్సితపు బుద్ధులు మెండ య్యాయి, "నీచులకు నాధిక్యమ్ము దావచ్చె"నని కామేశ్వరీ శతకంలో చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగా రంటారు. ఒకవైపు రాజులను పొగడుతూ "నానారాజ సందర్శనము" చేసినప్పటికీ, అందులో అప్రయత్నంగా నైనా నిజం వెలువడుతుంది.

"ఈ ధరలో జమీన్లుగల వెందఱ కేనియు, విద్య వారిలో
నే ధరణీశుఁడో యెఱుంగు, నెల్ల రెఱుంగరు..." వంటివి.

ఇటువంటి వారిని మెప్పించడం ఎంత తేలిక? 'అవధాన' కవిత్వ ప్రాచుర్యం ఇక్కడే మొదలౌతుంది. గద్వాల ప్రభువు వేసిన ప్రశ్న: 'వేణికాంతుల వెన్నంటి వ్రేలుచుండె' దాని పూరణంలో తిరుపతి వేంకటకవులు పురుషాయితం, నితంబ స్థలం వంటి వాటిని వర్ణించక తప్పలేదు. ఇక, కిర్లంపూడిలో ఇనుగంటి చిన్నారావుగారి సాని సోయగాన్ని ఒక సీస పద్యంలో ఇమిడించవలసి వచ్చింది.

ఇక, హూణుల పాలన వచ్చింది. మొదట్లో ఒకరిబాసలొకరికి రావు. కాని, పరిపాలనావసరాలకోసమో, దేశభాషాపరిచయం కోసమో దొరలు పండితుల నాశ్రయించక తప్పలేదు. అచ్చాఫీసులు

కూడ నెలకొనసాగాయి. పుస్తకాలమ్ముకోవడమనేది అప్రశస్తమైన పని యనే చాదస్తం సన్నగిల్లిపోయింది. "నానారాజ సందర్శనం"లో తిరుపతి వేంకట కవులన్నట్లు,

"ఇప్పటి సత్కవీశ్వరుల కియ్యదియే యొక వృత్తియయ్యె, మే
మిప్పటి కిందుఁ జొచ్చితిమి..."

కాని, పొట్టగడవడమే కవి పండితులకు నిత్యచింతగా మారింది. పూర్వ ప్రభువులు వర్షాశనాలనీ, నాకబలి పళ్ళాలనీ, అగ్రహారాలనీ, మాన్యాలనీ, కవిపండితులకు వసతిచేకూర్చారు. (4) "ఆ రోజులలో పది రూపాయలు యివ్వడంకంటె పది కుంచాలో, పది యకరాలో యివ్వడమే తేలికగా వుండేదని చెప్పేమాటకూడా కొట్టేయతగ్గది కాదు." ఇచ్చేదాత లనేకులుండినా, పుచ్చుకోవడమంటే వెనుకటి పండితులకు "చచ్చిన చావుగా వుండేది." "వెనుకటి పండితులు చాలా అసిధారావ్రతంగా జీవయాత్ర గడుపుకున్నారు... బుర్రపోయినా సరే లౌకిక వ్యాపారాల్లోకి అడుగుపెట్టేవారుకారు" (5) కాని హూణుల దొరతనంలో అడిగినా పెట్టేవాడులేడు. పెట్టినా, చాలీచాలని భిక్షం.

"అచ్చాఫీసులటంచు హూణుల కుపాధ్యాయత్వమంచున్ మఱిన్
వెచ్చంబిచ్చెడి బచ్చుటిండుల కడన్ వేదాంతమంచున్ మహో
ద్యచ్చారిత్రులు పండితుల్ మెలఁగఁగానయ్యెంగదా ? పొట్టకై
చచ్చున్ గాలమువచ్చె, గౌరవము నాశంబయ్యెఁ గామేశ్వరీ." (6)

భూస్వామ్య వ్యవస్థ నిర్మూలం కాలేదు. దాని నంటిపెట్టుకొని ధన స్వామ్యవ్యవస్థా నిర్మాణం దొరతనం వారి ప్రయత్నంగా పరిణమించింది. విలువలు మారుతున్నాయి. ఇంగ్లీషు చదువులు మొదలయ్యాయి. కట్టుబాట్లు సడలుతున్నాయి. సీమ సరుకులతోబాటు సీమ భావాలుకూడ ఇక్కడ మొనసూపుతున్నాయి. జాతి–వ్యక్తి మేల్కొంటున్నది జాత్యాత్మకు పట్టిన గ్రహణం విడిపోతున్నది పత్రికలు, హోటళ్ళు, రైళ్ళు, క్లబ్బులు, సభలు, సమావేశాలు – కొత్తశక్తులు కళపెళ మరిగే గంగాళంవంటి దౌతున్నది బ్రతుకు. రాత్రిదాటింది.

## 2. చైతన్యదీప్తి

జీవితంలో ఏర్పడిన మార్పు సాహిత్యంలో ప్రతిబింబించేందుకు ఎంతోకాలం పట్టలేదు. మార్పును ఆహ్వానించే సంసిద్ధమనస్కత 20 వ శతాబ్ది ప్రారంభ కాలానికే తయారై వుండింది. ఆంగ్ల, వంగ సాహిత్య ప్రభావాలవల్ల ఆంధ్ర సాహిత్యవ్యక్తి ఆత్మ చైతన్యదీప్తితో ప్రకాశింప సాగింది.

వచ్చిన మార్పులలో చాలామంది దృష్టిని ఆకర్షించినది కవి వ్యక్తియొక్క స్థాయిలో వచ్చిన మార్పు. కవిత్వమే జీవనోపాధిగా, సాహిత్యవ్రతమొక భౌతికావసరాలను సాధించిపెట్టే ఉపకరణంగా, కవులు భిక్షార్థులుగా ఉండిన రోజులు చాలవరకు గతించాయి. పూర్వం పాఠకలోకమనేది అత్యల్పసంఖ్యాకంగా ఉండింది. అచ్చుపని అవతరించకమునుపు ఒక గ్రంథం చదవాలంటే, "దానికోసం ఎవరినో ఆశ్రయిస్తే, వారు పరశ్రేయస్పృహసంవున్న యోగ్యులయితే రోజూ ఒకటో, రెండో తాటాకులవంతున వారి సమీపంలో కూర్చుని రాసుకోవడానికి అనుగ్రహించి యిచ్చేవారు." (7) సాహిత్యం ఆ రోజులలో శ్రీమంతుల విలాస వస్తువులలో ఒకటి. ఎటూ పనికిరాక, కార్యం తెలియక కలవారి ముంగిళ్ళవద్ద పడిగాపులు పడేవారు కవి-పండితులు. కాని నవీనయుగంలో నిజమైన పాఠక లోకమనేది, పూర్వం లేనిది, సమకూరింది ఒకరి నాశ్రయించనక్కరలేకుండా, కవిత్వమొక బ్రతుకు దెరువు కాకుండా, లోకయాత్ర గడుపగల స్థితిలో, కవికి లోకమాన్యతతోబాటు ఆత్మవిశ్వాసంకూడా చేకూరింది. అందుచేతనే అనేకానేకులు కవిత్వ రచన కుపక్రమించడం జరిగింది. 'నానారాజ సందర్శనము'లో తిరుపతి వేంకటకవులు,

"ఎందులోఁ జేరకుండెడి హీనులెల్లఁ
గవుల లోపఁగ నియ్యెడఁ గలియు చుంద్రు
ఎల్లవర్ణమ్ములనుగూడి యించుకంత
యంతరము లేక తురకలయందుఁ గలియు"

అని వ్రాసినప్పుడు వారి దృష్టిలో క్షీణయుగ కవులే మసలినారు. కాని, "ఆంధ్ర గ్రంథ విమర్శన ప్రకార లేశము"లో వేదం వేంకట రాయశాస్త్రిగారు,

"దేవునాన మున్ను దేశాన కొక్కండు
కవియుఁ గలఁడొ లేఁడొ కలియుగమున
ఇపుడు వీధి వీధి నింటింట నూరూరఁ
గవులు గలరు జగతిఁ గలవుతోడ"

అన్నప్పుడు నవకవుల సంఖ్యాతిశయాన్ని గర్హించడమే ఆయన పనిగా పెట్టుకొన్నారు.

అంతేకాదు, నవ్యత పొడగూడ వీరికి రుచించలేదు. వారి గుణాలు కనిపించనీయనంతటి దురాగ్రహావేశంతో వారు ఈ విధంగాకూడ వ్రాశారు: "మఱియు నీ కాలమున దోషములు గుణములుగాను, గుణములు దోషములుగాను ఎన్నఁబడు చున్నవి." గ్రంథచౌర్యము బహుగ్రంథ పాండిత్యముగా, పేలవము లలితముగా, అనౌచిత్యము ప్రతిభగా, తప్పుడు ప్రయోగము భాషాభివృద్ధిగా, శృంగారము బూతుగా వాడుక చేస్తున్నట్లు నిందారోపణ గావించారు. (8) ఇక, "నేటి కాలపు కవిత్వము" లో పండిత ఉమాకాన్తులవారు నవ్య సాహిత్యముపై పరశుధారగా దండెత్తినారు ఈ ఇద్దరి దృక్పథాలు భేదించినా, వారి గురి ఒక్కటే అయింది. పశ్చాద్దృక్కులైన ఈ పండితులను కలవర పెట్టగలిగిందంటే, నవ్య సాహిత్యంలో నిజానికి ఏదో 'నవ్యత' వుండి వుండాలి. విలువలు మారుతున్నప్పుడు, ఛాందసుల వెర్రికోపం అభివృద్ధికి నిజమైన సూచన.

ఏమిటీ మార్పు? కొత్తకావ్యరూపాలు అవతరించాయి కాబట్టి భాషాజాటిల్యం తగ్గింది కాబట్టి, ప్రబంధధోరణిలోని సంభోగ శృంగారపు స్థానాన్ని విప్రలంభ శృంగారమాక్రమించింది కాబట్టి, ఇదే నవ్యత అనేవారనేకులున్నారు. ఈ అభిప్రాయమే ఇంతవరకూ ఆమోదింపబడింది. "ఈ అభినవకవితోద్యమ ఫలితముగ కొంత పునరుద్ధరణము, కొంత నూతనసృష్టి కొనసాగినవి. 'ద్విపద కావ్యంబు ముదిలంజ...'

అని తిరస్కరింప బడిన ద్విపదలు, పల్లె పదములు, పునర్గ్రహణ యోగ్య ములైనవి." (9) మరికొందరంటారు, నవకవుల భాషయొక్క నుడికారం మాట్లాడుకొనే భాషయొక్క నుడికారానికీ ఉచ్చారణకీ చేరికగా వుండటమే నవ్యత అని. ఇవి నవ్యతకు లక్షణాలు కావని నే ననను. కాని ఇవి ప్రముఖాలుమట్టుకు కావంటాను. బహిస్స్వరూ పంలో వచ్చిన మార్పునుబట్టి వస్త్వాత్మలో మార్పు చేకూరిందన లేము. కావ్యవస్తువు యథాపూర్వమై వుండి, కావ్యరూపంమట్టుకు మారితే, అదీ ఒక మార్పౌతుందా? నిజానికి నవ్యకవులుగా ప్రసిద్ధు లైనవారు అనేకులు ఈ మార్పునుగూడ సరిగా పాటించలేదు. "సాహితీసమితి తొలిరోజుల్లో వృత్తాలు, గీతాలు బాగా ప్రయోగిం చారు. మిగతా తెలుగు ఛందస్సులు విరివిగా వినియోగించుకో లేదు... తరువాత తరం కవులు గణబద్ధమైన ఛందాలని వాడడం తగ్గించారు. మాత్రాబద్ధమైన నడకలలో కేవలం క్రమపద్ధతినివ్రాయడం మాని ఆ నడకలలో అనేకవిధములైన తారుమారులు, కూడికలూ, తీసివేతలూ కల్పించుకున్నారు... ప్రబుద్ధ జీవితంయొక్క మెలకువ లన్నీ కవిత్వరచనలో ప్రతిబింబించాలంటే, మన కావ్యసాహిత్యంలో ప్రచారంలో ఉన్న అయిదారు ఛందస్సులూ సరిపోవడం లేదు." (10)

మరి కొందరి దృష్టిలో ఈ "నవ్యత" కవి మనోరీతులకు సంబం ధించినట్టిది. పూర్వకావ్య లక్షణాల చట్రాలలో కొత్త కావ్యవస్తువును బంధింపజూడక, దాని కనుగుణమైన కొత్తమాటల కూర్పులతో, కొత్త సంకేతాలతో, కావ్యరచన మొదలైనపుడు, కవి మనస్సు స్వతంత్రించి, నకళ్ళనుగాక సరికొత్త సృష్టులకు పూనుకొంది. ఈ మనఃస్వాతంత్ర్యాన్నే కాల్పనిక ధోరణి (రొమేంటిసిజమ్) అన్నారు. దాని ముఖ్య లక్షణాలను నిర్ణయిస్తూ, ఒక ఆధునిక విమర్శకుడు, వాటిని ఇతి వృత్తానికి సంబంధించినవిగా, ఛందస్సుకు సంబంధించి నవిగా వేర్పరిచాడు. "స్వేచ్ఛా ప్రవృత్తి, నిత్యనూతన మార్గగవేష ణము, ఆత్మవిశ్వాసము - వీరి ముఖ్యసిద్ధాంతములు" అన్నాడు. (11) కాల్పనిక కవులలో అగ్రశ్రేణికి చెందిన దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు, కాల్పనికోద్యమ లక్షణాలు, "కాల్పనికవేగం, లక్ష్యావేశం, విశృంఖలత,

విజిగీష, సాహసం, అద్భుత పూర్ణమైన మనస్థిస్తితీ," అన్నారు. (12) ప్రతి జాతికీ నిద్రావస్థవంటిదొకటి అంతం కాగానే, తనను తాను చూచుకొని లోకాన్ని చూచి, తనంతటిది వేరే లేదని అది నిర్భ రాత్మ విశ్వాసంతో ప్రచురించినప్పటి మనస్థిస్తితి, ప్రతిదీ కొత్తదిగా, ప్రతిదీ ఒక వింతగా కనుపించినప్పటి అద్భుతదృష్టి దానికి చేకూరుతా యని కూడ వారన్నారు. ఇదీ నిజంలో ఒక భాగమేకాని పూర్తి నిజం కాదు. 'నవ్యత' వీటన్నిటి లోనూవుంది. కాని వీటి వెలుపలగూడ వుంది. ఈ లక్షణాలను చర్చించేబదులు, నవ్యకావ్యకర్తలను దర్శిస్తే వాటంతటుగా అవి ప్రత్యక్షం కాగలవు.

## 3. ఆద్యులెవరు?

సూర్యులు ఇద్దరా, ఒక్కరా? నవ్యాంధ్ర సాహిత్య విధాతృ పదవికిమట్టుకు అభ్యర్థులిద్దరు: గురజాడ అప్పారావుగారు, రాయ ప్రోలు సుబ్బారావుగారు. వారి ఆదిమత్వాన్ని తారీఖులతో తిథులతో నిర్ణయించడం వెర్రిపని. వారి అభిప్రాయ ధోరణులే ఈ నిర్ణయానికి దారితీయగలవు.

రాయప్రోలువారి 'తృణకంకణము', 'లలిత'లతో నవ్య కవిత్వ శంకుస్థాపన జరిగిందని చాలమంది పెద్దలైనవారు సిద్ధాంతం చేశారు. తన తరువాతి కవులు విస్తరింపజేసిన కావ్యవస్తువును ప్రవచించినది రాయప్రోలువారే. ఆయన ఆత్మాశ్రయ కవిత్వ జనకులు. కవి వ్యక్తి మనస్సులో ఉదయించిన ఒకానొక స్వల్పభావము బాహిరమై, పరి సర ప్రకృతిలో ఐక్యమును భజించి, నిర్భర పారవశ్యముతో మృదు లాక్షర సమ్మేళనంతో కావ్యరూప మొందినప్పుడు, కావ్యమున కవి వ్యక్తియే నాయక వ్యక్తి అయినపుడు, భావ కవిత్వము, ఆత్మాశ్రయ కవిత్వము ఉద్భవించాయి. మూఢులిచ్ఛగించే సంభోగసుఖాన్ని తృణీ కరించి వియోగములోనే మాధుర్య లీలా విపాక మనుభవింపదలచి నప్పుడు, తమముందువాళ్ళ క్షుద్ర ప్రబంధధోరణిని వదలి, మాధురీ భక్తిసిద్ధాంతజనితమైన వైష్ణవ కావ్యసంప్రదాయముతోబాటు, శృంగార

పరిభాషలో తత్వగవేషణ చేసిన సూఫీ, మర్మవాదుల కావ్యరీతులను గూడ రాయప్రోలు వారు తమలో సంలీన మొనరించుకొన్నారు. వారిలో సంభోగకాంక్షా విదూరమైన సౌందర్యార్చన, తరువాతి కవులలోవలె, సౌందర్యానుభవదాహంగా పరిణమించలేదు. ఈ 'కొత్త' దనంలోకూడ వారు పాతదనాన్ని పోనాడలేదు. సంభోగములేని శృంగారంలో కామపురుషార్థం నిలిచివున్నది. అది దాంపత్య జీవిత నైర్మల్యానికే దారి తీస్తుంది; అది భారతీయ ధర్మబద్ధమేకాని, వేరేమీ కాదు. సాంసారిక జీవితంలో చిచ్చుపెట్టేదికాదు. దానిని మరింత తేటపరచి పదనిచ్చి దృఢపరిచేది. ఇది విశ్వకుటుంబ నిలసనమువైపు పయనించే "ప్రేమ"కు చోటిస్తుంది. ప్రతి వస్తువును ప్రేమమయముగా చూచి, చూచినదానిని చూచినట్లుగా వ్రాయడమే నవకవి కర్తవ్యం. కాని, ఔచిత్య మెక్కడా భంగపడకూడదు; అశ్లీల మెక్కడా చొరబారకూడదు. ప్రేమమయమైన విశ్వమే ఈశ్వర నివాసస్థానమని, ప్రకృతిని ఆరాధించుటద్వారా ఈశ్వరుని సాన్నిధ్యం పొందవచ్చునని రాయప్రోలువారు నమ్మారు. నిర్గుణ పరబ్రహ్మ నుపాసించగలవారే కొద్దిమందో. కనుక పంచ భూతాత్మకమైన ప్రకృత్యుపాసన "సన్నిహిత లక్ష్యము."

అందు నీ విలక్షణ జీవయాత్రకయిన
పృథివినే నవ్యులు సమాశ్రయింత్రు భక్తి
తల్లిగా ధాత్రిగా దేవతామతల్లి
గా సమస్త పరాపర కార్యములకు" (13)

తెలుగునాట ఇదొక కొత్తమతమైతే కావచ్చు నేమోగాని నాస్తిక్యం మట్టుకు కాదు. అయితే గురజాడ కూడా నాస్తికుడుకాదు. కాని ఆయన కుండిన శాస్త్రదృష్టి హేతువాతబుద్ధి రాయప్రోలు వారిలో లేవు. యంత్ర నాగరికతలోని చెడుగులనుబట్టి, దీనిని 'వికృతి'గా ఎంచి, "దారిచూపగలాడొక్క డాత్త్వేకుండె!" అని అంటారు. కాని యీ తత్త్వం పారలౌకికమా ఐహికమా అని మట్టుకు నిర్ధరించి చెప్పరు. వారి మొగ్గు మొదటి దాని వైపునకే.

అదే విధంగా, రాయప్రోలువారు క్రొత్తబ్రదుకులోని రీతులను తెగడకపోయినా, పాతవి చూపుకుగూడా కరువౌతున్నాయే యని బాధ పడుతారు. ఆనాటి ఆటపాటలు, ఆచారవ్యవహారాలు, ఆయనకు నచ్చి నంతగా, తననాటివి నచ్చలేదు. ముగ్గులుబెట్టే చేతి మేలిమి, కుట్టుపను లల్లే కౌశలము రాట్నాలనుండి "పాలు తీసినరీతి సన్నదారం దీయు జాణ తనము," బువ్వమ్ముబంతులు, గొబ్బి, బొమ్మలపెళ్ళిళ్లు—అన్న కాటకమే అనుకుంటే "ఆన దదుర్భిక్షము" కూడాతోడైంది. ఈ క్షైణ్యానికికారణం మట్టుకు ఆయనకు అంతుచిక్కలేదు. మారుతున్న పరిసరాలను దర్శించ గలిగాడు కాని ఆయన మార్పును ఆహ్వానించలేదు. రాష్ట్రికవిత్వానికి అపూర్వ ప్రాచుర్యం కల్పించినందుచేతగూడ కొందరు రాయప్రోలు వారినే నవ్యకవిత్వ జనకులుగా భ్రమిస్తారు. కాని ఇటువంటి రచనలు ఆనాటికే బహుళ ప్రశస్తి గాంచినట్లు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి "స్వీయచరిత్ర" నుండి మనకు తెలుస్తుంది. తిరుపతి వెంకటకవులనుండి అపుడపుడే కలంపట్టిన పిల్లకవులవరకూ రాష్ట్రగీతాల నాలపించిన రోజులవి. అంతకు మునుపు దేశభక్తిని చాటిన కవిత్వాన్ని, పరిస్థితుల ప్రాబల్యంచేత రాయప్రోలువారు రాష్ట్రభక్తిని తగిన మిత్రులకు సంకుచితపరిచారు. ఇందులోనూ, ఆంధ్రుల భావిభాగ్యరేఖారూపం తాండవించేమారుగా పూర్వప్రశస్త స్వరూపం విరాణ్మూర్తిగా కళ్లు నించుతుంది. ఈ కవిదృష్టి స్వజనుల లోపాలకు అంధమైపోయిందని నేననను. "బలభద్రులు" పుట్టిన "పులికడుపు" వంటి నేల నేడు "చలి చీమలపుట్ట"గా మారి, కులముగొడవలతో, పొలిమేర గోలలతో ఆయనకు కనిపించింది. కాని విముక్తపథం, రాయప్రోలువారికి, వెనక్కే గాని ముందుకుగాదు. తెలుగుగుండెలలో మాటుమణిగియున్న పూర్వ వాసనలకు తిరిగి ఊపిరి పోయాలంటారు. కనుక భవిష్యత్తును గతంతో నిబంధింప జూస్తారు. దాని దుష్పరిణామాలనుమట్టుకు తిరస్కరించరు.

ఇక రాయప్రోలువారి నవ్యత భాషా ఛందస్వరూపంలోనా ? తెనుగంటే, అందులోనూ జానుతెనుగంటే ఆయనకున్న మక్కువ సంస్కృత పద బహుళమైన తెనుగుపట్ల లేదు. తిక్కనపై గురి నన్నయపై లేదు.

"నన్నయభట్టు భారతమునన్ జతియించెను సంస్కృతంబుతో
కొన్ని తెలుంగులేరి తనకూర్పున కొప్పినయంత; కాని యా
వన్నిబిడాంధ్రలోక ముఖభాషిత మై, శ్రుతిసేవ్యమాన జీ
వన్నవనీతమౌ తెలుగు పాల సముద్రము వుక్కిలించెనే?"

ఇటువంటి అనేక పద్యాలలో రాయప్రోలువారి ఆకాంక్ష ఒకే ఒకటి: శ్రవణసుఖము. "మృదుల సరళాక్షరముల సమ్మేళనాప్తి నార్ద్ర నవనీత మార్దవమగును నుడువు." అందుచేతనే ఆయన రచనలలో పాలు, పూలు, వెన్న, జున్ను, వెన్నెల, కన్నెలు, చివురులు, తీవలు వంటి మాటలే ఎక్కువ. అచ్చపు తెనుగు భాషకు అది సహజగుణమే నని ఆయన తలపు.

"పాల క్రొమ్మీగడల్ పచ్చి వెన్నయివిచ్చి
తీయని నునుపూసలాయెనేమొ?
కమ్మని మకరందకణములు స్నేహించి
చిన్నారి పలుకులై చిక్కెనేమొ?
పూలలావణ్యంబు పొంగి చక్కదనాల
పిండెలై రుచులెక్కి పెరిగెనేమొ?
సెలయేటి యుయ్యాల కులుకు టొయ్యారంబు
ముద్దు ముచ్చటలయి ముదిరెనేమొ?
పాటకును పద్యమునకు నమ్రముగ నొదిగి
చవికి చాతుర్యమునకు సాజముగ సాగి
పోరునకు పొత్తునకు ననువుగ చెనంగు
ఈ ప్రసన్నాంధ్రమునకు దోయిలి ఘటింతు"

కావ్యంలో కటువైనమాటలు ప్రయోగించరాదని నియమం పెట్టుకొంటే, అది కావ్యోత్కృష్టతనే దెబ్బతీస్తుంది అని పండిత ఉమాకాన్తము గారు విమర్శించారు. "కావ్యమంతా మెత్తటిఅర్థాల మెత్తటిమాటలతో మెత్తగావుండేటట్టు చేయవలెనంటే తప్పకుండా వెగటూభావసంకోచం తటస్థిస్తున్నది. దశరూపక కారుడన్నట్లు ఉత్తరపాల్లో రమ్యం, జుగు

ప్సితం, ఉగ్రం, ప్రసాది, గహనం, వికృతి అయి అనేక రూపాలతో ఉన్న ప్రకృతిని వాచ్యంచేసేకవికి తత్తదనుగుణాలైనభావాలూ శబ్దరూపాలూ యెన్నో స్వీకార్య మవుతున్నవి" (14) కాని, రమ్యానికే అనల్ప ప్రాముఖ్య మిచ్చినందుచేత రాయప్రోలువారు, తదితర భావకవులు, మృదువైన మాటలనే ఎక్కువ వాడవలసివచ్చింది ఒకేరకమైన మాటలకే మనసయ్యారు కనుక. మాటల శబ్దానికున్న ప్రాముఖ్యం అర్థానికి చేకూరలేదనికూడ ఇంకొక విమర్శ తత్ఫలితంగా దూరాన్వయం, క్లిష్టాన్వయం వంటి దోషాలు ఘటిల్లాయి. ఇవి రాయప్రోలు గారి లోపాలుగా అనేకులు నిర్ణయించారు. కాని, నవకవులందరి సాధారణ లక్షణాలు కావు. "ఒక నూత్న సంప్రదాయం కరడుగట్టు ప్రథమ దశయందు ఇట్టి దోషము లుప్పతిల్లుచుండును," అన్నా రొక సుప్రసిద్ధ నవకవి (15)

ఛందస్సులలోగూడ కొంత సౌలభ్యం సారళ్యం తెచ్చారు రాయప్రోలువారు. బంధకవిత్వాలను బహిష్కరించడమేగాక, పాటల బాణీలతో, ఎన్నో రచనలు చేశారు కాని వృత్తాలకు వారిచ్చిన ప్రాముఖ్యం అతిశయమైనది. అక్షరగణ చ్ఛందస్సులే ఎక్కువగా స్వీకరించారు వెనుకటినుంచి సంక్రమించిన కావ్య భాషనుగాని, కవిత్వ రీతులనుగాని పూర్తిగా విసర్జించలేదు. నిజానికి, రాయప్రోలు ప్రాచీనులలో నవీనుడు, నవీనులలో ప్రాచీనుడు. పూర్వకవితలోని మార్గకవితా సంప్రదాయాన్ని ఆయన కొద్దిగా సంస్కరించారేగాని, దానిని కాదని నూతన సంప్రదాయాన్ని ఏర్పాటు చేయలేదు.

## 4. గురజాడ, రాయప్రోలు

గురజాడ అప్పారావుగారు కూడ పూర్వ కవిత్వంలోని దేశి సంప్రదాయాన్ని ఆధునిక యుగంలో పునఃప్రతిష్ఠించారన్న మాట నిజమేకాని, ఆయన మనోహృదయాలు గతంనుండి చాలవరకు స్వతంత్రించాయి. నవీనుల కాయన నవీనుడు, కవులకు కవి, కథకులకు కథకుడు, నాటక కర్తలకు నాటకకర్త – అంతే, వీటికన్నిటికీ ఆయన తొట్టతొల్లిటి నమూనా. రాయప్రోలుకూ, గురజాడకూ గుణాత్మకమైన

అంతరం ఉంది. ఒకరు సంస్కరింపజూస్తే, మరొకరు విప్లవీకరించారు ఒకరు పూర్వయుగపు చివరి ప్రతిధ్వని అయితే, మరొకరు వర్తమాన యుగపు ప్రణవనాదము. తారాగణం నడుమ ఒకరు చంద్రుడైతే, రాత్రి వెన్నుదన్ని వచ్చిన పట్టపగలనే రథం నొగమీద కూర్చున్న ప్రభాకరు డింకొకరు.

గురజాడ కర్త; రాయప్రోలు సంస్కర్త. వారి సంప్రదాయాలు, ఆలోచనారీతులు, ప్రీత్యప్రీతులు పరస్పర బాహ్యమైనవి కాకపోయినా భిన్నమైనవి రాయప్రోలు విశ్వాసయుగానికి చెందినకవి; గురజాడ విజ్ఞానయుగానికి. ఆయన ఆస్తికుడౌగాక, మానవ వ్యవహారాలను శాసించగలశక్తి కొంతవరకు ఐహికమేనని ఆయన భావించారు. పారలౌకికమైన విధి నటుంచి భౌతికమైన మానవబుద్ధిని, తదిచ్ఛాసంకల్పాలను ఆయన పటుతర శక్తులుగా భావించారు. "మానవుడు పరిస్థితులకు కేవలం బానిస అని, తన ప్రవర్తనను తాను నిశ్చయించుకోలేని నిస్సహాయుడని అనుకోవడం పొరబాటు... మానవునికి కావలసినది సంకల్పబలం". (16) బుద్ధి తన ఆయుధం కాగా, మానవుడు విశ్వాసాన్ని జయించి విజ్ఞానాన్ని సాధిస్తాడు. ప్రతిదీ అంగీకరించి ఆమోదించడం బుద్ధియొక్క జడత్వానికి సూచన, కాగా ప్రతిదాన్నీ నిలదీసి, ప్రశ్నించి, దాని గట్టినీ పోటినీ నిర్ణయించగలగాలి. "అంధ విశ్వాసాలు ప్రమాదకరమైనవి. ప్రశ్నించే స్వభావం లేనపుడు గుడ్డినమ్మకాలు కలుగుతూ వుంటాయి. అణకువ పిరికితనానికి లక్షణం."(17) ఏ సంస్థగానీ, పురాతనమైనంతనే, ఆమోదయోగ్యం కాగూడదు. ఏ విశ్వాసంగానీ, బహుజనావలంబితం కాబట్టే, స్వీకార్యం కాగూడదు. ఒక వస్తువును పరిశీలించేటప్పుడు దానిని గురించి మన కప్పటికే ఏర్పడివున్న వైముఖ్య సాముఖ్యాలనుబట్టి గాకుండా, దాని గుణాగుణాలనుబట్టి పరీక్ష చేయాలి. "ఏ వస్తువునైనా, దాన్ని దాన్నిగా, వస్తుపరంగా వీక్షించి విలువలు కట్టవలెను."(18) ప్రతి సంఘటనకూ ఒక కారణ ముంటుంది. ఈ కార్యకారణ సంబంధ జ్ఞానమే విజ్ఞాన మంటారు. ఒక సత్క్రియకు ప్రేరేపించని సిద్ధాంతమేదీ మంచిదికాదు. పుస్తకాలలోని మాటలను వల్లెవేస్తూ చిలకలై

పోయిన వర్తి పండితులు, అప్పారావుగారి అవహేళనకు గురయ్యారు. క్రియ సత్క్రియ యైనప్పుడే దాని సార్థక్యం. ఇతరులందరూ తనకు తోడుపడవలెనని ప్రతి ఒక్కడూ కోరుకొంటాడు. తాను ఇతరుల కావిధంగా తోడుపడకుంటే తా గోరిన పని జరుగదు. తన స్వార్థం లోకానర్థకం కారాదు. స్వార్థంవిడిచి పరార్థంకొరకు పని చేసినప్పుడే స్వప్రయోజనం సిద్ధిస్తుంది. బహుజనసుఖమే స్వసుఖం. బహుజనహితమే ఆత్మహితం. ఉభయార్థ సాధకమైన ఈ తారకం "ప్రేమ"! స్వార్థక మనేది అది మారణ్య జీవన వారసత్వమయితే, ప్రేమ అనేది నాగరకత స్వార్థమనేది వ్యక్తిలోని బలహీనత. తన నీచవాంఛ లకు తానే బందీ అయినప్పటి మనస్థితి. కాగా "ప్రేమ" అనేది వ్యక్తికీ సమష్టికీ స్వేచ్ఛాదాత. అదే "దైవము" అప్పారావుగారి కొత్త మత మేదైనా వుంటే అది మంచితనం. ఆయన సంభావించిన "ప్రేమ"కు శృంగార వాసన లేశమైనా లేదు. "మరులు ప్రేమని మది దలచకు" మన్నారు. (19) గురజాడ మానవజీవితసంస్కర్త, రాయప్రోలు కవితా మార్గ సంస్కర్త. గురజాడది నాటకీయమైన లోకదృష్టి, రాయ ప్రోలుది కావ్యవిషయికమైన లోకదృష్టి. గురజాడ నాయకుడు మాన వుడు - వివిధ వ్యక్తిత్వాలతో ఆసక్తి గొల్పేవాడు; రాయప్రోలు నాయకుడు కవి - వ్యక్తి, వైవిధ్యాలను పరిహరించి ఐక్యతను సాధిం చినవాడు. లోకాన్ని వస్తుపరంగా ఒకరు, ఆత్మపరంగా మరొకరు దర్శించారు. ఒకరికి మానవుడే దివ్యాంశతో కనిపించగా, మరొకరికి ప్రకృతి దేవతామతల్లి. అంధవిశ్వాసా లొకరికి వికటించగా, మరొ కరు నవీనాంధ్ర విశ్వాసానికి దారి సుగమంచేశారు. అందుచేత, రాయ ప్రోలు లోకదృష్టిలోని "నవ్యత", పౌరాతన్యం ధరించిన వర్తమాన దుకూలం మాత్రమే.

భాషా సాహిత్య విషయాలలోనూ అంతే. శబ్ద స్వరూపం లోనూ, కావ్యభాషలోనూ, అప్పారావుగారు సరికొత్త త్రోవతీశారు. దేశి సారస్వతం నుండి గేయ ఫణితులను, యక్షగానాల నుండి నాట కీయ వ్యావహారిక భాషను సంగ్రహించారు, అని అనడం సులభమే. కాని, దేశి సంప్రదాయం దమితమై సరస్వతీ నదివలె నామమాత్రంగా

ఉండినదానిని భగీరథుడై ఉద్ధరించి, దానికి కావ్యగౌరవం కల్పించి అక్షయ సంప్రదాయభిక్షను ఆంధ్రలోకానికి పెట్టడం సాధారణకార్యం కాదు. అది భూకంపం తర్వాత భూమి స్వరూపం వంటి పెనుకదలిక. సాహిత్యంపట్ల జాతికి అపూర్వమైన అనితర సాధ్యమైన ఆత్మీయత కలిగించేందుకు మాత్రాగణబద్ధమైన గేయకావ్యం ఎంతో ఉపకరించింది. రాయప్రోలువంటి తదితర కవులలో అల్పతర సంఖ్యలో కనిపించే గేయధోరణి గురజాడలో సర్వేసర్వత్రా భాసించింది. వ్యావహారిక భాషా పదాలకు గ్రాంధిక శృంఖలలు తొడిగే పని గురజాడ చేయలేదు. వ్యావహారిక భాష నాజూకు కాదు. అది గురజాడకు జీవనాడి. గేయ సాహిత్యం ప్రజా సంరజనం కొరకు ఉద్దేశించబడినప్పుడు వాడుక నుడికారముతోతప్ప అది మనసుల కెక్కజాలదు. వాడుక మాటకూ రసస్ఫూర్తికి చాలా దగ్గర సంబంధం ఉన్నదని 'కిన్నెరసానిపాట', 'కోకిలమ్మ పెళ్ళి' వ్రాసి నిరూపించిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు అన్నారు. ఒకశబ్దానికి ఔచిత్యమనేది అనేక విధాలుగా వుంటుందని, వ్యాకరణ సంబంధమైన సంస్కారౌచిత్య మొక్కటే శబ్దౌచిత్యం కాదని అంటూ ఆయన ఇంకా ఇట్లన్నారు. "ఆ శబ్దమందు వ్యంజకత్వౌచితి వుండి, పాత్రౌచితి వుండి, వ్యాకరణ సుష్ఠుత్వం ఉండదు. ఆ శబ్దం రసస్ఫోరకమవుతుందా కాదా అని విచారణ. ఈ పట్టున నవ్యసాహిత్యానికి శంకుస్థాపన... పండితులు రసము ధ్వని మొదలయిన గుణాలు మరచిపోయి ఒక్క శబ్ద సాధుత్వాన్ని పట్టుకుని వ్రేలాడుతున్నారు. అందుమూలంగా నీరసగ్రాంధికంలో గ్రంథాలు కుప్పలు తిప్పలుగా బయలుదేరినై.... దేశంలో రసబుద్ధి మళ్ళించటానికైనా వాడుకభాష అవసరం... అప్పరాయోపజ్ఞకమైన రసగీతాలను రాయప్రోలు సుబ్బారావుగా రందుకున్నారు... అప్పారావుగారూ సుబ్బారావుగారూ చేసినది యేమనగా రసపుగూళ్ళయిన అనేక దేశీయ శబ్దాలను, నుడికారాన్ని రసవ్యంజకంగా కథలలో అతికి, 'అబ్బాయీ! భాషకాయువుపట్టు ఇల్లా ప్రయోగింపపడే శబ్దం. ఇది దేశీయమైన శబ్దం. జాతియొక్క హృదయం యీ శబ్దంలో ఆడుతుంది' అని చూపించారు." (20)

కాని ఈ పనిని గురజాడ చేసినట్లు రాయప్రోలు చేయలేదు. అప్పారావుగారి కావ్యాలకు పండితులు పెడముఖం పెట్టారు. కాబట్టి వారిని ప్రసన్నులను గావించుకొనుటకై సుబ్బారావుగారు 'వారి గీతి నూత్నత్వం పండితులకు తగినభాషలో ప్రకటించి, భాషనుగురించి మాట్లాడటానికి వీలులేకుండాచేసి, ఆ మార్గంలోవున్న కొత్తదనం పండితుల చేతకూడా కొత్తదనమని ఒప్పించారు.' (21) కొత్తదనంలో కొత్తదనాన్ని తీసి, కొతచట్రంలో పాతభాషను నింపి, ఇదే కొత్తదన మనిపించారు. కాబట్టి రాయప్రోలువారి గేయ కావ్యాలుకూడా అనానూనంగా వస్తున్న కావ్యభాష పరిహరించలేదు.' (22)

గురజాడ సాహిత్యానికి వ్యావహారికభాషలోతప్ప, మనికిలేదు. రీతి వస్తువులకు ఐక్యత గురజాడ కవిత్వం సాధించింది సౌలభ్యమే నూతనత్వమనుకుంటే రాయ ప్రోలుకంటె ముందు కందుకూరి, చిలక మర్తి ప్రయత్నపూర్వకంగా సౌలభ్యాన్ని కావ్యభాషకు కలిగించారు. వ్యావహారిక భాష సులభమైనదని మట్టుకే గురజాడగాని, గిడుగుగాని దానిని సమర్థించలేదు. అద్ది బహుళార్థ సాధకమని వారు విశ్వసించారు. ముఖ్య గా వారు దేశ హితం కోరి వారు దానిని చేబట్టారు. ప్రజలు దేశ వ్యవహార దక్షులు కావలెనంటే గ్రాంధికభాష ప్రబలాటంకమని గ్రహించారు. 'నేడు ఆంధ్రరాష్ట్రము ఏర్పడవచ్చును; రేపు స్వరాజ్యం రావచ్చును. ప్రభుత్వము ప్రజాస్వామికము కానూ వచ్చును. అయితే ఈ రోజులలో మన స్వాములు నిరక్షరకుక్షులయి వుంటే, దేశంనకు ఎంత ఉపద్రవము కలుగునో మన దేశ నాయకులు, దేశభక్తులు, దేశ బంధులు లెస్సగా ఆలోచించవలసియున్నది' (23)

కనుకనే గురజాడవారికి వ్యావహారిక భాషావాదం జాతి జీవన విలసనానికి ప్రాతిపదికగా కనిపించింది.

దేశీయ వ్యవహారాలను అవలోకించి, మానవ సమస్యలను పరిష్కరించే మార్గాలను కనిపెట్టడంలో గురజాడకుండిన పదునైన చూపుగాని, బారైన మనసుగాని రాయప్రోలుకులేవు. జగజ్జన ధర్మమే మనసులో నిలిపి, భారతదేశములో సమాన రాష్ట్రాలను నిర్మించేందుకు

మిగతావారికి దారిచూపమని ఆంధ్రులను కోరిన వంటి కొన్ని సమయాలలోతప్ప, రాయప్రోలువారి హృదయం, నిజమైన లేదా ఊహా కల్పితమైన ఆంధ్రదేశపు ద్వారబంధాలవద్ద ఆగిపోయింది. బ్రిటిష్ సామ్రాజ్యశక్తియొక్క దుర్నీతి ఫలితంగా ముక్క చెక్కలైన ఆంధ్ర భూఖండాలను ఏకంచేసేందుకు రాయప్రోలుచూపిన మార్గం, సోదరులైన ఇరుగుపొరుగులతో కలహించడం. ఓఢ్ర, తమిళ, కర్ణాటక ప్రజలు ఆంధ్రులకు వైరులుకారు; అయా ప్రభుత్వాలు చేజిక్కిన భూమిని విడువనొల్లకపోయి వుండవచ్చును. "సమరసేనావ్యూహ జయపతాకల క్రింద" ఆంధ్ర పౌరుషము చెండాడేది చివరకు స్వజనులనేగాని, విజాతీయ ప్రభుత్వాన్ని కాదు. తా మొకప్పుడు "ఉగ్రబాల తోడుత త్రావియుమిసిన" సంగీత సాహిత్యకళల నభ్యసించేందుకు "దక్షిణము నుత్తరము జూడదగునె?" అనడంవంటివి ఎంత కమ్మగా పాడి జోలకొట్టగల్గినా, జాతి పురోగతికి తోడ్పడకపోగా, దాని మనసున పొగరునించి పనికిరాకుండా చేస్తాయి. అప్పారావుగారు దేశానికి చూపిన దారి ఇటువంటిది కాదు. జమీందారుల కొలువు చేసినా, ఆయన ప్రజలను గురించే ఆలోచించారు. సాహిత్యం, సంగీతం, విద్య – అన్నిటిలోనూ సర్వత్ర ప్రజల విజ్ఞాన స్థాయిని పెంపొందించడానికే. "పాటకపు జనుల స్థితిగతులను చక్కబరచి వారిని వృద్ధికి తేవడం ప్రజాస్వామికపు లక్షణం. ఇక ఇట్టి దుస్థితిలో ఉండుట తగదని ప్రజలకు బోధించి, ఉన్నతస్థితికి ఎట్లు రాగలరో వారికి నచ్చజెప్పవలెను." 24) దేశీయుల నుద్దేశించి ఆయన ప్రబోధం, భూస్వామ్యవ్యవస్థనుండి ధనస్వామ్య వ్యవస్థలో అడుగు పెడుతున్న ఒక జాతియొక్క శ్రేయస్సు నపేక్షించి చేసిన మిత్రోపదేశం వంటిది. భౌతిక వస్తుసమృద్ధి, వాణిజ్యవృద్ధి, దేశీయపరిశ్రమలు ఆయన ఆకాంక్షించారు. పోయినవి పోయాయి. రానున్నదే బంగారు కాలమనుకున్నారు. చరిత్రగతిని గుర్తించడమేగాక ఆహ్వానించారు. అందుచేతనే గురజాడ నవ్యకవిత్వానికేగాక, నవ్యజీవితానికే ఆద్యులు. కాగా, ఈ క్రింద వెలిబుచ్చిన అభిప్రాయాల వంటివి ఎంత పరిహాసజనకాలు, ఎంత సత్యదూరాలు?

'శ్రీ అప్పారావుగారికి కవితా మార్గసంస్కారము (భాషా సంస్కారమునకు) ప్రక్కవాద్యమువంటిది. కాని శ్రీ సుబ్బారావు గారికది ప్రధాన సాధన. కాని ఈ రెండు వ్యక్తులలోను బ్రహ్మత్వము శ్రీ సుబ్బారావుగారికే యిచ్చుట సమంజసమని నా అభిప్రాయం.' (25)

(కురుగంటి శీతారామయ్య)

అప్పారావుగారు నెలకొల్పిన నవ్య కావ్య సంప్రదాయం ఈనాటికీ అవిచ్ఛిన్నంగా సాగుతున్నది. కాని రాయప్రోలు సంస్కరించ బోయినది నానాటికీ క్షీణిస్తున్నది. చరిత్రలో తలయెత్తుతున్న కొత్త శక్తులన్నిటికీ అప్పారావుగారి రచనలే పాఠశాల.

---

## పాదపీఠికలు (Foot notes)

1. Men of letters and the English public in the XVIII century : Alexandur Belijonne.
2. నవ్యసాహిత్య పరిషత్తు సప్తమ వార్షికోత్సవము : అధ్యక్షోపన్యాసము : విశ్వనాథ సత్యనారాయణ.
3. నృసింహ శతకము : శేషప్పకవి.
4. కథలు, గాథలు : చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి.
5. అదే.
6. కామేశ్వరీ శతకము : చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి.
7. కథలు, గాథలు : చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి.
8. ఆంధ్రగ్రంథ విమర్శన ప్రకార లేశము : వేదం వేంకటరాయశాస్త్రి.
9. సాహిత్య వ్యాసములు : దువ్వూరి రామిరెడ్డి.
10. కవిత్వంలో క్రొత్తరీతులు : వచనములాంటి పద్యాలు (వ్యాసం) : మల్లవరపు విశ్వేశ్వరరావు.
11. ఆధునికాంధ్ర కవిత్వంమీద ఆంగ్ల సాహిత్య ప్రభావం (వ్యాసం) : కొత్తపల్లి వీరభద్రరావు.
12. పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము (వ్యాసం) : దేవులపల్లి కృష్ణశాస్త్రి.

13. రమ్యా లోకము : రాయప్రోలు సుబ్బారావు.
14. నేటికాలపు కవిత్వము : అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులు.
15. సాహిత్య వ్యాసములు : దువ్వూరి రామిరెడ్డి.
16. మాటా మంతీ, అవీ ఇవీ : గురజాడ అప్పారావు.
17. అదే.
18. అదే.
19. ముత్యాల సరాలు : గురజాడ అప్పారావు.
20. నవ్యసాహిత్య పరిషత్తు సప్తమ వార్షికోత్సవము : అధ్యక్షోపన్యాసము : విశ్వనాథ సత్యనారాయణ.
21. అదే.
22. శ్రీ రాయప్రోలు సుబ్బారావు కవిత (వ్యాసం) : పిలకా గణపతిశాస్త్రి.
23. వ్యాసావళి : గిడుగు రామమూర్తి.
24. మాటా మంతీ, అవీ ఇవీ ; గురజాడ అప్పారావు.
25. రమ్యాలోక సమీక్ష (వ్యాసం) : కురుగంటి సీతారామయ్య.



# 5. మహా వ్యక్తి

"చూతునా ! అని చూసితిని; మరి
చేతునా ! అని చేసితిని; ఇక
చూడ చేయగరాని వింతలు
చూపి కన్నుల కట్టితిన్"

—లంగరెత్తుము : ముత్యాలసరాలు

సాహిత్య ఫలసాయమే కొరవడినట్లయితే, మృత్యుంజయుడై వుండగలిగేవాడా గురజాడ వెంకటరామదాసు పంతులు కొమార్డు జి. వి. అప్పారావు, బి. ఏ.? పేదరికం పులిపంజా దెబ్బనుండి మనోనైశిత్యాన్ని రక్షించుకొని, దివాన్ల ప్రిన్సిపాళ్ళ సాయాన ఇడుమల మొసళ్ళునిండిన చదువుల నది నీది, డిగ్రీల తీరం చేరుకొని, బడి పంతులై నూరు రూపాయలతో తృప్తిపడి, ఒక జమీందారు హృదయాన్ని అలరించి వుండవచ్చును. సంస్థాన శాసన పరిశోధకుడై వుండవచ్చును. ఒక విశ్వవిద్యాలయం తాలూకు సినేటులో శాశ్వత సభ్యుడై వుండవచ్చును. ఎందరో విద్వాంసుల చెలిమి లభించి వుండవచ్చును. ఇన్ని, ఇకనన్ని హంగులున్నా, మరపు మరుగున పడిపోయి వుండేవాడు.

ఏభైనాలుగేళ్ళ అయుఃపరిమితి మాత్రమే అతనిది (1862–1915). అందులో మొదటి ముప్పైనాలుగూ చివరి నాలుగూ, సాహిత్య సృజనతో నేరుగాగానీ జోరుగాగానీ ముడిబడలేదు. పోగా,

మిగిలిన పదహారేళ్ళలో తరంగసన్నిభంగా దూకివచ్చిన కావ్య నాటిక కథా వ్యాస రచనల మూలంగానే అతని స్మృతి మృతిని ధిక్కరించ గలుగుతున్నది. ఇది ఆశ్చర్యకరమే గాక అసంగతంకూడాను. దాదాపు నలభైయేళ్ళ బతుకంతా బూడిదబుంగ అనడం సమర్థనీయం కాదు. నిజం ఆలోచిస్తే, సాహిత్యజీవితానికి ఇది భిత్తిని సమకూరుస్తున్నది. అనుభవ దారిద్ర్యమూ అనుభూతి కాటకమూ దీనివల్లనే అతనికి తప్పాయి. ఈ సాహిత్యేతర జీవితం చేతబెట్టిన సువర్ణరజంనుంచే పదారు వన్నెల మేలి పసిడి వెలువడింది. మహావ్యక్తి యిచ్చిన చేయూతతోనే గురజాడ అప్పారావు మహా కవిత్వానికి ఎగబాక గలుగుతున్నాడు.

దర్శనం, విమర్శనం అని ద్విధా కనిపించే ఏక పదార్థం ఆసక్తి అనేది, గురజాడ అప్పారావుకు జన్మతః సంక్రమించిన పైతృకం అని పిస్తుంది. దూరాభారాలెంచక మచిలీ బందరునుంచి విజయనగరానికి లంఘించిన వెంకట రామదాసు వట్టి అన్నార్తుడనీ ఉద్యోగాన్వేషి అనీ తేలికగా తేలిపోయే వ్యక్తిగా లేడు. రక్తనిష్ఠితమైన సాహసికత్వ మేదో అతని ఆస్తిగా కుమారులకు లభించింది. ఆరువేల నియోగి అయి వుండీ, శాఖాంతర వివాహాలు నిషిద్ధాలయివుండీ, రెండు వంద లేళ్ళ క్రితమే గురజాడ పట్టాభిరామయ్య శ్రీనాథుని సీతారామయ్య అనే గోలకొండ వ్యాపారి పంతుల కుమార్తెను పెళ్ళాడాడు. గురజాడ గ్రామం వదలి, మామగారి స్వస్థలమైన మచిలీపట్నంలో నెలకొన్నాడు. ఆయన రెండవకొడుకు మాతామహుని పోషకులైన ఫెంచివారి నౌక రీని కాకుండా, ఇంగ్లీషుకుంపెనీలో వుద్యోగి అయ్యాడు. గురజాడ వారందరికీ ఈ ఉత్సుకత సాధారణ లక్షణమైనట్లుంది, కొత్తమీద రోఁకు.

వెంకట రామదాసు ఆ ఇంగ్లీషు కంపెనీ వుద్యోగి కుమారుడు. ఆయన విజయనగర ప్రభువైన విజయరామగజపతిని మెప్పించిన కథా కమామిషూ చూస్తే, అతని కుమారుడు అప్పారావు విజయరామగజపతి కుమారుడైన ఆనందగజపతి మహారాజు మనస్సునకెక్కిన వైనం ఎన్నో పోలికలతో కనిపిస్తుంది. మచిలీపట్నాన్నీ, పాండిచేరినీ ఫీటు చేసిన

చెన్నపట్టణంలో కోటగట్టి ఏలుబడి ప్రారంభించిన ఇంగ్లీషు దొరతనం వారికి సంస్థాన వ్యవహారాలనుగురించి ఒక నివేదిక రాసిపెట్టేందుకు, విజయనామగజపతికి నవయువకుడైన ఈ రామదాసుతప్ప మరెవ్వరూ కనిపించనట్లు, రామదాసు మహారాయసగాడైనట్లు, అందుచేత రాజాశ్రయం లభించినట్లు, సదరు రామదాసు మనవడైన రామదాసు వ్యాసంబట్టి తెలుస్తుంది (1) అప్పారావుతండ్రి ఉభయ భాషా విదుడు. తెలుగున కవిత్వం కూడా చెప్పగలిగినవాడు. అయినా సంపాదన మాత్రం అంతంతగా వుండేది.

కుమరాం ఠాణా గుమాస్తాగా మొదలైన రామదాసు ఉద్యోగ జీవితం స్థలాంతరాలలో హెూదామార్పులతో బహువిధంగా కొనసాగింది. చీపురుపల్లి ఠాణాకు పేష్కారు. జలంత్రా ఎస్టేటు అమీను. శృంగవరపుకోట సర్కిలు సూపర్వయిజరు. విజయనగర సంస్థాన సేవలో ఒళ్ళుసడలి తలపండిపోయింది. బహుశా జ్యేష్ఠ పుత్రుని సిఫార్సుతో విజయనగరంకోట ఖిల్లేదారు కాగలిగినాడు. యువకుడూ ఎంతో భవిష్యత్తువున్నవాడూనని, జిల్లా మున్సబుకోర్టు శిరస్తదారైన గొడవర్తి కృష్ణయ్య, రామదాసుకు కౌసల్యమ్మనిచ్చి పెళ్ళి చేశాడు. సిపాయిపితూరీ మరొక సంవత్సరం కద్దనగా ఈ పెళ్ళి జరిగింది. బాల్యవివాహమని చెప్పనక్కరలేదు. అటు తర్వాత ఆరేళ్ళకుగాని కౌసల్యమ్మ చూలుమోయలేదు. మొనసూపాక ఏడు మాసాలకంటె ఎక్కువకాలం కూడా మోయలేదు. ఎందుకంటే, గురజాడ వెంకటఅప్పారావు బతుకులోనేగాకుండా పుట్టుకలోగూడా అసామాన్యుడు కాబట్టి. జీవనంలో కాలగతికంటె రెండడుగులు ముందునడచిన వ్యక్తి, జన్మలో కాలపరిమితికంటె రెండునెలలు ముందుగా సాగివచ్చాడు చావు తప్పిందిగాని కన్ను లొట్టబోయిందన్నట్లు, బతకనైతే బతికాడుగాని బట్టమీద బట్టకట్టి, మందుమీద మందు లోపలికి నెట్టి, వ్యాధి నిలయమైన దుర్బలదేహానికి అధిపతి కావలసివచ్చింది. 1862 సెప్టెంబరు 21. అప్పటికింకా వెంకట రామదాసు చీపురుపల్లిలోనే వున్నాడు. జీవన ప్రారంభంలోనే వున్నాడు.

చిన్న వుద్యోగుల పిల్లలబాల్యం ఎట్లాగుంటుందో గురజాడ అప్పారావు బాల్యమూ అంతే. అమ్మమ్మ ఇంట ముద్దు ముచ్చటలు కరువయ్యాయని కాదుగాని, ఉద్యోగధర్మంలో వూళ్ళేగవలసి వచ్చిన తండ్రి ఎక్కడా ఇంతగడ్డి మొలవనిచ్చినట్లు లేదు. ఠాణా కేంద్ర మైన కుమరాంలో సదుపాయాలు తక్కువ వ్యయాలెక్కువని కాబోలు, దగ్గరలో వున్న గులివిందాడ అగ్రహారంలో సంసారం పెట్టాడు. అప్పుడప్పుడు తల్లితోబాటు, అమ్మమ్మగారి స్వస్థలమైన రాయవరం అగ్రహారానికీ, ఉద్యోగస్థలమైన ఎలమంచిలికీ ప్రయాణాలు జరిగేవి. పంచాక్షరీ మంత్రమూ, అక్షరాభ్యాసమూ మాతామహుల సమక్షంలోనే జరిగినా, వెలివల రామమూర్తిగారి ధర్మమా అని త్వరలోనే చీపురుపల్లిలో ఆంగ్లంకూడా అభ్యస్త మయింది. ఇంతలో అప్పారావు ఏడేళ్ళవా డయ్యాడు. పెద్ద చదువులకు బస్తీలకు పోవాలి. ఆర్జన ఆరగింపుకేగాని అదనంకాదు. అందుచేత, తాను యివ్వకున్నా ఇప్పించ గల ఒకానొక అయ్యను ఆశ్రయించక తప్పలేదు. విజయనగరం దివాను జగన్నాధరాజు, ఒక మాధ్యమిక పాఠశాలలో జీతంలేకుండా చదువుకొనే వసతిని కల్పించి, గురజాడ అప్పారావుద్వారా ఆంధ్రదేశానికి ఒక విద్యాగురువును ప్రసాదించాడు. అయినా ఎన్ని ఇక్కట్లు!

"లేనివాళ్ళ పిల్లలకు పాపం అన్నీ ఇబ్బందులే. జీవితంలోవున్న వ్యత్యాసాలను, అసమానతలను చూసి పిల్లలు యేమని తలపోస్తారో కదా!" (2)

తాను దాటివచ్చిన సుడిగండాలను తలచుకొంటేనే అప్పారావుకు ఎంతో క్లేశం కలిగేది. పరులకలిమికి ఓర్లియేడ్చే స్వభావం కాదు గాని, ఐశ్వర్యగర్వంకలిగిన పిల్లలు చూపేడాబు దర్పాలు అవతలి వారి నే విధంగా బాధిస్తాయో స్వానుభవంద్వారా గ్రహించగలిగాడు. తెలివితేటలుండీ డబ్బులేక చదువు మానుకొనే యువకులగురించి ఆలోచించగలిగి, ఒంగోలు మునిసుబ్రహ్మణ్యంవంటి అప్పటి పేద విద్యార్థులకు ఆదరువయ్యాడంటే, అప్పారావుకు తన బాల్య మనస్తాపాలు మరవుకురాలేదు కాబట్టే. చిన్నతన మనేది వెనుకబడిన

ముప్పైఏళ్ళ తదనంతరం కూడా, ఆనాటి హృదయశల్యాలు సలుపు తూనే వుండినట్లు ఆయన డైరీలు సాక్ష్యం పలుకుతున్నాయి. "నా చిన్న నాటి రోజులు తిరిగి రావలెననే కోరిక యిక నాకు లేదు. ఎప్పుడూ యేదో ఒక దిగులు: డబ్బు లేకపోవడంవల్ల ఎన్నెన్ని చిక్కులు. ఆ దుర్దినాలు వెళ్ళిపోయాయి, వెళ్ళిపోయాయి! పూర్తిగా మటు మాయమైపోయాయి! అమ్మయ్య! ఎట్టి విపత్తు!" (3).

ఆర్థికభద్రత అనేది ఆదిలో గురజాడ అప్పారావుకు పరమ ధ్యేయం. 1887లో మహారాజావారి కళాశాలలో ఉద్యోగం లభించిన ప్పుడు కలిగిన అపరిమితానందానికి ముఖ్యకారణం "మనశ్శాంతి". చీకుచింతలు లేని బతుకులో గల తీయని అనుభవానికి రాకముందు, దాటిన అవాంతరాలు అనేకాలు. ఎలమంచిలి జిల్లామున్సబు కోర్టు తలుపులమీద సుద్దముక్కతోటి, ఎనిమిదేళ్ళ రాలుగాయ ఒకడు, "జి. వి. అప్పారావు, బి. ఏ, బి. యల్; జిల్లా మున్సబు" అని రాయ గానే సరిపోలేదు. ఇల్లు అలకడంకూడా పూర్తికానప్పుడు పండగ వూసెందుకు? గురిమాత్రం దొడ్డదని (బార పొట్టిదైనా) తెలుస్తున్నది.

ముదరకముందు పిల్లకాయగానే అప్పారావుకు హాస్యం ద్వితీయప్రకృతి అయితే, అపహాస్యం ఆద్యప్రకృతి అయింది. నిష్ఠురమైన బతుకు వుండేలుదెబ్బ ఈ పిల్లకాకికి అప్పటికి పూర్తిగా తెలియదు. తెలిసినా దానికి హాస్యాన్ని సంధానించినప్పుడు, అది అస్వాద్యమే అయింది. పండితులను పల్టీలుకొట్టించి, ఆకాశరామన్నల నోళ్ళ తాళం కప్పలు మూయించకముందే, దానికి రంగాలంకరణంగా, గిడుగు రామమూర్తితోటి గురజాడ అప్పారావు బడిపంతుళ్ళమీద దాడి సాగించారు. పెద్దల చేష్టలకు పిల్లల దుశ్చేష్టలే మూలాలయ్యాయి.

1881 అప్పారావు జీవితంలో మలుపు. పంతుళ్ళమీద కట్టిన తిట్టుకవిత్వమేగాక, అచ్చమైన ఆంగ్ల కవిత్వంకూడా రాయగలడని అప్పారావు రాసిన "కకూ" గేయం గురించి స్కూళ్ళ ఇనస్పెక్టరూ, పైగా సీమదొర అయిన మన్రో భావించాడు. కళాశాల ప్రిన్సిపాలు చంద్రశేఖరశాస్త్రి ధ్రువీకరించాడు. ఇద్దరు పండితుల మెప్పు చూర

గొన్న బాలకవి, విద్యాభోజుడైన ఆనంద గజపతి కటాక్షానికి లక్ష్య మయ్యాడు. సంగతి సందర్భాలు విచారించాడేమో, అప్పారావు అక్కర తెలిసివచ్చి, పూరకే దానధర్మాలు చెయ్యడం సరిపడనందుచేత తనకు వార్తాపత్రికలు చదివి వినిపించి నెలనెలా జీతం పట్టుకుపొమ్మని వుత్తరువు చేశాడు. ఇక, చంద్రశేఖరశాస్త్రిగారి వృద్ధజనని అప్పారావులో మరొకబిడ్డను చూసింది. బండి దారిలో పడింది.

సూదిగా దూరి దబ్బనంగా మారినట్లు ఆనంద గజపతికి ఆశ్రితుడుగా మొదలై అంతరంగికుడుగా పరిణమించక ముందు, అప్పారావు నెగ్గవలసిన విద్యాగ్ని పరీక్షలు రెండు. మెట్రిక్యులేషను పరీక్షలో ప్రథమశ్రేణి ఫలితం, హైస్కూలులో 1884లో నెలకు ఇరవై రూపాయల ఉద్యోగానికి వీలు కలిగించింది. ఇదే ప్రాయాన ఇంగ్లీషులో 'సారంగధర' పద్యాలురాసి, 'ది ఇండియన్ లెఝర్ అవర్' (The Indian leisure hour) లో ప్రకటించి, ఆంధ్రదేశం ఉత్తరాగ్రం నుండి వంగదేశ హృదయాంతర్భాగంలోకి తోకచుక్కలా దూసుకుపోయాడు. శంభుచంద్ర ముఖర్జీ తన 'రీస్ అండ్ రయత్' పత్రికలో వీటిని పునర్ముద్రించుకొని, ఆమరణాంతం వంగ మేధావులతో అప్పారావుకు హార్దికాను బంధం ఏర్పరిచాడు. ఒకవైపు ఉపాధ్యాయుడుగా వుంటూనే మరోవైపు విద్యార్థిగా జీవించడం ఈ కాలంలోనే అభ్యాసం కాగా, ఇరవైనాలుగేళ్ళ వయస్సులో అప్పారావు బి. ఏ. పరీక్షలో నెగ్గడమే గాకుండా, ఇంగ్లీషు భాషాభాగంలో ప్రథమశ్రేణిని సంపాదించాడు. వెంటనే కళాశాల ఆవరణలో ప్రవేశం లభించింది. ఈ లోపల వేరే తెన్నుపట్టిన మనస్సు డిప్యూటీ కలెక్టరాఫీసులో గుమాస్తాగిరికి ఈడ్చింది. అయితే, ఆనందగజగపతిని కిఖరించలేకపోయాడు. అప్పారావువంటి యువకునికి ఏదితగునో ఏదితగదో మరొకరు నిర్ణయించవలసివచ్చింది. దివాన్గిరీవరకు మెట్లుపరచుకొన్న ఈ రివెన్యూ వుద్యోగ నిశ్రేణినుంచి అతన్ని లాగివేయవలసిందనీ, కళాశాలలో ఇముడ్చుకోవలసిందనీ నాగోజీరావు చెప్పిన సలహామేరకు, తన కళాశాలలో నాల్గవలెక్చరరుగా నెలకు నూరురూపాయల జీతంమీద నియోగించడం జరిగింది.

నాల్గవ లెక్చరరుగా నాలుగేళ్ళు పనిచేసి, 1891లో మరో ఇరవై అయిదు రూపాయలు జీతంవచ్చే మూడవలెక్చరయ్యాడు. తత్వశాస్త్రం, ఆంగ్లం, సంస్కృతసాహిత్య చరిత్రం, గ్రీకు, రోమన్ చరిత్ర, వ్యాకరణం-బహువిషయాలు బోధించేవాడు. ఆనందగజపతికి వార్తా పత్రికలు చదివి వినిపించినందుకు నెలకు మరో యాభై. ఆస్థానంలో ఏర్పడిన చర్చావేదికకు ఉపాధ్యక్షపదవి. దిగ్దంతులవంటి పండితుల సాహచర్యం. దినదినాధిక పఠనాసక్తి. ఆనందగజపతి ఆస్థానం సరస్వతీస్థానం. ఇంగ్లీషు, పుర్దూ, తెలుగు, సంస్కృతం, పారశీభాషా పండితుడైన రాజు నిర్వహించే నిరంతర గోష్ఠులలోనే అప్పారావు ప్రతిభాకోరకం విప్పారింది.

ఏ విధంగానూ చరిత్రను సృష్టించేటంత మహత్వం లేదని, సాహిత్య కృషి పరిమితమైనదేనని ఆనందగజపతిని గూర్చి అప్పారావు విమర్శగా చెప్పినప్పటికీ, (4) బతికివుండినన్నాళ్ళు ఆనందరాజు ప్రభావ వలయంలో అప్పారావు జీవించాడు, చరించాడు, మనస్సును నిలుపు కొన్నాడు. శంభుచంద్ర ముఖర్జీ తట్టి లేవగొట్టింది అప్పారావు కవి-వ్యక్తిని కాగా, అనందగజపతి ప్రబోధించింది అప్పారావు మానవ-వ్యక్తిని. వీలు దొరికినపుడెల్లా ఆయన పొగడికలు అప్పారావు లేఖిని నుండి వెలువడ్డాయంటే, కారణం రాజభక్తి, సేవకాధర్మం కాదు. చిత్తం బత్తెం అనడం తనకు అలవాటులేదు. ఆనందగజపతికి అహంకారం వున్నా అది ఇతరులకు అనర్ధహేతువు కాలేదు ఇతరులలో నిద్రాణమైవున్న ప్రతిభను ప్రోత్సహించి బహిర్ముఖం చేయడానికి నిరంతరం కృషి చేసి, రుజువైన సామర్థ్యాన్ని ధనరూపేణాకూడా ఆయన సత్కరించాడు. నిజానికి 'బిల్హణీయ' నాటకంలోని రాజ పండితుడైన కర్ణుడు ఆనందగజపతే. అయితే, అహంకార కళంకం లేని విద్యాపక్షపాతి కర్ణుడు, ఆనందగజపతికి కవి కల్పించిన ఆదర్శమూర్తి. "నేను రాజునైనను, కించజ్ఞుడను. రాజునోటనే కించజ్ఞుడను అన వచ్చును." (5) లోపమున్నా, రాజులందరివలె ఆనందరాజు "విద్యా ఘూకం" కాదు.

మానవుడుగా ఆనందగజపతిని అప్పారావు అధికంగా గౌర

వించాడు. తాగుడు, వేశ్యాసంపర్కంవంటి వ్యసనాలు వుండవచ్చును. నిజానికి, కోకోవైన్ తాగే అలవాటు అప్పారావుకు ఈ ద్వారా కలిగింది. రాజాశ్రితులైన వేశ్యాజనంతోటి సాన్నిహిత్యంకూడాతప్పలేదు. అయినా, ఒక లకజ్ఞుని పద సన్నిధానంలో కూర్చున్నట్లుగా, జీవిత వేదభాష్యాలు వింటున్నట్లుగా, సంస్కృతీ పుష్పసౌరభం ఆఘ్రాణిస్తున్నట్లుగా, జీవనకళాస్వాదుత్వాన్ని ఆస్వాదిస్తున్నట్లుగా, ఆనందగజపతి మాటనూ చేష్టనూ అప్పారావు విశ్లేషించాడు. దాని ఫలమే, అప్పారావులో అదృశ్యంగా మొలకెత్తిన "సమన్వయ దృక్పథం."

"ఆయన మాట్లాడుతున్నప్పుడు, హృదయం స్పందిస్తుంది. దివ్యానుభూతులు జ్ఞాపకమొస్తాయి. అవి ప్రసంగాలు కావు. ఉపదేశాలు. ఆయన జీవితాన్ని తాత్వికదృష్టితో వీక్షిస్తారు."

అప్పారావు గురుప్రవర చెప్పేటప్పుడు, ఆనందగజపతిని పేర్కొని తీరాలి. అతని స్వగతాలే యితని సందేశాలుగా, ఆ గుసగుసలకు ఈ మంత్రాలు పుట్టినట్లు, సూక్ష్మ తారతమ్యపరిశీలన తెలుపుతుంది. అప్పారావు జీవిత ప్రాతఃకాలమంతా ఆనందగజపతి సౌజన్య శాంత గాంభీర్యాలలో స్నానంచేసింది. స్వచ్ఛందమనిపిస్తూనే రాజనీరిష్ఠమైన చరిత్ర పరిశోధనం అప్పారావుకు యీ ద్వారానే ఒక వ్యాపకమైంది. పూసపాటివారి పుట్టుపూర్వోత్తరాలగురించి తహతహగా మొదలై, కళింగదేశ చరిత్రాసక్తివరకు విస్తరించిన ఈ అభినివేశం, అప్పారావు జీవితాన్ని కూడా మార్చింది. తమ పూర్వులలో ఒకరికి 'సుబేదారు' బిరుద ముండినట్లు నిరూపించినందుకు, అప్పారావుకు పొగడ్తలతోబాటు పసదనం కూడా ముట్టింది. ఆనందగజపతి అంతటితో తృప్తిపడ్డాడేమో గాని, అప్పారావు అహరహం శ్రమించి, ఆరోగ్యం వ్యయించి మద్రాసులోనూ, బెంగుళూరులోనూ పుస్తకాలు తొలిచి శాసనాలనుండి పురారహస్యాలను ఒలిచి ఎంతో సామగ్రి పోగుచేశాడు. అయితే ఇది ఒక వ్యసనప్రాయమై, ఆరోగ్యాన్ని చావుదెబ్బకొట్టగా, ఆనంద గజపతి అప్పారావును మద్రాసుకు తీసుకెళ్ళి డాక్టరు బ్రౌనింగుచేత పరీక్షజరిపించిన ఫలితంగా, అధ్యాపకవృత్తికి శారీరకంగా యిక చాల

డని తేలింది. అయితే 1896 లో శాసనపరిశోధకపదవి (Epigraphist) లభించింది.

పసిపిల్లనికంటె పదిపౌన్ల బరువే అదనం తూగుతున్న దుర్బల శరీరం దుర్బలాధికమైంది. గాలికి నిలవలేని నిస్సత్తువ. శాలువమీద శాలువ, తలపాగా, కోటుమీదకోటు : అయినా గాలి తగలగూడదు. మధ్యాహ్న విరామక్రమం తప్పిందంటే, ఒంటిలో కుంపటి సెగలు బయలుదేరేవి. సూర్యుడి అస్తమయతో లోకంలాగు తన దేహం కూడా నీరసించేది. కాఫీ గుక్కెడు లోనికి పోకుంటే మేనువాల్చ వలసిందే. అయితే కాఫీ దాస్యం కడుపులో యాసిడ్ కలిగించి నిద్రను హరించేది. రాత్రి భోంచేస్తేగాని అది తగ్గదు. పెద్దలతో సాంగత్యం వల్ల క్లారెటు, కోకో, వైను సేవించడం మొదలైంది. అయితే, మెదడు వల్ల తప్పిపోయేది. ఇలాంటి పరిస్థితిలో డాక్టర్ బ్రౌనింగ్ సలహావచ్చింది. నరాలు ఎక్కడి వక్కడ విడిపోయినంతగా పాడ య్యాయి.

సంస్థానం హుజూరు ఆఫీసులో పని శాసన పరిశోధన మట్టుకే కాదు. చిత్తా ఆవర్జాలు చేతికివచ్చాయి. బేరీజులు మోహరించాయి. ఊళ్ళు తనిఖీ చెయ్యాల్సి వచ్చింది. సంస్థానం తాలూకు వ్యాజ్యాలు సరిచూడవలసి వచ్చింది. వచ్చేపోయే సర్కారు వుద్యోగులకు అన్నీ సమకూర్చవలసివచ్చింది. పిడకలవేటలో రామాయణం లాగా, రద్దీ తగ్గినప్పుడు "కన్యాశుల్కం" రచనకు శక్తీ యుక్తీ ధారపోయవలసి వచ్చింది. ఆనందగజపతి ఈ మహానాటక రచనకు ఒక విధంగా కారణ భూతుడయ్యాడు బ్రాహ్మణ వివాహాల గురించి సంస్థానం సేకరించిన భోగట్టా అప్పారావును నొవ్వించింది కనకనే నాటక రచనకు కవ్వించింది. హిందూస్థానీ పనికత్తెకు జీతం, బాడీసు సరిగా వుతకని చాకలికి జుల్మానా, వడ్డీలెక్కలు : వీటిమధ్య గిరీశం, మధురవాణులు !

ఆనందగజపతి పోతూపోతూ, సోదరి రీవారాణీతోను, తల్లి అలక రాజేశ్వరితోను, అప్పారావు తనకు సోదరతుల్యుడని చెప్పి మరీ పోయాడట ! అతని మరణకారకమైన ఘటనలోకూడా అప్పారావు

స్వయంగా వున్నాడు. వెలిగాడ కొండలకు వినోదార్థం వెళ్ళి తిరిగి వస్తూ గుర్రంమీదినుండి జారిపడి దెబ్బతిని చనిపోయినమాటకేమి గాని' భార్య వనజకుమారి గతించిననాటినుంచీ ఆనందగజపతి కాటికి కాలు సాచినట్లే లెక్క. వనజకుమారి చిత్రకళాభినివేశం అప్పారావు బాల్యంలో గీసిన హాస్యచిత్రాల స్మృతులను పునరుద్ధరించి వుంటుంది. వర్ణ విన్యాసం మీద మనస్సు కలిగి, స్విట్జర్లాండునుండి కొన్ని చిత్రాలను తెప్పించి వుండేందుకు ఏదో ఒక సమీప ప్రోత్సాహంవుండాలి. అదే విధంగా అతని సంగీతానురక్తిగూడా ఆ స్థాన గాయకుల సాహచర్యంతోటి, బిలియర్డ్సు, పింగ్‌పాంగ్, టెన్నిస్, తదితర క్రీడాసక్తి సంపన్న వ్యక్తుల సహవాసంతోటి పెంపొందాయి. ఒక విధంగా అని గాక అనేక విధాలుగా ఆనందగజపతికి అప్పారావు ఋణపడి వున్నాడు. ఎన్నడో చేయిజాచి పుచ్చుకొన్న రెండువేల రూపాయల అప్పు మరెన్నటికోగాని తీర్చలేక పోయాడనేది ఈ విశేష ఋణంలో స్వల్పాంశమే. అందుకనే ఆనందగజపతి 1897 లో అస్తమించినప్పుడు అప్పారావు హృదయ రుధిరంతో ఇలా రాశాడు:

"శ్రీ విజయనగరం మహారాజావారు, నేను దారాపుత్రులకన్నా తల్లిదండ్రులకన్నా అధికంగా ప్రేమించినవ్యక్తి, పరమపదించారు." (7)

దార! పుత్రుడు! నిజమే, పట్టభద్రుడుకాగానే అప్పారావుకు వివాహయోగ్యత పెరిగింది. దేవరాపల్లి గ్రామకాపురస్తుడు ఎల్లాప్రగడ సన్యాసిరాజు అనే సంపన్న గృహస్థు కన్యాదాత. అప్పలనరసమ్మ అప్పారావుగారిభార్య. అప్పారావు ఆరోగ్యం సంతానోత్పత్తికి ప్రతిబంధకం కాలేదుగాని, మన్మథవాంఛా సంతృప్తికి మాత్రం అడ్డు నిలిచింది. దాంపత్యసుఖం పొందాక మెదడు కట్లుతెంచుకోవడం అతనికి మామూలైంది. దానికితోడు, మూత్రవ్యాధి. నాలుకకు పుండు. పాలుకూడావెలి. అదిపోయాక బ్రోంకైటిస్. ఆ తర్వాత పుర్రెలో సూదులపోటు. మలబద్ధకం. నిత్యజ్వరం. పురిటిలో కొట్టిన సంధి తప్పిందిగాని, వ్యాధిబీజం శాఖోపశాఖలైంది.

"తీరిక అనేది చిక్కి కాలం నా చెప్పుచేతల్లో వుంటే, యిటువంటి యింట్లో 'రిటైరు' అవుతాను! రిటైరు కావడం! విశ్రాంతి! ఎంత వింతైనమాట! ఎన్నడూ వినని మాట! ఈ మాటకేమన్నా అర్థం వున్నదా!" (డైరీలు)

విజయనగర ముఖాన్ని దర్శించి 1897 నాటికి దాదాపు పాతికేళ్ళు. దేవిడీతోనే గాక, పౌర జీవితంతో సాన్నిహిత్యం ఏర్పడింది. ఆనందగజపతి ఏర్పాటు చేసిన క్షామనివారణ సంఘంలో సభ్యుడు కావడమేకాదు. స్థానిక కాంగ్రెసు సభలో ఉపన్యాసం చేయడం కూడా చాలా ముఖ్యం కాదు. "ప్రకాశిక" అనే పత్రికకు సారథ్యం వహించడం తోసివేయదగిన స్వల్పాంశం కాబోదు. కస్పావీధి రేట్ పేయర్సు అసోసియేషనుకు అధ్యక్షపదవి, మునిసిపల్ కౌన్సిలులో సభ్యత్వం, అప్పారావు సంఘ హృదయానికి చూపుడు వేళ్ళు. నీటి ఎద్దడి నివారించేందుకు కొళ్ళాయిలు వేయించడంలో శ్రద్ధచూపెట్టాడని తెలుస్తున్నది. పూర్వపు కౌన్సిలర్లు వీధులలో తామే తమ పొరుగువాడి యింటి ముందు చెత్తా చెదారం పోయడం, అతని దృష్టిలో ఒక హాస్య సన్నివేశమై గ్రంథస్థమయింది.

ప్రభువులు మారడంతోటి అప్పారావు పలుకుబడిలో కూడా కొంత మార్పురాక తప్పలేదు. ఆనంద గజపతి మేనమామకుమారుడు 'చిట్టిబాబు' విజయరామగజపతిగా అలకరాజేశ్వరికి దత్తుడయ్యాడు. కాస్మండు రాజకుమారి లలితకుమారిని విజయరామగజపతి పెళ్ళాడక ముందు కాశీలో జరిగిన తెరవెనుక భాగోతంలో అప్పారావుకు అనల్పమైన ప్రాముఖ్యమే కద్దు. లలితకుమారి అప్పారావును పితృసమాన గౌరవంతో సత్కరించేది. అలకరాజేశ్వరి, అప్పలకొండయాంబ (రీవారాణి)లు కూడా యథాపూర్వంగానే ఆదరిస్తూ వచ్చారు. విజయరామగజపతి వైఖరి ఏవిధంగా వుండేదో తెలియదుగాని, అతని కొత్త ఉద్యోగులు మాత్రం అప్పారావుపట్ల మొరటుగా ప్రవర్తించారు. హుజూరువద్ద గాకుండా, ఆఫీసులో పనిచేసి బుద్ధిమంతుడి వనిపించుకొమ్మని 'జా. మే.' అనే వ్యక్తి హితోక్తి. తన ప్రవర్తనను

గురించి మరింత జాగ్రత వహించవలసిందని సంస్థానం కలెక్టరు విల్లక్ దొర వార్నింగు. రీవా రాణికి అంతరంగిక కార్యదర్శి (Private Secretary) గా 1898 లో నియుక్తుడైనంత మాత్రాన, సంస్థాన పాలనాదికాలలో వేలుబెట్టడమేనా ?

సంస్థానసేవలో తలనెరిసి తనువు డస్సిన వెంకటరామదాసు తిరుగుళ్ళు తిప్పట్లూ మాని విజయనగరం కోట ఖిల్లేదారుగా వచ్చి కుమారుడివద్ద స్థిరపడిపోయాడు. మిగిలింది ఈ ఒక్కడే. చిన్నవాడైన శ్యామలరావు మద్రాసులో లా చదువు పూర్తిగాకమునుపే కన్ను మూశాడాయె! ఆ దుఃఖం ఉభయులకూ తగ్గేందుకు దోహదంచేసింది ఈ కుటుంబంలో కొత్తగా సభ్యులైన అప్పారావు బిడ్డలవల్లనే. ఆ పిల్లలూ పెద్దలౌతున్నారు. బాధ్యతలు గుర్తింపుకు వస్తున్నాయి. తనకు స్వర్ణకారవిద్య తెలీదు. సంపన్నుల అభిమానాలను రు. అ. పై. లుగా మార్చుకొనే నేర్పు ఎక్కువగా లేదు. అయినా తాను నిర్భాగ్యుడేమీ కాదు ఒకవిధంగా స్థితిమంతుడే కాగలిగాడు. చిననాడు రాయవరాగ్రహారంలో తాతగారి పొలాలను, తోటలనూ ఎంతో ఆసక్తితో చూసేవాడు. ఇప్పుడు తానే వ్యవసాయదారుడు కాగోరాడు. అదీ సాదా వ్యవసాయం కాదు. శాస్త్రీయ పద్ధతులమీద మనస్సు నిలిచింది. మదరాసులోని మోడలుఫార్మ (Model Farm) దర్శించి, అరటీ చెరకూతోటలగురించి భోగట్టా సేకరించి, తదనుగుణంగా విజయనగరం పొలిమేరలలో ఏర్పడిన భూస్థితిని సద్వినియోగం చేసుకోవడం మొదలైంది. "నేంద్రకోజా" మలబారు అరటిమొక్కలు నాటించడం, అనాస మొక్కలు పాతించడం, చెరుకుపొలంలో ఏడురోజులపాటు గొర్రె మందనుకట్టించడం, చెరువుకు నీరెక్కించడం - బ్రాహ్మణ వ్యవసాయం అనేదానికి రూఢ్యర్థం వైదొలగింది.

విజయనగర సంస్థానం తోటి ఏర్పడి బలీయమైన అనుబంధం ఆర్థికంగా లాభించకున్నా, అప్పారావు పలుకుబడి మాత్రం బాగా పెరిగింది. నిలువుగానూ అడ్డంగాను. అంటే, సామాన్యులతో విశేష పరిచయాలొకవైపు, అధికారానధికార శ్రేష్ఠులతో శిష్టులతో ముఖపరిచయాలింకొకవైపు. విశాఖపట్నంనుండి విజయనగరంవరకు

అనుగమించి సమక్షంలో గవర్నరుకు సపర్యలుచేయడం సామాన్యులకు సాధ్యమైన విషయంకాదు. రైతులను వెంటబెట్టుకొని సంస్థానం ఆఫీసుకుపోయి వారి కష్ట సుఖాలు నివేదించడం అసామాన్యులకు రుచించే విషయంకాదు. మరి, అప్పారావు సామాన్యుడైన అసామాన్యుడు. కలెక్టరువంటి వుద్యోగులతో లావాదేవీలు ఈ అసామాన్యునికి పరమ సామాన్య విషయాలు. మహారాజు పరివారంలో ఇరవయ్యవ శతాబ్ది ప్రారంభకాలాన్ని కాశీలోనూ కలకత్తాలోనూ గడిపి, ఎండకాలం వండనుండీ వడనుండీ నీలగిరులకు పారిపోయే శుద్ధాంతకాంతల పరివారంలో ఊటీ చోద్యాలను పరికించి వారిలో ఒకడుగా మారిపోయాడు. అప్పటికే రచ్చపాలైన సంస్థాన వారసత్వం రావిడిలో అప్పారావు తానే ఒక వకీలంత వాడై పోయాడు. స్వయంగా న్యాయశాస్త్రం పఠింప నారంభించాడు. అడ్వొకేటు జనరల్ అయిన శ్రీనివాస అయ్యంగారంతటి మేధావిని తన తెలివితో ప్రజ్ఞతో ఆగట్టుకొని పరిచయాన్ని మైత్రిగా మార్చుకోగలిగాడు. ఇలాంటి ఒక పయాణ సందర్భంలోనే అప్పారావుకు 1905లో పితృవియోగం కలిగింది. అయితే కవిగా 'నీలగిరిపాటలు' లాభించాయి.

లావా–దేవిడీ అయిన సంస్థానవారసత్వం లావాదేవీలలోపడి అప్పారావు ఆరోగ్యం చెడింది, మరింత చెడింది. కొండల చల్లనకూడా ఉపకరించలేదు. ఇక్కడ జీర్ణకోశమూ, ఊపిరితిత్తులూ తమ పని తాము చేసుకొని పోతున్నాయనేగాని ప్రశాంతి మాత్రం దుర్భిక్షమైంది. అయినా పైబడి వస్తున్న అకాల దేహక్షయంనుండి సాహిత్య సంపదను వెలార్చడంమట్టుకు దిన దినాధికం కాసాగింది. కొండుభట్టీయ నాటక రచనకు ఊటీ పిలిచ్చింది. దాని లిఖితప్రతి రైలు ప్రయాణంలో తప్పిపోయినా, మరో నాలుగేళ్ళకు 1910లో మరో ప్రతి అసమగ్రంగానైనా తయారైంది ఇంకో ఏడాది మళ్ళేసరికి బిల్హణీయం కొంతైనా వెలువడింది. ఇది ఇలావుండగా, దేశిచ్ఛందోరీతులతోటి ఏర్పడివున్న దీర్ఘకాల పరిచయం 1910లో శుభోదర్కంగా పరిణమించి • 1910లో ముత్యాలసరమైంది. కాబట్టి అప్పారావు జీవితంలో సాహిత్య సంఘటనలతో క్రిక్కిరిసిన దశ(1906–1913)అతని అవసానదశే. దిన దినమూ

మరణిస్తున్న దేహంనుండి ఫోనిక్సువలె మహోజ్జ్వలమైన మనస్సు ఎక్షి బయల్పడింది. క్షణికమైన దేదో అది మాత్రమే కింద్రై, అక్షరమైనదేదో అదే మీాదైంది.

సాహిత్యపరమైన ఈ పునర్వికసనం మాత్రమేగాక, ఈ దశలో అప్పారావు వ్యక్తి మరొక తెన్నున గూడా భాసించింది. మానవ ప్రేమ గుణావర్ధనంగా పైకిలేచిన భావసౌధం కదా తనది, మరి ఎంత కాలం సంఘసంస్కరణోద్యమాలకు దూరంగా అప్పారావు మనగలడు? అభి మానాలు ఆచరణకు దారితీయకుంటే వాటివిలువ ఏపాటిది? నాటకగేయ ప్రక్రియలద్వారా సంఘ సంస్థాదోషాలను బయల్పరిచిన భావుకుడు ఎల్లకాలం క్రియాదూరుడుగా వుండలేడు. ఇప్పటివరకు సంస్కర్తల పట్ల సంస్కరణాభిమానులపట్ల అప్పారావు వైఖరిలో ఆమోదంతో కూడిన హేళనగానీ లోపాలను సరిపెట్టుకోజాలని నిరసనగానీ కనిపిం చేది. అతని సాహిత్యంలోని సంస్కరణాభిమానుల పాత్రలలో ధనాంశ కంటె రుణాంశ ఎక్కువగావుండేది. ఒక్క సౌజన్యారావు పాత్రమాత్రం సులక్షణ లక్షితంగా వున్నా, కార్యాచరణకు అందనంతటి "అచ్చాఛీ" తనం ఆ పాత ప్రాణాన్ని దాదాపుగా హరించి వేసిందనాలి. ఒడ్డున నిలబడి వేడుకచూసే ఈ కేటా ధోరణిని 1910 నాటికి అప్పారావు విసర్జించక తప్పలేదు.

సంస్కరణోద్యమాలతో అప్పారావుకు ఎట్టకేలకు ఏర్పడిన అభిప్రాయైక్యత, 1910 లో వెలువడిన ముత్యాలసరములో వాచ్య మైంది. హేలీగారి తోకచుక్క అరిష్టదాయకమేమీ కాకపోగా "సంఘ సంస్కరణ ప్రయాణ పతాక"గా సంభావితం కావడానికి, శాస్త్ర విషయవ్యాఖ్యఒక్కటే సమర్ధనకాబోదు. దాని నాధారం చేసుకొని ఒక కొత్త తత్వాన్ని ప్రబోధించిన మాట నిజమే. అయితే అంతకంటె సమీపమైన ఘటన అదే సంవత్సరాన బరంపురంలో జరిగిన నానావర్ణ పంక్తిభోజనం వరహాగిరి వెంకటజోగయ్య సముద్రయానంచేసి హూణుల సంగతి మెలిగివచ్చినందుకు కర్మఛండాలురు కొందరు వెలిపెట్టినందుకు నిరసనగానూ, ఆచారచట్రానికి ప్రతిగానూ, ఈ విందు జరిగింది. మిత్రుడుగా అప్పారావు ఆహూతుడైపోయి, "పట్నమున పదినాళు

లుండి వచ్చాడు. "సంఘసంస్కరణ ప్రవీణుల సంగతుల మెలగి" వచ్చాడు. జ్ఞానాలయమైన నవలోకకల్పనకు "మొట్టమొదటి మెట్టు యిది యని" చెప్పదగిన విందు కుడిచి వచ్చాడు.

వ్యక్తిగా యిన్నేళ్ళు అప్పారావు అనుసరించినవి ఆచారవిహితాలైన పద్ధతులే 1898 లో కుమార్తెకు పెళ్ళి, కుమారుడికి వడుగు సలక్షణంగా జరిగాయి. తాను ముఖాన గ్రంథాక్షతలు ధరించి తీరవలసిందే. కన్యాశుల్కంలోనూ, బిల్హణీయంలోనూ, భగవద్గీతాప్రశస్తి కూడా అనాలోచితం అయివుండదు. నూతన శతాబ్దం ప్రథమాబ్దంలో కందుకూరి వీరేశలింగం విజయనగరంవెళ్ళి విధవా పునర్వివాహమొకటి జరిపించినప్పుడు ఆహ్వానించిన పెద్దలలోనూ, మిత్రులలోనూ అప్పారావుపేరు కానరాదు. పైగా అనూయాయులు చేరి వీరేశలింగాన్ని అంబరానికెత్తుతూ "ఆదర్శపురుషుని"గా శ్లాఘించడం, డైరీలలో అప్పారావు నిరసనకు లక్ష్యప్రాయమైంది. సాహిత్యభాషా విషయాలలో, ఉచిత శృంగారపోషణలో, తమ మార్గాలు భిన్నాలన్నట్లుగా అప్పారావు బహుచోట్ల రాశాడు. అలాంటి అప్పారావే 1911 లో వీరేశలింగం గురించి రాసిన రెండు మూడు వాక్యాలలో విపులార్థం వుంది.

"శ్రీ వీరేశలింగంపంతులు నిశ్చయముగా (కిందిగీతనాది) మహాపురుషుడు. సాహిత్యములో వొక శాఖ ప్రారంభించి, సంఘములో పురోభివృద్ధిపంథా లేవదీసిన మాన్యుడు. ఇది మిగుల కష్టతరమైన పని." (8)

కాలంలోనూ, దూరంలోనూ సమీపస్థులైన అల్పతరవ్యక్తుల సహవాసంనుండి స్వతంత్రించి, చరిత్రలో తనకు నిత్యసహవాసి కాగలిగిన మరొక మహావ్యక్తిని అప్పారావు ఇప్పటికి కనుగొన్నాడు. ఇప్పటినుండే అప్పారావు చరిత్రకు చెందిపోతున్నట్లు. అయితే అటు సంఘసంస్కారంలోగాని, ఇటు భాషా సంస్కారంలోగాని, వంత పాడటమే అప్పారావుకు మిగలగా, వీరేశలింగం, గిడుగు రామమూర్తి ప్రధాన గాయకులూ నాయకులూ కాగలిగారు. అప్పారావు విశిష్టత, ఆ యిద్దరినీ తన వ్యక్తిలో కూడగట్టుకోవడమే.

## III

"నాది ప్రజల వుద్యమము. దానిని యెవరిని సంతోషపెట్టుటానికైనా వదులుకోలేను." (డైరీలు)

రీవారాణి మృతితో (1912) అప్పారావు జీవితంలో మరొకదశ అంతమైంది. అలకరాజేశ్వరి అవరకేదాటుకొంది. రాజకుటుంబంతో తనకుగల గుదిబండ లొకటొక్కటే తెగుతున్నాయి. ఐతే విజయరామ గజపతిభార్య లలితకుమారి మాత్రం అతనికి స్వేచ్ఛ నివ్వలేదు. అభిమానంతోటి అతన్ని బంధించివుంచింది. పైగా స్వప్రయోజనార్థంకూడా అతన్ని అంటగొన్నది. వారసత్వందావా ఒకవైపున, ఆంతరంగిక వ్యవహారాలలో స్పర్ధలింకొకవైపున. సంస్థాన వ్యవహారాలను సరిచూస్తూ వుండేందుకు మద్రాసు ప్రభుత్వం నియమించిన ముగ్గురుసభ్యుల ఉపసంఘంలో రీవారాణి మృతితోఏర్పడిన ఖాళీని పూరించేందుకు తనకు సభ్యత్వం కావాలని, అందుకు అప్పారావు తోడ్పాటు కావాలని లలితకుమారి ఒత్తిడిచేసింది. ఆమెకు ఆ స్థానం దొరికింది. అప్పారావుకు ఆ స్థానంలో గాకున్నా అంతఃపురంలో ప్రాపకం దొరికింది.

రీవారాణిమీద మోపుకొనివుండిన ఆశలు నెరవేరకముందే ఆవిడ చనిపోయింది. ఆనంద గజపతి హయాములోనే సంస్థానానికి చెందిన ఒక చిన్న ఇంటిలో కాపురం వుండేందుకు అప్పారావుకు వీలు దొరికింది. అద్దెలేదు. కాబట్టి జిరాయితీహక్కు లభిస్తుందేమోనని సంస్థానంవారు నెలకు నామకః అయిదురూపాయలు, సంవత్సరంలో రెండుసార్లు మాత్రమే చెల్లిస్తే చాలునన్నారు. ఈ ఇంటికి సొంతదారు కావాలని అప్పారావు కోరిక. చూస్తానని రీవారాణి వాగ్దానం. ఇప్పుడు దానిని కొనివెయ్యాలని అప్పారావు పూనిక. సాయంచేస్తానని లలితకుమారి వాగ్దానం. జాప్యం. చివరకు వేరేఇల్లు కట్టుకోవలసి వచ్చింది. "చాలా కాలం ఉద్యోగం చేసినా, నేను ఏమీ వెనకవేసుకోలేదు." ఈ మాటలన్నది ఒక్క అప్పారావే అయితే నమ్మశక్యంగాక వుండేది. వారసత్వం దావాను సవిజయంగా నిర్వహించిన శ్రీనివాస అయ్యంగారు, సంస్థాన వ్యవహారాలన్నీ యెరిగిన జి. అప్పయ్య, సరిగా

ఇలాగే అన్నారు. సంస్థానం ఇబ్బందులను స్వార్థానికి వినియోగించుకొని మహాసంపన్నుడు కాగల అవకాశాలను, అప్పారావు చిత్తశుద్ధి నిరాకరించింది. అయితే విజయరామగజపతి పూర్తిగా కృతఘ్నుడు కాలేదు. అప్పారావు దరఖాస్తు మేరకు, "సంస్థానానికి, కుటుంబానికి చేసిన సేవకు ప్రతి ఫలంగా అప్పారావుకు నెలకు 140 రూపాయలు పింఛను ఇవ్వవచ్చును," అని మంజూరు చేశాడు.

ఇవి అంతగా స్మరణీయాంశాలుకావు. సాహిత్యపరంగా ఈ అవసాన దశలో అప్పారావు పుష్కలగేయ సస్యాలు నూర్చుకొన్నాడు. లవణరాజుకల, డామన్-పిథియస్, కన్యక, పూర్ణమ్మ వంటి కథా గేయాలు, సుభద్ర పద్యకావ్యం, అనేక కథానికలు, వ్యాసాలు వెలువడిన మహర్దశ ఇది. అయినా ఈ దశలో అప్పారావు హృదయాని కెక్కినది సాహిత్యంకూడాకాదు, భాషాసంస్కరణం. తొలివలపైనకావ్య రచన పునర్దర్శనమిచ్చిన ఈ పునర్నవకాలంలోనే చిననాటి చెలిమికాడైన గిడుగు రామమూర్తి పునస్సమీపవర్తి అయ్యాడు. 'నల' నాటకంలో వేషధారులు, పాఠశాలలో అల్లరి పిల్లకాయలు, మళ్ళీ జోడు కట్టారు.

వ్యావహారిక భాషాభిమానం మొట్టమొదట పుట్టింది గురజాడ అప్పారావు తలలోనేగాని, గిడుగు రామమూర్తితలలోకాదు. ప్రహసనాలలో వీరేశలింగం, పాత్రోచిత భాషా మర్యాద నెపాన వెంకటరాయశాస్త్రి దీనికి ప్రాచుర్యం కల్పించకముందు వెయ్యేళ్ళకాలం నుంచీ దేశివాఙ్మయంలోనూ వచనంలోనూ ఇది ప్రాణాలు నిలుపుకొని అజ్ఞాతవాసం చేస్తున్నట్లు అప్పారావు కనుగొని, నాటకం ఆద్యంతమూ కన్యాశుల్కంలో చేసిన ప్రయోగం, జి. వి. అప్పారావు అనగా గ్రామ్యవాది అప్పారావు అనే విపరీతాపహాస్యానికి దారితీసింది. ఆంధ్ర వ్యాకరణ సంస్కరణం గురించి 1890 ల నుండీ అప్పారావులో గట్టిపట్టు ఏర్పడింది. బెంగాలులో ఠేక్‌చంద్‌తో మొదలై రవీంద్రునిలో చలితభాషగా ప్రసిద్ధమైన వ్యావహారిక కావ్యశైలి అప్పారావును ప్రలోభపెట్టింది. ఆంగ్ల భాషా మర్యాదలకు గూడా ఇది భిన్నంకాదు. దేశంలోని సామాన్య జనుల సమీపానికి సాహిత్య సందేశాన్ని తీసికొని

పోయి రైతు కళ్ళు తెరిచే పని చేసేందుకు ఇదొక్కటే సాహిత్యసాధన మనే దీర్ఘ దర్శిత్వం లభించింది.

ఇది ఏకాంగివీరునివల్ల సమకూరగల విజయం కాదు. విశాఖ పట్నంలోని మిసెస్ ఏ. వి. యన్. కళాశాల ప్రిన్సిపాలైన పి. టి శ్రీనివాస అయ్యంగారు ప్రోత్సాహంతో ఆంధ్ర సాహిత్యసంఘ స్థాపన జరిగింది 1906 లో ఫస్టు సర్కిలు స్కూళ్ళ ఇన్స్పెక్టరుగా వచ్చిన జె. ఎ. ఏట్సు తణిఖీచేసిన ప్రతిబడిలోని వుపాధ్యాయుల కందరికీ, ప్రభుత్వాదేశానుసారం, నూతనవిద్యా బోధనాపద్ధతులను నేర్పుతూ, శిష్టజనుల వాడుకనుబట్టి మాత్రమే భాషాధ్యయనం జరగాలిగాని వ్యాకరణంబట్టి కాదని మప్పసాగాడు. "ఏభాషయందైనను సరే కాలము మారుచు వచ్చుచుండిన అందలి మాటల వాడుకకూడ తప్పక మారుచువచ్చును; కాబట్టి దానిని అనుసరించి వ్యాకరణముకూడ మారుచునే ఉండును." (9) విశాఖపట్నంలో శ్రీనివాస అయ్యంగారు తోటీ, విజయనగరంలో అప్పారావుతోటీ ఏట్సు మమేకమయ్యాడు. అప్పారావు సూచన మేరకు, అపార ప్రతిభావంతుడైన గిడుగు రామ మూర్తినికూడా ఈ భగీరథప్రయత్నంలో భాగస్వామిగా చేర్చు కొన్నారు. 1910 నాటికి ఈ సంకల్పం ఉద్యమరూపం ధరించింది.

అప్పుడప్పుడే విద్యారంగంలో సంస్కరణ పవనాలు తోల సాగుతున్నాయి. యస్. యస్. యల్ సి. విద్యాప్రణాళిక అమలు జరుగబోతోంది. ఆంగ్లంనుండి ఆంధ్రానువాదం, తెలుగు వ్యాసరచన, ఇవి రెండూ గ్రాంథికంలోగాని, వ్యావహారికంలోగాని విద్యార్థులు రాయవచ్చునని మార్క్ హంటరువంటి విద్యావేత్తల పలుకుబడి ద్వారా విద్యాశాఖాధికారులను ఒప్పించగలిగారు. కొంతకు కొంత వ్యావహారిక ప్రయోగాలు కలిగిన సెట్టి లక్ష్మీనరసింహంగారి "గ్రీక్ పురాణ కథలు" పాఠ్యం చేయించారు. వెనువెంటనే సుషాను బద్దలైంది. సభలు. తీర్మానాలు. మహజరు. పండితులకు శివ మెత్తినంత పని అయింది. కూచి నరసింహం, చిలకమర్తి లక్ష్మీనరసింహం, పానుగంటి లక్ష్మీనరసింహారావు ప్రచారకులుకాగా వేదం వేంకటరాయశాస్త్రి, కొక్కొండ వేంకటరత్నం, వడ్డాది సుబ్బా

రాయడు ఉపదేష్టలుకాగా, జయంతి రామయ్య సారథీ సచివుడూ కాగా, వేంకటగిరి, పిఠాపురం జమీందార్లు రాజపోషకులు కాగా, బయ్యా నరసింహేశ్వరశర్మ, మోచర్ల రామచంద్రరావు, న్యాపతి సుబ్బారావు రాజకీయ ధురంధరులై ఉద్యమ స్వభావాన్ని వికృతం చేయగా, వాగ్యుద్ధం ప్రారంభమైంది. మాటలనుండి రాళ్ళవరకు, కుయుక్తులనుండి తీవ్రనిందలవరకు, అసహనంనుండి విరోధంవరకు వాద ప్రతివాదాలు సాగాయి. ఆంధ్రసాహిత్య సంఘానికి ప్రతిస్పర్ధిగా ఆంధ్రసాహిత్య పరిషత్తు రాజ–పండిత ప్రోత్సాహంతో ప్రారంభమైంది. వ్యావహారికం గ్రామ్యంగా దూషితమైంది. గిడుగు పిడుగు దాడి పండితమ్మన్యుల దుర్గాలను భగ్నంభుగ్నం చేస్తూవుండగా, ఇంకొక చెంపను మదరాసు యూనివర్శిటీ సినేటులోనూ కాంపోజిషన్ కమిటీ లోనూ గురజాడ అప్పారావు యుక్తియుక్త వాదనలు రాణ కెక్కాయి.

1911 లో ఎఫ్. ఏ. కి మారుగా ప్రవేశించిన ఇంటర్మీడియేటు విద్యాప్రణాళిక ననుసరించి, తెలుగు వ్యాసరచనకు పాఠ్యాలు నిర్ణ యిస్తూ, వ్యాసరచన ఎలాంటి భాషలో చేయవలెనో సలహా చెప్పేం దుకై, ద్రావిడ భాషలలో ఒక్కొక్కదానికి ఒక్కొక్క ఉపసంఘం ఏర్పాటైంది. తెలుగు భాషకు సంబంధించిన ఉపసంఘంలో ఉభయ పక్షాలవారికీ నలుగురేసిగా సమానప్రాతినిధ్యం కలిగిస్తూ, ఇద్దరు నిష్పాక్షికులను గూడా జోడించారు. ఈవరకే మద్రాసు యూనివర్శిటీ సినేటు సభ్యుడైన అప్పారావుకు జతగా పి. టి. శ్రీనివాస అయ్యం గారు, గిడుగు రామమూర్తి, బుర్రా శేషగిరిరావు ఒక కూటమి. జయంతి రామయ్య, వేదం వేంకటరాయశాస్త్రి, కొమర్రాజు లక్ష్మణ రావు, గుమ్మిడూరి వేంకట రంగారావు - గ్రాంథిక పక్షీయులు. థామ్సన్, రంగాచార్యులు – మధ్యస్థులు. వ్యావహారికభాషావాదులు మధ్యస్థుల మద్దతు సంపాదించారు గాని, ఉపసంఘంచేసిన నిర్ణయం రాజీపద్ధతి ననుసరించింది గ్రాంథిక రూపాలతోబాటు వ్యావహారిక రూపాలను గూడా విద్యార్థులు వ్యాస రచనలో వాడుక చేయ వచ్చునని చేసిన ఈ నిర్ణయంకూడా గ్రాంథిక భాషావాదులకు తృప్తి

కలిగించలేదు. రాయలసీమ ప్రాంతం వారికి ఈ ఉపసంఘంలో ప్రాతినిధ్యమేలేదు కాబట్టి, ఈ నిర్ణయానికి వాళ్లు బద్ధులు కాబోరనిచెప్పి, భాషా సమస్యను రాజకీయ సమస్యగా మార్చి, మహజర్ల కార్యక్రమం చేబట్టి, శాసనసభలో రచ్చపెట్టి, గవర్నరువద్దకు రాయబారంనడిపి, చివరకు ప్రభుత్వాన్ని ప్రభుత్వంద్వారా సిండికేటునూ లొంగదీసుకొని, వ్యావహారికవాదాన్ని దెబ్బతీశారు. విజయనగరం లోనే అప్పారావుకు చుక్కెదురు అయినట్లు, విజయరామగజపతి కార్యదర్శిగా వుండిన ఎనమండ్ర నారాయణమూర్తి అనేకుల వద్ద మద్రాసు మహజరు మీద సంతకాలు పెట్టించిపంపాడు. గాయం మీద కారం చల్లినట్లు పెడసరిగా అప్పారావుకు ఇట్లారాశాడు : "ఒక్క శుభ (మీకశుభ) వార్త తమకు విన్నవించవలసి యున్నది. శ్రీ శ్రీ శ్రీ విజయనగర మహారాజా వారు మా పక్షము!!! ఇప్పుడు మా బలమొక్కమారు తలచుకొండి."(10)

చివరకు ఆ ఉపసంఘంలో రాయలసీమ సభ్యులను చేర్చుకొన్నారు. గ్రాంధికవాదుల సంఖ్యాధిక్యత. ఈ వరకే జరిగిపోయిన తీర్మానాన్ని తిరగదోడి, చమత్కారంగా వ్యాఖ్యానం చెప్పి, అందులో Classical Telugu forms as will as modern Telugu forms అని వుంటే as well as అనే మాటలకు అర్థం రెండు విధాలైన భాషా రూపాలు కాదని, "ఏ రూపములయితే గ్రాంథిక భాషాలోను, వ్యవహారములోనుఉంటవో (రెంటను) అవి అని అర్థమని వ్యావహారికభాషా వాదమును పడగొట్టినా" రంటూ గిడుగు సీతాపతి రాశాడు.

తెలుగు వ్యాస రచన సంఘం వారు వ్యవహారంలో ఉన్న పదాలు, వ్యవహారం నుండి జారిపోయిన పదాలు ఏవేవో పట్టీలు కూర్చమని నియమించిన ఉపస ఘంలో అప్పారావుతోపాటు, కొమర్రాజు లక్ష్మణరావు, వేంకటరామశాస్త్రి సభ్యులయ్యారు. వ్యవహారమనే మాటకు పుస్తకాలలో వాడుక అని కొత్త అర్థం చెప్పుకొని, మిగతా ఇద్దరు పదపట్టికలు తయారుచేయగా, వారి అభిప్రాయంతో ఏకీభవించకుండా అప్పారావు తన అభిప్రాయం విపులంగా రాసి కమిటీకి అందజేశాడు. The Minute of Dissent అసామాన్య పాండిత్య ఫలితమని

బహుళ ప్రశస్తిపొందింది. వావిళ్ళవారిచేత దీనిని ముద్రింపించి, ప్రముఖ విద్వాంసులందరికీ అందజేశాడు. అది ఎందుచేత గొప్ప రచన అయిందో తెలికచర్ల వెంకటరత్నం ఒక వ్యాసంలో వివరించాడు: గ్రాంథికవాదులు ఇస్తాను, వస్తాడు వగైరా మాటలలోని 'స్త' రూపాన్ని నిరాకరించగా, అన్ని జిల్లాల వాగ్ వ్యవహారంలోనూ పత్రికా రచనలోనూ గద్య పద్య గ్రంథాలలోనూ వ్యాకరణంలోనూ వున్నట్లు వేలాది తార్కాణాలు చూపుతూ, ఇలాంటి రూపాలు మిగత ద్రవిడభాషలలో గూడా వాడుకౌతున్నట్లు అప్పారావు నిరూపించాడు. కన్నడ భాషా పాండిత్యానికి తమిళ, మళయాళ భాషా పరిచయంతోడైంది. తెలుగు గద్య పద్యాలలో ఎప్పటికప్పుడు పాత భాషతో కొత్తరూపాలు ఎట్లా కలుస్తున్నాయో చూపి, ఎలాంటి రూపాలను గ్రహించవచ్చునో సూచించాడు. పాశ్చాత్య వచన రచన అభివృద్ధిపొందిన తీరుతెన్నులు చూపుతూ, "నేటి విద్యా విధానంలో వచన వాఙ్మయానికిగల అవసరము తీర్చడానికి నేటి వాడుకభాషే ప్రయోగార్హమన్నారు." (11)

అర్హతను పురస్కరించుకొని 1913 లో చేకూరిన మద్రాసు యూనివర్శిటీ 'ఫెలో' (Fellow) హోదా అప్పారావును సంతోషపెట్టలేకపోయింది. దెబ్బ తగిలిన కాలికే తగిలినట్లు, తెలుగు పాఠ్య గ్రంథాలను గురించి జరిగిన పోరాటంలోకూడా ఓటమి ఎదురైంది. బోర్డాఫ్ స్టడీస్ సభ్యుడుగా ఇందులో పాల్గొంటూ, ప్రాచీన కావ్యాలలో హద్దుమీరిన సంభోగ శృంగార వర్ణనలున్నందున ఆ భాగాలను పాఠ్యాలుగా నిర్ణయిస్తే విద్యార్థుల మనస్సులు వికటించగలవని దూరదృష్టితో అప్పారావు భావించాడు దీనిని గురించి ఒక వ్యాసం కూడా రాశాడు అయితే, గ్రాంథికంతోబాటు కావ్యసంప్రదాయాన్ని కూడా అనుల్లంఘ్యమని భావించేవాళ్ళ సంఖ్యాధిక్యతవల్ల, ఇదికూడా మొక్కబోయింది. అలంకారికుల రచనల నుద్ధరిస్తూ, శృంగార రస ప్రాముఖ్యాన్ని సమర్థిస్తూ, ఆంధ్ర సాహిత్య పరిషత్తు తీర్మానం చేసింది. సంధికార్యాలగురించి జరిగిన వివాదంలో, మామూలు గ్రంథ రచన గ్రాంథిక భాషలోనే సాగవలెనని, వ్యాకరణ సూత్రాలు ఆమోదించి

నంతమేరకే, అదీ పిల్లల పుస్తకాలలోనే, సంధిసూత్రాలను సడలించ వచ్చుననీ, పండిత పరిషత్తు మద్రాసులో కూడి తీర్మానించింది.

"మద్రాసు పక్షీయుల చేతులలో చిక్కి" కొన్న ఆంధ్ర సాహిత్య పరిషతునే ముట్టడించి స్వాధీనపరచుకోవలెనని గూడా అప్పారావు సంకల్పించాడు. తాను ఒక్కడై ఆ పరిషత్సభలలో పాల్గొని, వాద పటిమ ద్వారా వారిని ఒప్పింపజూశాడు. అది లాభంలేకుండా పోయింది. "మార్పుకు వారు బద్ధవిరోధులు, పురోగతికి అవరోధకులు." (1) అందుచేతనే యుద్ధపద్ధతులు శరణ్యాలయ్యాయి వ్యావహారిక భాషావాదుల ఎత్తుగడలను పసిగట్టి మదరాసులో జరగవలసిన సమావేశాన్ని ఎవరికి తెలియనంత పకడ్బందీగా బెజవాడలో ఫిబ్రవరి 1915 లో జరిపించారు. ఆంధ్ర జనమహాసభ కార్యకలాపాలను గమనిస్తూ, పెల్లుబుకుతున్న దేశాభిమానాన్ని హర్షిస్తూ, సమావేశ స్థలాల విషయమై సూచనలుకూడా చేస్తూవుండిన అప్పారావు, నవదేశాభిమానుల ద్వారానైనా ఆంధ్ర సాహిత్య పరిషత్తు విధానాలు మారుతాయని ఆశించివుంటే, ఆశాభంగమే మటిల్లింది. తీర్థానికితీర్థమే, ప్రసాదానికి ప్రసాదమే అన్నట్లు ఆంధ్ర జనమహాసభ జరిగిన చోటనే, జరిగిన వెనువెంటనే ఆంధ్ర సాహిత్య పరిషత్సభ బెజవాడలో జరిగినా, దాని ప్రభావం దీనిమీదికి ప్రసరించలేదు.

కళింగదేశ చరిత్ర రచించేందుకు కావలసిన విషయ సంభారమంతా ముందుంది. గ్రాంథికభాషలో రాస్తేనే తాము గ్రంథం వెలువరిస్తామని కొమర్రాజు లక్ష్మణరావు సాంధ్యంలోని ఆంధ్ర ప్రచారణి గ్రంథమాల షరతు విధించినప్పుడు, ప్రజలపేరుతో దానిని కాలదన్నివేశాడు. దానిని పూర్తిచేసేందుకు అనారోగ్యం అడ్డువస్తోంది. గ్రహణివ్యాధి పట్టుకొంది. బరువైతే మూడుపౌన్లు పెరిగి 84 అయింది. కాని, జీర్ణకోశం చెడిపోయింది. కడుపునొప్పి. చప్పిడి తిండి నిరంతరజ్వరం. రొమ్ములోనూ గోళ్ళలోనూ సలుపు. క్వినైను మోతాదు ఎక్కువయ్యేసరికి, "నా కడుపూ, నరాలూ పేగులూ చెడిపోయి వుంటాయి." లలితకుమారి సిఫార్సుమేరకు, విశాఖపట్నం పెద్దాసుపత్రి డాక్టరు ఎల్లింగ్టన్ పరీక్షించాడు. అయితే అక్కడ అట్టే

కాలం వుండక, విజయనగరం తిరిగివచ్చి ఛాపా మంగయ్య వద్ద వైద్యం చేయించుకోసాగాడు. అయినా వ్యాధి కుదుకాలేదు. కళింగ దేశచరిత్ర గురించి తలుచుకొంటునే కన్నీళ్ళపర్యంత మౌతున్నాడు.

వైద్యానికి ఎదురుతిరిగి అప్పారావుదేహం 1915 నవంబరు 30 వ తేదీన మూతబడిపోయింది. ఏడవనెల నిండకమునుపే ప్రపంచం మధ్యకువచ్చినబిడ్డ ఏభైనాలుగేళ్ళు నేలమీద నూకలు నిలుపుకోవడమే వింత! ఇంతకృషిచేయడం ఇంకా వింత! దాని ఫలితం శాశ్వతం కావడం వింతకే వింత!

---

## పాదపీఠికలు (Foot notes)

(1) మా నాయనగారు: గురజాడ రామదాసు, విశాలాంధ్ర 21-9-'62. (2) మాటా మంతీ, అవీ: ఇవీ, పు. 4-6. (3) డైరీలు, పు. 71. (4) మాటా మంతీ, పు. 26. (5) బిల్హణీయం, పు. 127. (6) మాటా మంతీ, పు. 118-154. (7) డైరీలు పు. 153. (8) అదే. పు. 236. (9) శ్రీ గిడుగు రామమూర్తి పంతులు జీవితము: ప్రొఫెసరు కాళ్ళకూరి సూర్యనారాయణ యం. ఎ., పు. 50. (10) లేఖలు పు. 183. (11) మహామనీషి గురజాడ: తెలికచర్ల వెంకటరత్నం విశాలాంధ్ర 21-9-'62. (12) లేఖలు. పు. 208.



# 6. విద్య

పొట్ట కూటికి నేర్చు విద్యలు
పుట్టకీట్లు కదల్చెనా ?

కడపటికి గిడుగు సీతాపతి కూడా గురజాడ పాండిత్యాన్ని తగ్గించి వేయగా, (1) ఆనాటి ఆకాశ రామన్న ఒకడు నీవు అపండితుడవని (?) ఒక రాయివిసరడం ఏం వింత ? ఇలాంటి దూరు గురజాడకు నాడూ నేడూ ఉన్నది. పాండిత్య మంటే సంస్కృత పాండిత్యమో, గ్రాంథికాంధ్ర వ్యాకరణ పాండిత్యమో అయితే, గురజాడ మహా పండితుడు కాకపోవచ్చును. అందుచేతనే మద్రాసు విశ్వవిద్యాలయానికి సంబంధించిన ఇంటర్మీడియేటు తెలుగు గ్రంథ నిర్ణాయక సభలో "తెలుగురాని ఒకవ్యక్తి" ఉన్నాడని, తెలుగు వచ్చిన (?) మోచర్ల రామచంద్రరావు, బయ్యా నరసింహేశ్వరశర్మ, పండిత (తెలుగులో కాదు; ఆయుర్వేదంలో) డి. గోపాలాచార్యులు, వేమవరపు రామదాసు గునుపాటి యానాది రెడ్డి ప్రభృతులు గవర్నరుకిచ్చిన విజ్ఞప్తి పత్రంలో పేర్కొనారు.

అయినా ఆ మరుసటి సంవత్సరమే 1913 లో గవర్నరు గురజాడను ఫెలో ఆఫ్ ది మెడ్రాస్ యూనివర్శిటీగా నియామకం చేశారు. గ్రాంథిక భాషావాదులకు మొగదారైన వేదం వేంకటరాయశాస్త్రి గారు ఈ తెలుగురాని అపండితుణ్ణి ఆశ్రయించి తన రచనలను పాఠ్యగ్రంథాలుగా నిర్ణయించవలసిందిగా ధ్వనించే లేఖలు ఎన్నో రాశారు.

మార్కు హాంటరులాటి విద్యావేత్త, 'కేవలం మీ పాండిత్యాన్ని ప్రతిభను పురస్కరించుకొని మీరు నామినేటయ్యారు' అన్నాడు.

ఏమిటీ పరస్పర విరుద్ధ భావాలు?

అప్పారావుగారు సాధ్వగ్నివంటి పండితులు. ఆర్భాటాలూ, ప్రదర్శనలూ, బిరుదులూ వారికి సరిపడలేదు. ద్రావిడ భాషా వ్యాకరణాల మొదలు, వెల్ష్ బార్డర్ బేలడ్సవరకు, యూరపియన్ రినెజాన్సు నుంచి కళింగదేశ చరిత్రవరకు ఆయన ఆసక్తి ప్రసరించింది. ఆయన జిజ్ఞాసకు దేశ కాలాలు పరిమితు లేర్పరచలేదు. లోతుకంటె విరివి అనేది ఆయన పాండిత్యానికి గల విశిష్టత. గ్రీకు, రోమన్ చరిత్ర లొకటేనా, తత్వశాస్త్రం, సంస్కృతసాహిత్య చరిత్ర, వ్యాకరణ, ఆంగ్లసాహిత్యం, ఇన్ని విషయాలను కళాశాల విద్యార్థులకు బోధించేవాడు. వీటిలో ఏ ఒకొక్కటీ దేనికదే సాటి. వీటి నడుమ పొందిక ఎలా సాధ్యం? ఆ పొందికను కలిగించ గలిగాడు కాబట్టే అప్పారావు అసామాన్య మేధావి.

పెక్కులొకటిగ జూచువాడే
ప్రాజ్ఞుడన వినమే?

## 2

విద్యాసమస్యలమీద సాధికారంగా ప్రసంగించేందుకు గురజాడకు గల అర్హతలెట్లాంటివో తెలిసికొన్నాము. రవీంద్రుడనేవాడట, అన్నిటికంటెవిద్యా విషయాలే తనకు అత్యంత ప్రముఖాలని.అప్పారావు రవీంద్రుడి కేమీ తీసిపోడు,కనీసం విద్యపట్ల ప్రదర్శించిన ఆసక్తిలో. ఈఆసక్తి తాటాకు మంటవంటిది కాదు. ఊగ వచ్చిన నాటినుంచి పొగ చూరిన నాటివరకు గురజాడ అంతరాంతరాలలో ప్రజ్వలిస్తూ, అప్పుడప్పుడు నాలుకలు సాచిన శాశ్వత జ్వాల. కాబట్టే ఆయన రచనలలో ఇక్కడ అక్కడ అని గాక ప్రతికడా, ఇప్పుడు అప్పుడు అనిగాక

ఎల్లప్పుడూ, విద్యాసమస్యల గురించి ప్రస్తావనలు కనిపిస్తాయి. వీటిని యేర్చి కూర్చి ఒక చోట నిలపడమే నేను చేస్తున్న పని.

"విద్యావిధానమే దుష్టము. లోపభూయిష్టము. అభిరుచి అన్నదే కలిగించడంలేదు" (3) అనాటి విద్యా వ్యవస్థమీద ఇంతటి కఠినమైన తీర్పు చెప్పాడంటే, అప్పారావు దృష్టిని ఆకర్షించిన లోపాలేమిటో మనం తెలుసుకోవాలి. ప్రిన్సిపాళ్ళతో మాట్లాడాడు. ఇంగ్లీషు ప్రొఫెసర్లను ప్రశ్నించాడు. తెలుగు పండితుల నడుమ మసిలాడు. స్కూళ్ళ ఇన్‌స్పెక్టర్లతో దోస్తీ చేశాడు. స్వయంగా క్లాసురూములకు వెళ్ళి తాత్కాలికంగా విద్యార్థియై పాఠాలు బోధిస్తుంటే చెవులప్పగించాడు. విద్యావ్యవస్థ ఆశించిన ప్రయోజనాలను వమ్ముచేస్తున్నదని స్వానుభవంద్వారా గ్రహించిన తర్వాతనే ఈ నిర్ధారణ చేశాడు.

నిలువ నీటి మడుగుగా మారిన ప్రాచ్య సంస్కృతిలో పొడి రాయిగా ప్రవేశించిన ఇంగ్లీషు విద్య కొన్ని సత్ఫలితాలను సేకూర్చిన మాటనిజమే. విశ్వాసం ప్రధాన లక్షణమైన భారతీయ మత విహిత భావజాలం స్థానే, సందేహం ప్రధాన లక్షణమైన భౌతిక శాస్త్ర విహిత భావజాలం మొనచూపింది.

కన్నుకానని వస్తు తత్వము
కాంచ నేర్పరు లింగిలీజులు
కల్ల నొల్లరు; వారి విద్యల
కరచి సత్యము నరసితిన్.

"ప్రశ్నించే స్వభావం లేనపుడు గుడ్డినమ్మకాలు కలుగుతూ వుంటాయి." (4) ఇవి వ్యక్తుల కార్యవిధానాలను నిర్ణయిస్తాయి. వ్యక్తి వీటికి బానిస అవుతాడు. అందుచేత ఏ విద్యఅయితే అంధ విశ్వాసాల విషానికి విరుగుడవుతుందో ఆ విద్యను ఆహ్వానించడంలో అప్పారావు వెనుకాడలేదు. ఇంగ్లీషు విద్యద్వారా "చాలామంది విద్యార్థులు ప్రచారంలో వున్న యీ మతనమ్మకాలను అధిగమించి అభివృద్ధి అవుతున్నారు." (5)

అయినా, ఆంగ్ల విద్యా ప్రభావంవల్ల దేశభాషలలో సరేసరి, ఆంగ్ల విద్యావంతుల మనస్సులలోనూ, ప్రవర్తనలలోనూ చెప్పుకో దగిన సత్ఫలితం కనిపించకపోవడం అప్పారావుకు విస్మయాన్నీ, బాధనూ కలిగించింది. విద్యావంతులు వేషధారణలో, వ్యవహారకాండలో ఆంగ్లేయులను అచ్చు గుద్దుతున్నారే గాని, ఆంగ్ల విద్యలోని సత్తాను గ్రహించలేదు. చివరకు వాళ్ళు కేటుపెయ్యలవలె తయార య్యారు. "విద్యావంతులైన స్వదేశీయులు ఒక వింతయిన మనుష్యులు. అటు ఆవుపెయ్యా కాదు; ఇటు గేదెపెయ్యా కాదు అనే సామెతవలె వుంది వీరిపద్ధతి. వీరికి వ్యక్తిత్వమూ, శీలమూ పూజ్యం." (6)

ఈలోపం వ్యక్తులది మాత్రమే కాదనీ, పాశ్చాత్య విద్యా పద్ధతి లోనే అంతర్నిహితమై వున్నదనీ అప్పారావు కనిపెట్టాడు. "ఎంత స్వేచ్ఛాయుతమూ, హేతువాదబద్ధమూ, పురోగమనశీలమూ అయి నప్పటికీ, కొన్ని అంధవిశ్వాసాలను పోగొట్టుతున్నప్పటికీ, అది ప్రబో ధించే స్వాతంత్ర్యము సాంఘిక ప్రగతి శూన్యమైనది. ఇది సంపూర్ణ స్వాతంత్ర్యము కాదు. నామ మాత్రమైనది." (7)

కాబట్టి పాశ్చాత్య విద్యవల్ల మేధో జీవిత పరిస్థితులలో కొంత సంచలనం కలిగితే కలిగివుండవచ్చు. అయితే మేధో జీవిత పరిస్థితులను సామాజిక జీవిత పరిస్థితులతో సమన్వయంచేసే శక్తి పాశ్చాత్యవిద్యకు లేనేలేదని అప్పారావు తీర్మానించాడు. పోగా, మన సాంప్రదాయిక విద్య వ్యక్తిగత జీవితములో నైతిక ప్రమాణాలను ఏర్పరుస్తున్నదేమో గాని, పౌరజీవితములో నీతిని కలిగించలేకపోతున్నది. ఎంత నిష్ఠాగరిష్ఠు డైన వ్యక్తికూడా సాంఘికదురన్యాయాలకు పాల్పడక తప్పనిపరిస్థితిని ఈ మతవిహిత సంస్కృతి కలిగిస్తున్నది. అందుచేతనే విద్యా సంస్కరణ మనేది అప్పారావుగారి దృష్టిని ప్రముఖంగా ఆకర్షించ గలి గింది. "సత్యహరిశ్చంద్ర" ఇంగ్లీషు నాటకానికి రాసిన ఉపోద్ఘాతంలో 1897 లో ఆయన ఇదే అన్నాడు: "పురాతన భావాలకు నూతన భావాలతో సంపర్కం కలిగినప్పుడు అవశ్యంగా ఉత్పన్నమయ్యే ఉత్సాహమూ, నూతన కార్యాచరణాపేక్షా ఇప్పుడు చాలా త్వరగా పెంపొందుతున్నాయి."

# 3

పొట్టకూటికై చదివే చదువులవల్ల పరమార్థమేదీ ఒరగదు. ఆత్మగౌరవం, వివేచనాశక్తి స్వతంత్రంగా ఆలోచింపజేయగల మనోదార్ఢ్యం ఈ చదువులవల్ల కలుగనేరవు. పోతే, మాతృభాషావిద్యవల్లనైనా అవి చేకూరుతున్నాయా ? బోధనాక్రమమనేది అందుకు తగిన వాతావరణాన్ని కల్పిస్తున్నదా? "విశ్వవిద్యాలయ విద్య. పాశ్చాత్యసంస్కృతి ప్రాబల్యం వహించిన ఏభైఏళ్ళకు కూడా సాహిత్య రచనా నైపుణ్యం ఇంత అధమ స్థాయికి దిగజారిపోయిందీ అంటే, నిజంగా ఆశ్చర్యం కాదా ? ఇందుకు హేతువు మన కళాశాలల్లో సాగుతున్న లోపభూయిష్ట ఆంగ్ల సాహిత్య బోధనా పద్ధతులేనని చెప్పవలసివుంటుంది. వాడుక భాషలను వికసింపజేయడమే తమ ప్రధాన బాధ్యతగా ఆంగ్ల అధ్యాపకులు, విద్యాధికారులు భావించి దోహదపడేవరకు, ఇంతకంటె ఉత్తమమయిన ఉన్నత ప్రమాణాలు ఏర్పడతాయని మనం ఆశించలేం." (8)

ఆంగ్లప్రభుత్వ విద్యాశాఖవారే మాతృభాషా పండితులకంటె తెలివిగా బాధ్యతతో ప్రవర్తించారు. 1857 మొదలు పాఠశాలలో తెలుగు బాలబాలికలకు విద్య నేర్పేందుకు వాళ్లు చేసిన ప్రయత్నాలు అల్పమైనవి. అయినా ఇటీవలి కాలంలో, తమ ప్రయత్నాలు నిష్ఫలమైనవని గుర్తించి, శిష్టవ్యవహారమందున్న భాషలోనే గద్య రచనాభ్యాసము చేయించవలసి దిగా విధించారు. "మెట్రిక్యులేషను పరీక్షకు వేసే పుస్తకాలు ప్రధానంగా ఆధునిక వచనంలో వుండితీరాలని, సెకండరీ స్కూళ్ళలో వచన పాఠాలు ప్రధానంగా మాటలాడుకొనే భాషాశైలిలో వుండాలని, వీలైనంతవరకు అచ్చుపుస్తకాలలోని సూత్రాలను అన్వయాన్ని వదలిపెట్టి, లక్ష్యమును చూపుతూ జీవద్భాషలోని వాక్యరచనా లక్షణాలను, భాషా విభాగ పదప్రయోగ సరళిని విద్యార్థులకు బోధించాలని" (9) విద్యానిబంధనలు ఏర్పాటుచేశారు. అంతేకాదు పాఠ్యపుస్తకాలలో ఆశ్లీలశృంగారం వుండరాదని విశ్వవిద్యాలయం నిర్దేశించింది.

విద్యాశాఖవారి విశాలవైఖరికి గురజాడ హర్షించడమేగాక, కొంతవరకు బాధ్యతకూడావహించాడు. మాతృభాషా సాహిత్యబోధన గురించి ఆయనకు కొన్ని ఖచ్చితమైన అభిప్రాయాలు ఎన్నడో ఏర్పడ్డాయి. దానిని వీలైనంత ఆధునికం చేయాలని, చేయించాలని సంకల్పించి శ్రమించాడు. "దుస్సాధ్యమైన కృతక భాషను విద్యావిధానంలో ప్రవేశపెట్టడమే యీ అనర్థానికి (మాతృభాషలో విద్యా వైఫల్యానికి) కారణం; ప్రాచీన గ్రాంథికాన్ని కావ్యభాషగా స్వీకరించడమే ఇందుకు హేతువు." (10) నిఘంటువులను అర్థాలకోసం ఆశ్రయించడం, వ్యాకరణ సూత్రాలను వల్లెవేయడం "రొడ్డ కొట్టుడు" చదువులుగా మారి, విద్యార్థులకు విసుగునూ విముఖతనూ కలిగిస్తున్నాయి. ఆ వ్యాకరణం ఇప్పటి "భాష"కు సంబంధించింది కాదు. 11వ శతాబ్ది భాషకు సంబంధించినట్టిది. అంతేనా? పాఠ్య ప్రణాళికలలో ఆధునిక విషయాలపట్ల ఆసక్తిపుట్టించే సాహిత్యం లేదు. "ప్రాచీన పద్యాలలో వర్ణింపబడిన కావ్యవస్తువులు పౌరాణికములే, ఎపిక్ లే." (11) ఇవి మత విశ్వాసాలను చింతనం చేస్తున్నాయి తప్ప, విద్యార్థిలో స్వతంత్ర భావనాశక్తిని కలిగించడంలేదు. మరొక లోపమేమిటంటే, కొన్ని పాఠ్య గ్రంథాలలో కంపుకొట్టేటంత గాటంగా వ్యాపించిన అశ్లీల శృంగారం.

ఇన్ని తోసివెయ్యలేని లోపాలకు జతగా పాతకాలపు బోధనా పద్ధతులు చేరితే, విద్యార్థులు బమ్మికావడం పోయి తిమ్మికావడం తప్పదు. బోధించేవారికి బోధించకుంటే వాళ్లు ముందుతరాలవారికి బాధ కలిగిస్తారు. "ఉపాధ్యాయులకు తగిన శిక్షణ యివ్వందే ఆధునిక పద్ధతుల్లో అభివృద్ధినీ, అభ్యుదయాన్నీ సాధించడం దుస్సాధ్యం. ఇంతకంటె ప్రధానమైన విద్యాసమస్య మరొకటి లేదు." (12) భాషాసాహిత్య బోధనాపద్ధతులు ఎలాంటివై యుండాలి అనే విషయంగురించి కూడా అప్పారావు ఆలోచించాడు. "సాహిత్యపాఠములలో విద్యార్థులకు శైలిలోను, వస్తువిన్యాసములోను యిది మంచీ, యిది చెడ్డ అని విడదీసి వాటి బాగోగులను బోధింపకుండుట, విమర్శగా చదువు నేర్పకుండుట, స్వతంత్ర యోచనాశక్తిని పురికొల్పేదిగా బోధనాక్రమ

ముండకపోవుట, రసానుభవమూ, వివేచనా లేకుండుట,"(13) దేశ భాషా సాహిత్యబోధనలో వైఫల్యానికి కారణాలుగా పేర్కొన్నాడు.

పాఠ్యక్రమాన్ని ఆధునికం చేయాలంటే భాషా సాహిత్యాల మీదనే దృష్టి కేంద్రీకరిస్తే, దేశానికి నవీనయుగంలో కలుగవలసి నంత మేలు కలుగదని గురజాడ కూడా గమనించకపోలేదు. కట్టమంచి రామలింగారెడ్డి మద్రాసు విశ్వవిద్యాలయానికి సమర్పించిన నివేదికను గురించి "ఆధునిక ఆంధ్ర వచన రచన" అనే వ్యాసం రాస్తూ, అప్పారావు ఒక మాట చెప్పాడు. శాస్త్రీయ విజ్ఞానాన్ని దేశీయ ప్రజలలో వ్యాపింపచేయాలి. నిజమే. అయితే దేశభాషా గ్రంథాలద్వారా స్కూలు విద్యార్థులకు సైన్సును బోధించడంవల్ల ఎక్కువ ఉపయోగం ఉంటుందా అని సంశయించారు. సైన్సు పుస్తకాలను భాషాసాహిత్య పుస్తకాలకు బదులుగా పాఠ్యగ్రంథాలను చెయ్యవలెననే సూచననే ఆయన ఎదుర్కొంటున్నారు. కాని, సైన్సు పుస్తకాల ఆవసరాన్ని కాదంటంలేదు. ఆనాడు వస్తూవుండిన తెలుగు సైన్సు పుస్తకాలు బాగుండలేదని ఆయన విమర్శించాడు. అదిన్నీగాక, ఇలాంటివాటిని "హెచ్చుగా ఆదరించవలసినదిగా విశ్వవిద్యాలయాన్నేగాక దేశీయు లకు శ్రీ రెడ్డిగారు విజ్ఞప్తి చేయవలసివుంటుందనుకుంటాను." (14)

కొత్తయుగంలో కొత్త ఆవసరాలను తీర్చేందుకు కొత్త చదువులు కొత్త పద్ధతులు కావాలని అప్పారావు కోరుకోవడంలో ఆశ్చర్యం ఏమీలేదు. "పండితరాజసంవాదము" అనే పాటలో పండితుడితో రాజుగారు అంటున్నారు :

"అలుక వలదు నే ననెద
నుండేదాని కలికాలములోను కం
సాలపని తాపి పనియు నేర్చు
కొనిన సంపన్ను లగుదురయ్యా !"

ఈ చరణాన్ని సాగదీసి అప్పారావు వృత్తి విద్యను అభిమానించాడని నేను అనడంలేదు. కాని, పాత కాలపు చదువులు ఎంత నవ్వుల

పాలై కడుపు కక్కుర్తిని కూడా తీర్చలేని స్థితికి పడిపోయాయో సూచించ దలచుకొన్నాడని మట్టుకు అనగలను. అదేవిధంగా, కన్యాశుల్కం నాటకంలో కూడా కరటకశాస్త్రి శిష్యుడు కాళిదాసు శాకుంతలాన్ని తుంగలో తొక్కి నాలుగురాళ్లు కూడే కొత్త చదువుల కోసం ఆరాట పడుతాడు "పనికొచ్చే ముక్క ఒకటి యీ పుస్తకంలో లేదు. నాలుగంకెలు బేరీజు వేయడం, వొడ్డీ వాశీ కట్టడం కాళిదాసుకేం తెలుసును ?" ఈ రోజుల్లో సంస్కృతం చదువు దరిద్రులకా్కవాలి అనుకొంటాడు గురువుగారు. వొట్టుపెట్టుకోవలసివస్తే శాకుంతలం మీద పెట్టుకోవడం సహించడు. "ఈ పుస్తకంమీద నాకు నమ్మకం పోయింది. మరో గట్టిప్రమాణం చెయ్యండి. గిరీశంగారిని అడిగి ఒక యింగిలీషు పుస్తకం పట్టుకురానా ?"

పూర్వ సాహిత్యమనే కాదు. అసలు సాహిత్య విద్య అనేదే మారుమూల పడుతున్న శాస్త్రీయ విజ్ఞాన యుగారంభంలో గురజాడ ఆంధ్రదేశంమీద కొత్తపొద్దుగా కనిపించాడు ఎక్కడో విశాఖ మండలం మారుమూల పల్లెల్లో, చదువేలేని పామరులు కూడా తమ విశ్వాసాలను ప్రశ్నించి సవాలు చేస్తున్న కొత్త వాతావరణం అప్పుడప్పుడే బలీయమౌతూ వుండెను కథల్లోని సిద్ధులు చేసే ఆకాశ యానం కంటె తెల్లోడి తీగె టపా ఆశ్చర్య జనకమౌతూ వుడెను. "తెల్లోడు యెర్రోడా ? పట్నంలో గొట్టాలెట్టి అదే సూస్తాడే ఆకాశంలోకి ?" చివరకు అగ్నిహోత్రావధాన్లు వంటి చాదస్తుడు కూడా తన కొడుకును పట్నవాసానికి పంపి యింగ్లీషు చదువు చెప్పించి "యాడాదికో నూట్యాపాయలు కర్చు" పెడుతూ వుండెను.

అందుచేత దేశావసరాలకు అనుగుణమైన శాస్త్రీయ వైఖరిని సమర్థించిన అప్పారావు శాస్త్రవిద్యను తక్కువచూపు చూడజాలడు. అయినా ఆయన రచనలు ఎక్కువగా సాహిత్య విద్యనే ప్రస్తావించాయి. భాషా సంస్కరణావేశం ఆయన మనస్సును కొంత వక్రింపజేసిందేమో ? ఏది ఏమైనా, పాఠ్య ప్రణాళికలలో పెనుమార్పుకు ఆయన సుముఖుడు. విద్యాధికులలో విద్యా సమస్య గురించి నిరంతర జాగృతి అవసరమని భావించాడు.

"విద్యా విషయిక సమస్యలను చర్చించడం పట్టభద్రుల ప్రప్రథమ కర్తవ్యం నిజంగా ఆలోచిస్తే విద్యాసమస్యలపై యిపుడు మనకు ప్రతిభావంతమైన 'పబ్లిక్ ఒపినియనే' లేదు." (15) పట్టభద్రుల సంస్థలు కావాలి. మహిళలకు ఇంగ్లీషు బోధించాలి. భారతదేశ చరిత్రలో ఆధునిక యుగానికి ఎక్కువ ప్రాముఖ్య మివ్వాలి. విద్యారంగంలో కృషి చేసేందుకు పోటీలు ఏర్పాటు చేసి, జీతాలు హెచ్చించి, అర్హతలనుపట్టి మాత్రమే ఉద్యోగాలివ్వాలి. మాతృభాషలో ప్రొఫెసరు షిప్పులు ఏర్పాటుచెయ్యాలి. యూనివర్సిటీలలో రిసెర్చి ఫెలోషిప్పులు నెలకొల్పాలి బోధనా పద్ధతులను పూర్తిగా నవీనం చెయ్యాలి. ప్రైవేటు మేనేజిమెంట్లకు విద్యాసంస్థలను అప్పగించకూడదు ఇవన్నీ అంటుంచి, వ్యావహారిక భాషను ప్రవేశపెట్టాలి.

ఇది ఒక్కొక్కటీ ఒక్కొక్క నినాదంలా ధ్వనిస్తున్నది. అప్పటికీ ఇప్పటికీ ఆ సమస్యలు తెగనూలేదు, ఆ రాత్రి తెల్లవారనూలేదు. అప్పారావు, గిడుగు రామమూర్తి వంటి దేశీయులూ, ఏట్సు, మార్కు హంటరు వంటి విదేశీయులూ సల్పినకృషి ఫలించకుండా 1912-13 లో "నెల్లూరు రెడ్లు, తెలుగు జమీందార్లూ" అడ్డుపడ్డారు పిఠాపురం జమీందారు, జయంతి రామయ్య, బయ్యా నరసింహేశ్వరశర్మ, మోచర్ల రామచంద్రరావు, వేదం వేంకటరాయశాస్త్రి, న్యాపతి సుబ్బారావు వేమవరపు రామదాసు-భూస్వాములూ, ఛాందసబ్రాహ్మణ పండితులూ - ఈ విద్యాసంస్కరణలను విజయవంతముగా నిరోధించ గలిగారు. వాటిని తిరిగి లేవనెత్తి మరింత నవీనంచేసి ఫలితాన్ని సాధించ వలసిన బాధ్యత ఈ తరానిది.

---

## పాదపీఠికలు (Foot notes)

(1) "పాండిత్యం కంటే రసగ్రహణశక్తి, కళాభిజ్ఞత, రచనా కౌశల్యము ఎక్కువగా వీరి కలవడినవి" పరిశోధన (డిసెంబరు, జనవరి 1956) (2) "నిజముగా ఆలోచించిచూడగా మీకు అనుభవమే ఎక్కువగాని విద్యానైపుణ్యత తక్కువ"

అకాశరామన్న ఉత్తరాలు : వ్యాసచంద్రిక. పు. 73. (3) డైరీలు-పు. 127-128. (4) మాటా మంతీ : అవీ, ఇవీ : పు. 59. (5) వ్యాసచంద్రిక : పు. 136: (6) డైరీలు : పు. 123, (7) డైరీలు : పు. 214--15, (8) లేఖలు : పు. 36-43. (9) గిడుగు సీతాపతి : గురజాడలేఖలు : పు. 218-219 (10) వ్యాసచంద్రిక : పు. 119, (11) వ్యాసచంద్రిక, పు. 136 : (12)వ్యాసచంద్రిక. పు. 116, (13) డైరీలు, పు. 44, (14) వ్యాసచంద్రిక, పు. 135. (15) డైరీలు : పు. 127-128.

# 7. రచనా తత్వం

"తెలుగులో నవ్యరీతులకు నూతన ప్రమాణాలకు ప్రయత్నించిన మొదటి కవిని నేనే. నా కావ్యకళ నవీనం; కావ్య యితివృత్తాలు భారతీయం కవితలో నేను ఉత్తమ పయోజనాలను ఉపలక్షించాను; జీవితాన్ని నూతన దృక్పథ-తో దర్శించి, కథా, కవితా రూపంలో దాని తత్త్వాన్ని అన్వయించడానికి ప్రయత్నించాను. నా కా కళలపట్ల జీవితం పట్ల కొన్ని ఆదర్శాలు వున్నాయి; వాటిని సంస్కృతీపరులు మాత్రం అర్థంచేసుకొని హర్షింపగలరు. సంస్కృతిశూన్యులు కావ్యకథా సంవిధాన, హాస్యధోరణులను గమనించి అంతటితో సంతృప్తిపడతారు"

— లేఖలు : పు. 205.

నవ్యసాహిత్యంలో తమ ఆద్యస్థానాన్ని గురించి ఇంత సాహంకారంగా చాటుకొన్నది వీరేశలింగం ఒక్కడే. నే నంటే నే నని విర్రవీగే రాజుల స్పర్థ కాదిది. ఇంద్ర సింహాసనంకోసమో, బ్రహ్మపదవి కోసమో జరిగిన పోట్లాటకాదు. వీరేశలింగం, గురజాడ అప్పారావులకు ప్రత్యక్షవిరోధమంటూ లేదు.

అయినప్పుడు, ఎవరు మొదలు, ఎవరు చివర అని నిర్ణయించడమెట్లా? కాలక్రమంబట్టి, వీరేశలింగం ప్రథముడని పిల్లవాడైనా చెప్పగలడు. సాహిత్యపదార్థంబట్టి గురజాడ అని నిర్ధారించేందుకు ఎన్ని దొమ్మలుండాలి! అయినా ఆ సాహసం చెయ్యకతప్పదు. వీరేశలింగం అందుచేత మొక్కపోడు ఆయన ప్రధానంగా యుగాంత

రుద్రుడు. ఆయన కృషిఫలితం ప్రధానంగా సంప్రదాయ విచ్ఛేదనం, అప్పారావులో లయంకరునికంటె స్రష్ట, విచ్ఛేదనంకంటె వినిర్మాణం. పౌరుష్య కంటె ప్రసన్నత, సాటోపమైన ఖండనకంటె సమరస పూర్వకమైన సమర్థన యెక్కువగా కనిపించకపోవు. మొదటి నవల, మొదటి ఆత్మకథ వంటివి వీరేశలింగం రాసివుండవచ్చు. ఇరవయ్యవ శతాబ్దపు నాగరికాంధ్ర జీవనానికి అడ్డయిన మత, ఆచార, భాషా పాషాణాభ్యంతరాలను బద్దలుకొట్టి వుండవచ్చు. అయితే హైందవానికి మారు బ్రాహ్మాన్ని (అదీ ఒక మతమే), కఠిన గ్రాంథికానికి మారు సులభగ్రాంథికాన్ని ఆయన చేబట్టాడు. ఆ రెంటినీ గురజాడ విమర్శించి నిరాకరించాడు. హేతుబద్ధమైన మానవవాదాన్నీ, ప్రగతిశీలమైన వ్యావహారిక వాదాన్నీ వరించాడు; ఒక దాని కొనసాగింపే మరొకటి అయినా, దానికి ఇది పైమెట్టు కూడా. వీరేశలింగం పలికిన సంస్కరణా నినాదానికి, రచనల ద్వారా గురజాడ తాత్విక సమర్థనం జత చేశాడు. కార్యశూరుడైన వీరేశలింగంగారి కెంతో, వాఙ్శూరుడైన గురజాడకూ అంతే ఈ దేశం రుణపడివుంది.

గురజాడ రచనలకు కళాపరంగా వచ్చినంత ప్రసిద్ధి వీరేశలింగం రచనలకు రాలేదు; ఎందుచేతం తక్షణ ప్రయోజనాల నుపలక్షించి, ప్రచారకునివలె, ప్రబోధకునివలె రాసిందొకరు. తక్షణ విషయాలనే స్వీకరించి కూడా తాత్వికునివలె, మిత్రునివలె రాసిం దింకొకరు. ఆవేశం ఒకరినీ, ఆలోచన ఒకరినీ ఆశ్రయించాయి. పాత వాసనలు ఒకరిని పూర్తిగా విడిచి పెట్టకపోగా, అవి మరొకరికి ఒంటబట్టనే లేదనాలి. ఈ వాక్యాలకు కొద్దిపాటి మినహాయింపులున్నా, మొత్తంమీద ఇవి నిజం.

పఠనం, పరిశీలనం ఆధారంగా, గురజాడ ఒక రచనాతత్వాన్ని రాబట్టుకొన్నాడు. రచయిత కాలంతోబాటుగానీ కాలానికి వెనకగానీ నడవగూడదని నిర్ణయించుకున్నాడు.

"సరి, సరి; మీ కింకా తెలియదన్నమాట కవిగారి స్వప్నలోకం; ఊహాప్రపంచం. అక్కడ బీదా బిక్కీ వుండరండోయ్!", అన్నాడు నాయుడుగారు.

5

"ఊహా ప్రపంచమా ? కాదు. మనం వుంటున్న ఈ లోకం సంగతి మాట్లాడుతున్నాను. కవీ తత్వవేత్తా తమ కాలంకంటె ముందు వుంటారు !"

అని ఒక నవలకు సన్నివేశాలు రాస్తూ మాటలమధ్య ఈ మణిని బయల్పరిచాడు. (1)

కాలంకంటె ముందు వుండడమంటే, కాలాన్ని వదలిపెట్టి వట్టి వూహాస్వప్నాలలో తగుల్కోవడం కాదు. కాలంతోబాటు వుంటూనే, లోకంలోమంటూనే, సమకాలికులైన లోకులు అధిక సంఖ్యాకులకున్న అభిప్రాయ ధోరణులను ఆధారం చేసుకొనే, వాటి లోటుపాట్లు సరి చేయగల భావనను పెంపొందించుకోవడమౌతుంది. వక్రాన్ని నిర్వక్రం చెయ్యడం. కాబట్టి ఉత్తమ రచయిత కనే కల, లోకానికి రేపటి నిజమౌతుంది. సమాజంకోసం మేలైన కలలు కంటూ, రాబోయే దానిని మనసులో వుంచుకొని, ఆ గీటురాతిమీద ఉంటున్నదానిని గీసి వెలగట్టడం అతని వృత్తి ధర్మమౌతుంది.

'బంకిం చంద్రుని నవలా రచన' అనే వ్యాసంలో గురజాడే అంటున్నాడు :

"లోకములో నున్నట్టే వ్రాయవలెనని నా అభిప్రాయము కాదు. ఏది యెలావుంటే బాగుండునో అలా భావించుట అను లోకోత్తర కల్పనలుండక, లోకోత్తరమైన రచన లుండనేరవు. దీనినే ఇంగ్లీషువారు ఐడియల్ అని అందురు. (2)

ఉన్నదాన్ని లేనిదానితో జతచేర్చి రాయడమంటే, నిజాన్ని అబద్ధంతో మిళితం చేయడ మనుకొనేరు ! ఒక వస్తువుయొక్క భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని, దాని వర్తమాన స్థితిని చిత్రించడమన్న మాట. అంటే, ఏ వస్తువూ ఉన్నది ఉన్నట్టుగా ఉండబోదు. మార్పు చెందక తప్పదు. ఆ మార్పు, మీదికేగాని కిందికి కాదు; ముందుకేగాని వెనక్కు కాదు. అభ్యుదయంవైపేగాని పతనంవైపు కాదు; ఈ మాటలు అనాలోచితాలు కాదు. వాటిలో గురజాడకుగల జీవితతత్వమంతా ఇమిడివుంది.

నేటి విమర్శా పరిభాషను వాడవలసివస్తే, గురజాడ 'నేచుర లిస్ట్' (ఉన్నదానిని ఉన్నట్టుగానే రాసేవాడు) కాదు 'క్రిటికల్ రియలిస్టు' అవుతాడు. స్థితిని విమర్శాయుతంగా చిత్రిస్తూ, పురోగతిని సూచిస్తూ, లోకవృత్తాన్ని పరిణామదృష్టితో పరిశీలించే రచయిత గురజాడ. ఒక్కొకసారి ప్రస్తుత సమాజ అవలక్షణాలనూ, నైచ్యాలనూ బహిర్గతం చేయవలసివచ్చినప్పుడు, కళాధర్మానికీ వాస్తవవాదానికీ వైరుధ్యం పొసగేది. మీనాక్షి, మధురవాణి పాత్రలను చిత్రిం చడంలో ఈ చిక్కు వచ్చింది. కళాధర్మాన్నే మనసులో పెట్టుకొని ఈ కఠిన వాస్తవానికి వెల్లవెయ్యడమా ? లేక వాస్తవ విషయాలకు వీలైనంత న్యాయం చేకూర్చడంలో కళాధర్మాన్ని దెబ్బతీయడమా ? గురజాడకు వాస్తవమనేది గౌరవించదగ్గది కాబట్టి, ఆయన ఒక లేఖలో రాశాడు :

"వాస్తవిక రచన అనేదానిని కళానైపుణ్యంతో ఆదర్శపూరితం చేసినప్పటికీ, విధిగా అది కొన్ని లక్షణాలను ప్రస్ఫుటీకరించక తప్పదు...... కవితా న్యాయం నిన్న మొన్నటిలాగ నేడు లేదు. మానవ జీవితాన్ని నేను చిత్రిస్తాను. చిత్రిస్తూ కళానైపుణ్యంతో ఆదర్శ పూరితం చేస్తానే అనుకో. కవితాకళకు నేను ఒదిగి వుండవలసిన వాడినే అయినా, మానవ సమాజంపట్ల నాకొక మహత్తరమైన బాధ్యతవుంది." (3)

రొమారోలాకూడా దాదాపు ఇట్లాగే అనవలసి వచ్చింది. వాస్తవమూ కళా కలిసి మనగలిగితే మహమంచిదే. వీలు లేనప్పుడు, కళ వైదొలగితే తొలగనీ ! అబద్ధం మృత్యుసమానం !

మానవ జీవితాన్ని చిత్రిస్తానంటున్న గురజాడ, మానవ వ్యక్తులను గురించి కూడా సమ్యగవహనకు ప్రయత్నించాడు వ్యక్తులేగదా పుస్తకాలలో పాత్రలు ! మానవుని గురించి గురజాడ తయారు చేసు కొన్న తాత్విక సిద్ధాంతాలకు ఈ వ్యాసంలో తావులేదు. అయితే అవి రెండూ ఒకదానితో ఒకటి లంకెపడి వున్న విషయాలు.

మనిషి ఎవ్వరుగానీ పూర్తిగా మంచీ పూర్తిగా చెడ్డా అని గురజాడ ఎన్నడూ తెలపు నలుపులకింద కాంతిని విడగొట్టలేదు.

తెలుపుకూ - నలుపుకూ నడుమ ఎన్నో వన్నె లున్నాయి. మను షుల్లో కూడా వేర్వేరు పాళ్ళలో మంచినీ - చెడ్డనూ కూడగట్టు కొన్నవాళ్ళే ఎక్కువ కావచ్చుగానీ, ఏ చెడ్డవాడైనా చెడ్డ వాడయ్యాడంటే, అది వాడి తప్పు మాత్రమే కాదు. అనువంశిక ప్రభావాలేగాక, సాంఘిక పారిసర్యం కూడా వ్యక్తుల శీలనిర్ణయంలో ప్రముఖపాత్ర నిర్వహిస్తాయి. ఎంతటి మంచివాడైనా ఒకొక్కప్పుడు చెడ్డపనికి దిగబడేటట్లే, ఎంతటి చెడ్డ వాడైనా ఒకొక్కప్పుడు మంచి పనికి పూనుకోకపోడు. కాబట్టి మానవస్వభావం స్థిరమైనదనీ, మార్పుకు తావియ్యదనీ, బాగుపడే వీలులేనిదనీ గురజాడ అనుకోలేదు. ఏ మనిషినీ కులం, స్థితి, విద్యలనుబట్టి కొలిచేపద్ధతి ఆయనకు నచ్చ లేదు. సౌజన్యమనేది ఈ విభాగాల గోడలను దూరి సర్వత్రా వ్యాపించ గలట్టిది. పురుషునికి ఎదురుగా స్త్రీనీ సంసారికెదురుగా సానినీ, సవ ర్ణుల కెదురుగా మాలలనూ దాంపత్యధర్మానికెదురుగా వ్యభిచారాన్ని నిలిపి, వాటి వాటికి వుండు కొన్ని కారణాలను సమూలంగా వెలువ రించగలిగాడంటే ఈ తత్వాయుధసహాయంతోనే.

"నైతిక ధర్మం వేరు; మనోధర్మాలు వేరు. మతం; ఆశయాలు; అభిప్రాయాలు." (4)

నీతి నియమాలకు మనస్సు ఎదురుమళ్ళదూ మరి? మతాన్ని స్వతంత్రాలోచన తృణీకరించదూ? మానవ ల్పితమైన ఈ సంస్థలు మానవుల మనస్సులను కొంతవరకే కొంతకాలమే శాసించగలవు. మనుషుల కోసం సంస్థలు; సంస్థల కోసం మనుష్యులా? కాదు. కాగూడదు.

మానవ మనోధర్మాలను గురించే గురజాడకు అపరిమితాసక్తి. దోషిని వెదకి పట్టి శిక్షించబోయే చండశాసనునివలె గాక, దోషాన్ని కూడా రాబిలిచి కారణాలడిగి తెలుసుకొని క్షమిస్తూనే మంచితెన్నున పెట్టబోయే మితునివలె, గురజాడ మనుషులమనస్సులు శోధించాడు. వీరేశలింగం గురజాడకు ఇక్కడే చుక్కెదురు. మతసహజమైన అస హిష్ణుత గురజాడకు లేదు. ముఖ్యంగా ఆయనది కారుణ్యదృష్టి. ప్రేమ

సిద్ధాంతం. ఉత్తమసాహితీపరునికి ఇది అవశ్యం ఉండదగిందనికూడా అంటాడు.

"అన్నింటికంటె జాలి గొప్పది. మానవులను ప్రాణులను ప్రేమించాలి. ప్రపంచాన్ని ప్రకృతిని కరుణాదృష్టితో వీక్షించాలి. ఇది సాహితీపరునకు అతిప్రధానం. ఉత్తమభావుకత్వానికి పరిపోషకం." (5)

ప్రతి కొత్తదానిలోనూ వింతలను కనిపెట్టాలనే ఆసక్తి జన్మతః వచ్చిన గుణవిశేషం కాబట్టి, ప్రతి అవతలి మనిషిలోని నాణ్యాలను వెదకడం కూడా గురజాడకు అలవడినది. ఒకరి కళ్ళు, మరొకరి మీసాలు, 'భ' గారి అబ్బాయి షోకేలా రంగేలాచట్టం, – ఇట్లా ఎందరు వ్యక్తులను పరిశీలించి ముడివస్తువుగా లెక్కకట్టి వుంచుకొన్నాడో చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. ఇవన్నీ అసమగ్రంగా స్కెచెస్‌వలె నిలిచిపోయినందుకే విచారించాలి. ఆ రూపంలో దొరికినందుకైనా సంతోషించాలి.

పాత్రలను జీవితంనుండి గ్రహించడం ఎట్లాగూ తప్పదు. అయితే వున్నవి ఉన్నట్టే అచ్చుగుద్దుతాడా రచయిత? కొన్ని పాత్రలకు మూలలు జీవితంలోనుంచి మాత్రమేగాక, సారస్వతంలో కూడా దొరుకుతాయి. ఉదాహరణకు శూద్రకుని వసంతసేన, ఏదోవిధంగా గురజాడ మధురవాణిని మలచి వుండకపోదు. ఫాల్‌స్టాఫ్ గిరీశాన్ని కూడా.

"రచయిత తాను రూపొందించే పాత్రల నన్నింటిని జీవితంనుంచి పరిగ్రహించడు. పరిగ్రహించిన పాత్రలను అచ్చంగా పరిగ్రహించినట్లే చిత్రించడు. వెనకటి కవులు నిర్మించిన భావనాత్మక మూర్తుల లక్షణములు అతనికి తెలియకుండానే, అతనిలో ద్యోతకమౌతాయి." (6)

ఐనా, జీవిత వాస్తవం మొక్కట్లతోనే పాత్రలు వెలువడుతాయి, వెలువడాలి. అప్పుడే వాటికి రక్తమూ, మాంసమూ నిండారినట్లు! చివరకు, సౌజన్యారావువంటి అసాధారణవ్యక్తి కూడా జీవిత సముద్రం పైకితోసిన ముత్తెపు చిప్పవంటి వాడే. ఎన్నో అడుగడకల పీతలతోబాటు, ఎంతో ఉవికిపోయిన చెత్తతోబాటు కనిపిస్తున్నది కాబట్టే ఇలాంటిపాత్ర విశ్వసనీయ మనిపించకపోవచ్చుగాని, అలాంటి

అస్ఖలితులకూ్కడా లోకంలో తావుండనే వుంటుంది. గురజాడ సాహిత్యంలోని పాత్రలవిశిష్టతకుగల కారణం, రచయితగానూ, మానవ వ్యక్తిగానూ ఆయన చాటిన తత్వమేనని చెప్పాలి.

"చిన్నతనంలో బొమ్మలాట నేర్చివుండుటచేత లోకమనే రంగంలో చిత్రకోటి రీతులను ఆటాడే మనుషులనే, పాత్రముల సొగసునే కనిపెట్టడం నాకు అలవాటైనది. సొగసులేని మనిషే వుండడు. సేహమూ, ప్రేమా అనేవి అనాదిఅయిన్నీ ఎప్పటికీ కొత్తగా వుండే రెండు వెలుగులను నరులమీద తిప్పి కాంచితే, వింతవింత సొగసులు బయలుదేరుతవి. అసూయ అనే అంధకారంలో అంతా ఏక నలుపే." (7)

ఎందరు ఎన్నిసార్లు ఎత్తిరాసినా చెరిగిపోని మాణిక్యదీపాలు ఈ మాటలు! అది అనేందుకు గూడా తాహత్తుకావాలి. ఎదిగిన వ్యక్తిత్వం ఒక్కటే ఇంత ఎత్తున మనగలదు; వామనులకు ఇక్కడ ప్రాణవాయువులకే ఇబ్బంది.

అలాంటి అద్భుతభావుకుడు, సమకాలిక వాస్తవాలకు భిన్నమై కూడా వాటి లోపాలను పూరించగల రచనాతత్వాన్ని రాబట్టుకోగలగడంలో వింత ఏమివుంది?

నాటి సాటి రచయితలు ఎన్నికచేసి స్వీకరించిన ఇతివృత్తాలను చూస్తే, ఆనాటి సాహిత్యానికి ఏదో కల్పనా దారిద్ర్యం ఉండిందని పిస్తుంది. వట్టి గతానుగతికత్వమే గాని సాహసికత్వంలేదు. వ్యుత్పన్నత నిండారగా ప్రతిభ నిండుకొంది.

1908 లో విజయరామ గజపతికి లేఖరాస్తూ గురజాడ ఈ విషయాన్ని వాచ్యం చేశాడు.

"పుష్కలమైన, అనంతమైన సంఘటనలతో నిండివున్న ఎంతో గాంభీర్యమూ వైవిధ్యమూ కలిగిన నేటి జీవితాన్ని వీక్షించక, ప్రపంచ ప్రసిద్ధికెక్కిన ప్రాచీన కాల్పనిక కథలనుంచి రచయితలు ఇతివృత్తాలను ఎందుకు స్వీకరిస్తారో అర్థంకాక నాకు ఆశ్చర్యం వేసింది." (8)

కన్యాశుల్కం వంటి నాటకరచనద్వారా గురజాడ రుజువు చేయదలచుకొన్న అంశాలలో సాహిత్యవస్తువుగా ఆధునిక జీవితం యోగ్య

మయినది అనేది ఒకటి. నాటక రచయితలైన వారు, గంభీరమయిన ఈ వస్తువును ఏదో కొంచెం వినోదం ఆశించి అన్యాయం చేస్తున్నారనీ, విసుగు పుట్టించేటట్లుగా శృంగార ఘట్టాలను అల్లుకు పోతున్నారనీ మరొక లేఖలో ఆయన రాశాడు. జీవితంలోగానీ, సాహిత్యంలోగానీ స్త్రీ పురుష శారీరకానుభవాలూ, ఆనందాలూ, వాటి వర్ణనలూ ఒక పరిమితికి లోబడి వుండాలి. ....సాహిత్యం కేవలం వీటితోనే ఎందుకు నిండివుండాలి ?" (9)

"కావ్యాలలో శృంగారం" అన్న వ్యాసంలో పరకీయ శృంగారమే నిజమైన పచ్చి శృంగారం అంటూ, "దుష్ట వర్తనునకు తగినశిక్ష జోడు కంచుకాగడాలు వేసి వెతకినను గానరాదు." అని 'అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము' ను విమర్శించాడు (10)

ఇటువంటి శృంగారం కథావస్తువుగా స్వీకరించే రచయితల నైతిక బాధ్యతను గురించి ఇదొక సూత్రీకరణ వంటిది. పొయటిక్ జస్టిస్ ప్రకారం కాకున్నా, పాఠకుల మానసికారోగ్య దృష్టితోనైనా, కథలో చెడుకు గెలుపు చేకూరకూడదు. కవి కల్పించుకొని, మంచికి బలం కలిగించాలి దుర్గుణాన్ని ఆకర్షవంతం చేశానా అని తనకు తానుగా చర్చించుకొన్న వివేచనాపరుడైన గురజాడ రచనా తత్వానికి ఈ సూత్రం పరాయిదేమీకాదు ఒక రచన సాగుతున్నప్పుడే, రచయిత మనస్సు ద్విముఖంగా పని చేస్తుంది. సృజన, విమర్శన అనేవి పక్కపక్కల ముందు వెనుకల సాగిపోతుంటాయి అంటాడు.

"అభిరుచి, గుణదోష నిశ్చయజ్ఞానము వున్న రచయిత ఒక కావ్యాన్ని రచియిస్తున్నప్పుడు, అతని సృజన, విమర్శనాత్మక శక్తులు రెండూ కుడి ఎడమలు గా ఆ కావ్యసృష్టిని కొనసాగిస్తాయి. భావ భావోద్వేగపాత్ర సన్నివేశాదులను మేధ సృష్టిస్తూవుంటే, వాటికి విమర్శనాత్మకశక్తి గేటుపెట్టి కొన్నిటిని స్వీకరిస్తుంది. కొన్నిటిని తిరస్కరిస్తుంది." (11)

గొప్ప. రచయితలకు గూడా ఈ రెంటిపొందిక ఎల్లవేళలా వుండదనేందుకు గురజాడే తార్కాణం. రెండవ ముద్రణలోనేగదా, కన్యాశుల్క నాటకంలోని తొలి లోపాలను ఆయన సవరించుకో

గలిగింది! పాఠకులూ, విమర్శకులూ ఈ విషయంలో రచయితకు సాయంచేస్తా రనేందుకు, శ్రీనివాస అయ్యంగారు, ఒంగోలు ముని సుబ్రహ్మణ్యంగార్ల సూచనలు కన్యాశుల్కంలోని కొన్నిమార్పులకు కారణమయ్యాయని ఒక ఉదాహరణం ఇవ్వవచ్చును.

ఇతివృత్తం విషయ మొక్క టేకాదు. వర్తమాన జీవితాంశాలను కావ్య వస్తువులుగా స్వీకరించడంలో కూడా, రచయితల వెఖరి ఎట్లా గుండాలి? 'బ్రాహ్మ వివాహం' అనే వీరేశలింగం ప్రహసనంలో వలె, ఆచార వ్యవహారాలను అవహేళన చేయడంతో సరిపెట్టు కోవాలా? కాదని గురజాడ అన్నాడు. అక్కడే వుంది కన్యాశుల్కం నాటక విశిష్టత. అది హాస్యప్రధాన మనుకొనేవాళ్ళు అనేకులున్నారు. "నేను ఎంత హాస్య ప్రసన్నుడనో అంత గంభీరుడను, భయంకరుడను." వ్యక్తిగా ఏమోగాని, రచయితగా అతని రచనలపట్ల మాత్రం ఇది నిజం. 'బ్రాహ్మవివాహం' ప్రహసనానికీ, కన్యాశుల్కం నాటకానికీ గల సారూప్యాలను గురించి రాస్తూ, గురజాడ అన్నాడు:

"...మా ఇద్దరి నాటకాల్లోను సమాన పోలికలుగల వాక్య కదంబాలుండడం గమనించాను. ఆయన నాటకం బ్రాహ్మ వివాహా లను సాకల్యంగా చర్చించే యితివృత్తం కలది కనుక, మా నాటకాలలో ఈ తుల్యత వుండడం సహజం కాని మా రచనాపద్ధతి పూర్తిగా విభిన్నం కనక ఈ రెండు నాటకాలలోను సమానధర్మం ఎంత మాత్రం వొకటి కాదనేది స్పష్టం. స్వతంత్ర సంకీర్ణ యితివృత్త నిర్వహణకు పాత్రీకరణకు ఔచిత్య పోషణకు కన్యాశుల్కంలో ప్రయత్నించ బడింది..." (12)

ఏవి వీరేశలింగం రచనలలో కొరవడ్డాయో (బహుముఖమైన యితివృత్తం, పాత్రీకరణ, ఔచిత్యపోషణ) అవే గురజాడ రచనలకు బలాన్నిచ్చేవని ఆయన భావం కాబోలు. అయితే సాహిత్యప్రయోజనం గురించిమాత్రం, ఆ ఇద్దరికీ ఎక్కువ తేడా వున్నట్లులేదు. దురాగతాలను బహిర్గతం చేస్తూ, "ఉన్నత నైతిక భావాలను వ్యాప్తిచేయడంకంటె, మిన్న అయిన లక్ష్యమూ ప్రయోజనమూ సాహిత్యానికి వేరొకటి లేదు," అని గురజాడ పై సందర్భంలోనే అన్నాడు. ఉన్న భేదమల్లా రచనా

పద్ధతిలోనే. వీరేశలింగంతోనే గాక, వేంకటరాయ శాస్త్రితోకూడా ఈ అంశంలో గురజాడకు పేచీవుంది. ఆయన లేఖలే సాక్షి. శాస్త్రి గారి 'ప్రతాపరుద్రీయం' వంటి నాటకాలలోని కవితా ప్రౌఢిమ, కల్పనాచాతుర్యాన్ని మెచ్చినా, పాత్రల పెరుగుదలకు ఉపకరించక నాటక కథా విస్తరణకు తోడ్పడక వుండే భాగాలను విమర్శిం చాడు 'ఉష' మాత్రం ఈ పాటి మెప్పుకైనా నోచుకోలేదు. విష్కం భాలను ఆశ్రయించి, ఔచితితప్పిన పాత్రలను సృషించినందుకు శాస్త్రి గారికి "కళ" అంటే యేమిటో బొత్తిగా తెలియదని తీర్పుచెప్పాడు. మొత్తంమీద, నాటి తెలుగు నాటకాలలో ఎక్కువ భాగాన్ని "వొట్టి డొళ్ళ సరుకులు"గా తేల్చివేశాడు.

ఆత్మస్తుతి – పరనిందగా కనిపించవచ్చుగాక, ఈ అభిప్రాయాలు తేలికగా ఇచ్చినట్టివిమాత్రం కాదు. శత్రువులనుకొనే వాళ్ళలోకూడా గుణాన్ని మెచ్చే గురజాడకు పరనిందను అంటగట్టు లేము. ఇతరుల రచనలను చదువుకొని ఆనందిస్తూ, రచనా వ్యాసంగ మంటే పట్టని మనిషి కన్యాశుల్కాన్ని రాయడంకూడా, సాటి రచయితలకు ఒక మార్గాన్ని చూపుదామనే. "ముఖ్యంగా నాటకకర్తలు తప్పుదారులు బట్టి పట్టాలు తప్పి సాహిత్యసృష్టి సల్పుతున్నారని నేను గమనించాను" అంటూ విజయరామ గజపతికి రాసిన లేఖాంశం.

ఈ వ్యాసం మొదట ఉద్ధరించిన గురజాడ వాక్యాలను ఇప్పుడు చదువుకోండి. అవి అహంకారపూరితాలో, సూనృతాలో తెలిసివస్తుంది.

---

## పాదపీఠికలు (Foot notes)

(1) మాటా మంతీ - అవీ యివీ: పు. 219; (2) వ్యాసచంద్రిక, పు.4దే, (3) లేఖలు, పు. 80-81; (4) మాటా మంతీ - అవీ యివీ, పు.225; (5) అ8: పు. 130; (6) అదే, పు. 155; (7) వ్యాసచంద్రిక, పు. 78; (8) లేఖలు, పు. 15; (9) అదే, పు. 83; (10) వ్యాసచంద్రిక, పు. 12; (11) మాటా మంతీ - అవీ యివీ, పు. 155; (12) అదే, పు. 108.



# 8. కన్యాశుల్కం I

"ఇతివృత్త స్వీకరణలో, నిర్వహణలో, హాస్యరస పోషణలో పాత్రోన్మీలనములో, తెలుగు సాహిత్యములో ఇది అత్యుత్తమ నాటకమనే విషయాన్ని మరువకండి."

—ఆడిభొట్ల నారాయణదాసుకు
గురజాడ లేఖ

"ఒక పిల్లను వివాహం చేసుకొందుకు తండ్రికి డబ్బు చెల్లించే వొప్పందం, నీతి బాహ్యం; ఇండియన్ కాంట్రాక్టు ఆక్టు 23 వ సెక్షన్ ప్రకారం చట్టవిరుద్ధం" (క్రింది గీతలు వ్యాసకర్తవి).

ఇది 1909 ప్రాంతంలో కన్యాశుల్కం నాటకం రెండవ కూర్పుకు పీఠిక రాస్తున్నప్పుడు, గురజాడ అప్పారావు సహర్షంగా పేర్కొన్న వాక్యం. అయితే కర్త తాను కాదు. తాను శాస్త్ర కాదు కనుక. మదరాసు హైకోర్టు చేసిన తీర్పులో ఇది ఒక అంశం.

లోకుల చెవిని ఇల్లుకట్టుకొని దశాబ్దాలనుండీ వీరేశలింగంవంటి సంస్కర్తలు పెట్టిన పోరు ఆచారపరుల చర్మాన్నిదాటి తలకెక్క లేదు. శిష్ట జనాభిప్రాయాన్ని మన్నించి, న్యాయస్థానం కన్యాశుల్క దురాచారాన్ని నీతి బాహ్యం అనే కాకుండా, చట్ట విరుద్ధమనికూడా ఖండించింది. ఉంగరాల చేతిమొట్టు తిన్నతర్వాతనే, సంస్కర్తల తిట్టు దురాచార పరులకు తెలిసివచ్చింది.

విజయనగర ప్రభువు ఆనందగజపతి ఒక విధంగా కన్యాశుల్క నాటక రచనకు మూల విరాట్టు విశాఖజిల్లాలో మూడేళ్ళ కాలాన జరిగిన బ్రాహ్మణ కన్యాశుల్క వివాహాలగురించి ఫోటోలు తీయమని 1883 ప్రాంతాన ఉత్తరువుచేసిన ఫలితంగా, ఈ స్వసంతాన క్రయ విక్రయ దుష్కర్మకాండ బటా బయలైపోయింది. చిన్నారి పొన్నారి ఆడబిడ్డలను కాసుకులోనై తెగనమ్మే తలిదండ్రులు లోక న్యాయస్థానం ముందు ముద్దాయిబోనులో నిల్చున్నారు. పుట్టియున్న బిడ్డలనే కాక, కడుపున పడీపడని బిడ్డలనుకూడ ముందుగానే తెగనమ్ముకొనే మానవ విక్రేతలు పశుముఖాలతో కనిపించారు. కుండమార్పిడి పెళ్ళిళ్ళు, ఫిరాయింపు పెళ్ళిళ్ళూ రచ్చకెక్కాయి బాల్యవివాహాలు స్త్రీలకైతే, వార్ధక్య వివాహాలు పురుషులకు నాల్గింట మూడువంతుల జీవచ్ఛవం ముక్కుపచ్చలారని బిడ్డను సమంత్రకంగా పాణిగ్రహణం చేసేది! కటిక రాతినుంచిగూడా కన్నీటిజెల ఉరలి రావలసిన దుస్థితి, ఆవరకే సంస్కర్తలను నొవ్వించి ఏవ్వించింది. వీరేశలింగం బ్రాహ్మవివాహ మనే ప్రహసనం రాసి, ఆచార వ్యవహారాలమీద అవహేళనా పరశువు పైకెత్తాడు అయినా, అవి శిఖండ్లు కనక చావలేదు. ఎన్ని బాలవైధవ్యాలు! ఎన్నెన్ని గుండెలకుంపట్లు! చీకటిదారులకు పోకిరి పోకడలకు ఎన్ని ప్రోత్సాహాలు! ఇది ముఖ్యంగా నైతికసమస్య. గంభీరమైనది. విషాద గంభీరమైనది.

"మాయప్ప సుబ్బమ్మ మిక్కిలి యదృష్టవంతురాలని చెప్ప వచ్చును. ముసలి మగనిని గట్టుకొని సవతి బిడ్డలతో గాపురము చేయ నక్కర లేకుండ, బాల్యమున వైధవ్య దుఃఖమనుభవింప నక్కర లేకుండ, వివాహమయిన నెలదినములలోనే యామె మృతినొందెను."

"1877 సంవత్సరములో మా చెల్లెలు పున్నమ్మకు మూడు సంవత్సరముల వయస్సులో మా స్వగృహమునందు వివాహము జరిగెను. కాని మిక్కిలి చిన్నపిల్ల యగుటచే మా చెల్లెలు పెండ్లిపల్లకిలో గూర్చుండక మారము జేసెను."

చనిపోయినవాళ్ళే అదృష్టవంతులట! పెళ్ళికంటె చావే ముచ్చటగా భావించవలసిన పరిస్థితి! చిలకమర్తి లక్ష్మీనరసింహం

స్వీయ చరిత్రలోని మాటలివి. గుండెలనుండి కన్నీళ్ళను ఏత మెత్తుతున్నాయి.

"కాసుకు లోనై తల్లిదండ్రీ
నెనరూ న్యాయం విడనాడీ
పుత్తడి బొమ్మను పూర్ణమ్మను వొక
ముదుసలి మొగుడికి ముడివేస్రీ."

పూర్ణమ్మ కథను అశ్రుపూర్ణంగా రాయకముందే, గురజాడ అప్పారావు కన్యాశుల్కం రాశాడు. విజయనగరం మహారాజావారి కళాశాలలో అప్పుడు అధ్యాపక వృత్తిలో వున్నాడు. 1892. జగన్నాథ విలాసినీ నాటక సమాజంవారు ప్రదర్శించారు. పత్రికలు మెప్పుల పూల వాన కురిపించాయి. తెలుగు సాహిత్యంలో ఇది ఒక 'సంఘటన' గా పేర్కొన్నాయి. దీనిని ప్రచురిద్దామనే ఆలోచన మునుపు లేనిది ఇప్పుడు కలిగింది. రచయితలు తామే ముద్రణ కర్తలు. ప్రచురణకర్తలు, ప్రకటనకర్తలు కావలసియుండిన నిరుత్సాహకర వాతావరణాన్ని జయించి, అప్పారావు దీనిని 1897 లో అచ్చువేశాడు. అదిలగాయతు, ఈ నాటకం తెలుగు సాంఘిక నాటకానికి శ్రీ కారం చుట్టింది. అది పెట్టింది. మౌలికమయింది. ముఖ్యంగా అప్పారావు కన్యాశుల్క గతప్రాణి అయి నిలిచివున్నాడు. నాటకాన్ని ఆనంద గజపతికి అంకిత మిచ్చాడు అందులో, నాటక రచనోద్దేశాన్ని గంభీరంగా చాటాడు.

'నైతిక పతనంవల్ల ఉత్పన్నమైన సామాజిక రోగలక్షణాలతో నిండివున్న దుర్భర హింసాత్మక బానిసత్వంతో క్రుంగిపోయే స్త్రీ జాతిని ఉద్ధరించడ మెలాగ అనే సమస్యపై పదేళ్ళక్రితం మీ దృష్టి లగ్నమై వుండగా ఈ సమస్యపై ప్రజాబాహుళ్యపు దృష్టిని మళ్ళించి ఆలోచించేట్టు చేయడానికై సామాజిక దోషాలను బహిర్గతంచేస్తూ వినయ విధేయతలుగల మీ భృత్యుడు వొక నాటకాన్ని రచించాడు.' (1)

సాధనమైన ఆనంద గజపతి, సాధకుడైన అప్పారావు ప్రతిభవల్ల మరుగున పడ్డాడు. విజయరామ గజపతి హయాములో ఈ నాటకం కుబుసం విడిచింది. యస్. శ్రీనివాస అయ్యంగారు వంటి పండిత

మిత్రుల సూచనలతో తన వివేచనను జోడించి, 1909 లో పాత నాటు కాన్ని కొత్త మూసలో పోసి, భూగర్భంలోని బంగారాన్ని అక్షరాలా సువర్ణంగా మార్చివేసి, రెండవకూర్పు వెలువరించాడు. దాదాపు పూర్తిగా మార్పుచెందిన ఈ నాటకమేగాని, మొదటిదెట్లాగౌతు ది, తరవాతి సాంఘిక నాటకాలకు ప్రమాణం? రెండింటికీ ఎంత వార వచ్చిందంటే కన్యాశుల్కం నాటకకర్త గురజాడ అప్పారావుకాదు, గోమఠం శ్రీనివాసాచార్యులుగారేనని ఒక పత్రిక మసిపూసి మారేడు కాయ చేయబోయిన త.

అప్పారావు మనస్సును ఆక్రమించిన అనేకానేక విషయాలలో నాటక రంగం చాలా ముఖ్యమైంది అని ఆయనే చెప్పుకొన్నాడు. ఇతరులూ చెప్పారు. షేక్స్పియర్, బెన్‌జాన్సన్, మోలియేర్ ఐంటి వారి నాటకామృతాన్ని ఆపోసనపట్టినట్లు ముడుంబై వరాహనర సింహస్వామి, కన్యాశుల్కాన్ని గురించిచేసిన ప్రశంసలోవుంది. అందు లోనూ, 'కామెడీ' అప్పారావును ప్రబల గా ఆకర్షించినట్టుంది. ఈ నాట కంలో హాస్యసన్ని వేశాలను సమర్థిస్తూ షేక్స్పియర్ కామెడీలను ఉటం కించిన లేఖనుబట్టి ఇది తెలుస్తుంది. హాస్యమైనా, ప్రయోజనయుతమైన హాస్యాన్ని అప్పారావు చేబట్టాడు. కుళ్ళను బయల్పరిచేందుకు, చెడు గునుదుయ్యబట్టేందుకు అశనిపాతంకంటె హాస్యం బలవత్తరాయుధమని పఠనంవల్ల ఆయన గ్రహించాడు. విశ్వవీణ పత్రికలో మే వ. నర సింహస్వామి రాసిన 'గురజాడ అప్పారావు కవి' అనే వ్యాసభాగం:

"సంఘము దురవస్థకు దురపిల్లి ఆనంద గజపతి ఆంగ్లకవుల స్విఫ్ట్, డ్రైడెన్, పోప్ మొదలగు వారి సంఘ దౌరాత్మ్యాధిక్షేప గర్భితమగు సోపహాస వాఙ్మయ రచనలనుపోలు దృశ్యకావ్యము నొక దానిని రచింప అప్పారాయని కాజ్ఞాపించెను." (2)

ఆంగ్ల వాఙ్మయ పరిచయమేగాని, తదన్యమేదీ ఇంత గొప్ప సాంఘిక నాటకరచనకు తగినశక్తిని అప్పారావుకు ఇచ్చివుండదని ఎవరైనా చెప్పగలరు. అంతేకాదు. ఇబ్సెన్ నాటకాలు పాశ్చాత్య ప్రపంచంలోని సాంఘిక జడిమను కదిలించుచుండిన రోజుల్లోనే కన్యా శుల్కం వెలువడింది. మానవశీల స్వభావాలమీద సాంఘిక పారిసర్య

ప్రభావం గురించి ఇబ్సెన్ అభిప్రాయాలు అప్పారావుకు అప్పటికే సుపరిచితాలు కావడంవల్ల, సాంఘిక నాటకనిర్మాణంలో ఇబ్సెన్ కూడా ఒకరాయి అందించివుంటాడని ఊహించవచ్చును.

తెలుగు నాటకరంగ దుస్థితిని గమనిస్తూ వచ్చిన అప్పారావు, దుర్గమారణ్యం నుండి బాటవెయ్యడానికి పూనిక చెయ్యక తప్పలేదు, ధార్వాడ నాటక సమాజం పర్యటించిన ఫలితంగా, అపూర్వమైన నాటక పదర్శనోత్సాహం దేశమంతటా వెల్లి విరిసింది. ఈ ఒక్క వరంతోపాటు అనేక శాపాలను ప్రసాదించి మరీపోయింది ధార్వాడ నాటక సమాజం. రంగస్థలంమీద ఆటకూ, పాటకూ చోటు కలిగింది. అభినయం అడుగంటింది. అయినా పాటనూ, పద్యాన్నీ మరుగు చేసుకొని దోష భూయిష్ఠమైనా అభినయం పరువు నిలుపుకొంటూ వచ్చింది ఉపన్యాస ధోరణి హెచ్చింది. శృంగార సన్నివేశాలు హెచ్చు మీరాయి. ఇతివృత్తాలలో భావ దారిద్ర్యం. ప్రాచీన కథలకు నవీన రూపాలు. వచన నాటకాలపట్ల నిర్లక్ష్యం. కాబట్టి, కన్యాశుల్కం రాయడ లో, అప్పారావు సంఘ సంస్కారంతోబాటు నాటకరంగ సంస్కారాన్ని కూడా ఉపలక్షించాడు. నాటక రచనకు వ్యావహారిక భాష అనర్హమనే అపోహను తొలగించడం ప్రధాన సంకల్పాలలో ఒకటి ఈ ఆశయాలలో ఒక్కొక్కటీ ఒక్కొక్క అసాధారణ ప్రతిభావంతుని కృషి ద్వారానే సిద్ధించ గలిగినప్పుడు, అన్నిటినీ దిగ్విజయంగా సాధించిన అప్పారావు ప్రతిభ, నదివంటిది కాదు. సాగరం వంటిది.

అప్పారావు కన్యాశుల్కం రాయకముందే, విజయనగరం సమీపానగల ముఖలింగ కాపురస్థుడైన డబీరు కృష్ణమూర్తి సూరి, "సుభద్రా పరిణయము" రా డనీ, అందులోనూ కన్యాశుల్క పద్ధతిని నిరసించడమే ప్రధానోద్దేశమనీ, డాక్టర్ యస్వీ జోగారావు మదరాసు ప్రాచ్య లిఖిత భాండాగారం తవ్వి ఎలుకను తీయగా, ఆ డాక్టరు గారి సచ్ఛాత్రుడైన పి. వి. రమణ "జయంతి" పత్రికలో సిద్ధాంతం చేయబోయి రాద్ధాంతం చేసి కూర్చున్నాడు. కన్యాశుల్కం నాటక ప్రత్యేకతను నిరూపించడం కాదు, రూపుమాపడం వీరి లక్ష్యం లాగుంది.

"అప్పారావుగారు చిత్రించిన కరటకశాస్త్రిలు మధురవాణుల లక్షణము లిందు శ్రీకృష్ణునిలో పూర్తీభవించినవి. ఇక సుభద్ర మన సుబ్బి. దుర్యోధనుడు మన లుబ్ధావధానులు. బలరాముడు అపర అగ్నిహోత్రావధానులు." (3)

నందిని పంది చెయ్యడంలోనైనా ఈ విశ్వ విద్యాలయ పాండిత్యం పనికివస్తున్నందుకు సంతోషించాలి. అయితే వి. వి. రమణ ఇంకా డాక్టరుకాలేదు కాబట్టి, అప్పారావుది స్వతంత్ర ఇతివృత్తమనైనా గమనించ గలిగాడు.

కన్యాశుల్కం ప్రహసనం మాత్రమే అనేవాళ్ళు కొందరున్నారు. ప్రహసనానికీ సాధారణ మోదాంత నాటకానికీ భేదం వుంది. హాస్యానికీ అపహాసానికీకూడా తేడా గమనించాలి. కన్యాశుల్కంలో హాస్యం హాస్యంకోసంకాదు. అవహేళనకూడా దాని ప్రధానోద్దేశం కాదు. ప్రతి నవ్వు వెనకా ఎంతో విషాద గాంభీర్యం భిత్తిగావుంది. బఫూనరీ లేదు. అతివికృతాలైన ఆకార, ఆలాప, చేష్టితాలద్వారా కలిగే మనోవికాసానికి ఈ నాటకంలో స్థానంలేదు. అందుచేతనే, వీరేశలింగంగారి బ్రాహ్మ వివాహ ప్రహసనంతోటి కన్యాశుల్కానికి కొన్ని పై పోలికలున్నా, "కన్యాశుల్కం అలాకాదు. స్వతంత్ర సంకీర్ణ యితివృత్త నిర్వహణకు పాత్రీకరణకు ఔచిత్యపోషణకు కన్యాశుల్కంలో ప్రయత్నింపబడింది" అని అప్పారావే అన్నాడు (4)

## 2

"ఇటువంటి దురాగతాలను బహిర్గతంచేస్తూ, ఉన్నత నైతిక భావాలను వ్యాప్తిచేయడంకంటె మిన్నఅయిన లక్ష్యమూ, ప్రయోజనమూ సాహిత్యానికి వేరొకటి లేదు."

— కన్యాశుల్కం తొలికూర్పు పీఠిక

నైతిక భావాలను ప్రబోధించడమే ప్రచార సాహిత్య లక్షణమంటూ సౌందర్యవాదులు అంటూనే వున్నారు. నైతిక భావాల

ప్రబోధంకోసమని పాత్రలనూ, సంఘటనలనూ సహజంగా నడవనీయక, సంస్కరించి పరిమితులకు లోబరచి ందుచేతనే, కన్యాశుల్కం కొంత దెబ్బతిన్నదనే విమర్శకులూ ఉన్నారు. వారిలో బుర్రా వెంకటసుబ్రహ్మణ్యం ఒకరు. 'త్రివేణి' ఆంగ్ల పత్రికలో Social purpose and Telugu Literature అనే వ్యాసం రాస్తూ ఆయన ఇలా అన్నారు:

"I am not ashamed to confess that I am one of those lovers of the characters of Gireesam and Madhuravani, who regret thst these sterling creations, and particularly Gireesam, should have been sacrificed by the author to a Social Cause, and in the process, translated out of shape. This the author did to suit a drama to which the social theme and social purpose became more important than the spontaniety of art that first created these characters. Gireesam, who in the beginning bids fair to rank with the world's best humorous characters for the Telugus, dwindles into a mighty little man of virtue as the play progresses." (5)

తన నాటక ప్రయోజనానికి ఏదైతే విహితమని గ్రంథకర్త అనుకొన్నాడో, దానినే దౌర్బల్యమని విమర్శకుడు అనుకొంటున్నాడు! సాంఘిక ప్రయోజనానికి అనువుగా మార్చినందువల్ల కళా సహజత్వం దెబ్బతిన్నట్లు అభిప్రాయపడుతున్నాడు. గిరీశంలోనూ మధురవాణిలోనూ సన్మార్గంపట్ల మొగ్గు కనిపించేసరికే ఆ పాత్రలు అసహజమైపోయినట్లు (రచయిత తీర్చి దిద్దాడు కాబట్టి) భావిస్తున్నాడు. పాత్రోన్మీలనములో అప్పారావు ఈలాంటి విమర్శకులకంటె ఒక మెట్టు పైనున్నాడు. పాత్రలు పెరగాలి. చిత్తసంక్షోభంద్వారా భావసంఘర్షణద్వారా వాటి స్వభావాలు తేటపడి వన్నెకెక్కాలి. చెడుగునుంచి మంచికేగాక, మేలునుంచి మేల్తరానికి పయనించే మానవస్వభావం గురించి అప్పారావుకు సమ్యక్ అవగాహన వుంది. మనిషిలోని సొగసును చూడటానికే అలవాటుపడ్డానని స్వయంగా చెప్పుకొన్నాడు అయితే బలవంతంగా పాఠకులమీద నైతికప్రబోధాలను విధించే పొరపాటును మెళకువతో తప్పించుకొన్నాడు. 'కన్యాశుల్కం నాటకం పిలవని పేరంటానికి 'మా

అప్పు పట్టుచీరె కట్టుకొంస్తా' నని బయలుదేరి, యేదో ఒక నైతికోద్దేశాన్ని ప్రత్యక్షంగా బలవంతంగా నెత్తిన రుద్దదు. కాని దానికి చిక మహత్తరమైన నైతిక ప్రయోజనం వుంది." ఏమిటో అది? సాంఘిక శుఒకి మూలమైన వైవాహిక వ్యవస్థను సంస్కరించడ మనుకోవచ్చు. దుఃఖ భాజనమైపోయిన స్త్రీజీవితాన్ని సుఖమయంచేసే ప్రయత్న మనుకోవచ్చు. వక్రించిన మానవత్వాన్ని సరిదిద్దడమనుకోవచ్చు.

"మానవ జీవితంతో నేను చెలగాటం ఆడటం లేనేలేదు. ఎట్టి త్మణీకారభావమూ లేకుండా మానవజీవితాన్ని గంభీరమైన దానినిగా భావించి, ఈ నాటకంలో దానిని ఇతివృత్తంగా స్వీకరించాను. ఆద్యంతం నవ్వు తొణికిసలాడేటట్లు ఇంత గంభీర యితివృత్తాన్ని నిర్వహించడం అంత తేలికైన పనికాదు." (6)

మానవజీవితాన్ని యితివృత్తంగా గ్రహించినా, తనకుగల కళా నైపుణ్యంతో దాని నిజాలనూ నిష్ఠురాలనూ కప్పిపుచ్చి ఆదర్శీకరించి అబద్ధీకరించే వీలు రచయితకు ఉందని అప్పారావు గుర్తించాడు. అయితే, తాను ఆ పని చెయ్యదలచుకోలేదు. కళ కంటె గౌరవించ దగినది సమాజ వాస్తవం. అయితే, వాస్తవాన్ని పట్టుకొని యథా తథంగా అచ్చుగుద్దడం కూడా తన అభిమతం కాదు. మధురవాణి, మీనాక్షివంటి పాత్రలు కనిపించే దృశ్యాలు అవినీతి స్ఫోరకాలుగా ఉన్నాయనే ప్రాచీన భావాలు గల నవీన యువకుని విమర్శకు జవాబిస్తూ అప్పారావు అన్నాడు: "కవితా కళకు నేను వొదిగివుండ వలసినవాడినే అయినా, మానవ సమాజంపట్ల నాకొక మహత్తరమైన బాధ్యతవుంది కనుక పాఠకులు నన్నొక ప్రశ్న అడగవచ్చును. నేను వొక దోషాన్ని దుర్నడతను ఆకర్షవంతం చేశానా? చేయలేదనే భావిస్తున్నాను." (7) అందుచేతనే మధురవాణి పాత్ర స్వభావాన్నికూడా మార్చడ జరిగింది. సనాతనులను తృప్తిపరచేందుకో, నైతికోద్దేశాన్ని వ్యాపించేసేందుకో యీ సంస్కరణ జరగలేదు. మానవ స్వభావం గురించి తనకున్న అవగాహనకు అనుగుణంగానే జరిగింది.

"మానవుడు పరిస్థితులకు కేవలం బానిస అని, తన ప్రవర్తనను తాను నిశ్చయించుకోలేని నిస్సహాయుడని అనుకోవడం పొరపాటు.

శారీరక మానసిక ధర్మమును నిర్ణయించడంలో అనువంశిక పరిసరాల ప్రభావాలు అధికంగావున్నా, వాటిని మానవుని మేధాశక్తి సరిదిద్ద గలుగుతుంది. మానవునికి కావలసినది సంకల్పబలం." (8)

రచయితకూడా లోకంలో కనిపించే వ్యక్తులను కనిపించినట్టు గానే అచ్చుమచ్చుగా గ్రంథస్థం చెయ్యడు. సృజనశక్తిని విమర్శన శక్తి సరిదిద్దుతూనే వుంటుంది. కాబట్టి పాత్రలను కొన్నిటిని సంస్కరించినందుచేత, వాటి స్వభావం మెరుగయిందేగాని తరుగుకాలేదు.

## 3

7 అంకాలు, 29 పాత్రలు గల కన్యాశుల్కం బృహత్ నాటకం అని చెప్పనక్కరలేదు. అందుచేతనే అది సులభ ప్రయోగ సాధ్యం కాలేదు. వేదం వేంకటరాయశాస్త్రి కృత ప్రతాపరుద్రీయానికి కూడా కత్తిరింపులు వినా ప్రయోగించ వీలులేని దురవస్థ ప్రాప్తించింది.

---

### పాదపీఠికలు (Foot notes)

(1) మాటామంతీ, అవీ-ఇవీ పు. 102 (2) జయంతి (పత్రిక) మార్చి 1960. (3) అదే (4) మాటామంతీ, పు. 108. (5) త్రివేణి (పత్రిక) అక్టోబరు 1958. (6) (7) లేఖలు పు. 81. (8) మాటామంతీ పు. 40.

87

# 9. కన్యాశుల్కం - II

"... నేను వాస్తవిక జీవితం నుంచి సమకాలిక యితివృత్తాన్ని స్వీకరించి దానిని తెలుగున వాడుకభాషలో నాటకంగా రూపొందించాను."

— విజయరామగజపతికి అప్పారావు లేఖాంశం

నాయకుడు కనిపించని నాటకం కావాలంటే, కన్యాశుల్కం ఉంది గిరీశం నాయకుడుగా అనర్హుడు. సంస్కర్తలలో ఆషాఢభూతి. సౌజన్యారావు పేరుకు తగ్గట్టే ఆదర్శమూర్తి. సామాన్యులకు అసాధ్యుడు కథ నడిపించింది గిరీశం. ముగించింది సౌజన్యారావు. అయితే వారిలో ఏ ఒక్కరూ నిజానికి కథానాయకులు కాలేదు. బుచ్చమ్మను రాజమండ్రికి తీసుకెళ్ళి పెళ్లాడతానని గిరీశం అన్నాడు. మీనాక్షిని రాజమండ్రికి తీసుకెళ్ళి పెళ్ళాడతానని రామప్పంతులు అన్నాడు. రాజమండ్రిలో విధవల మఠంలో మీనాక్షిని చేరుస్తానని లుబ్ధావధాన్లు అన్నాడు సౌజన్యారావు అ తపనీ చేశాడు. వీళ్ళంతా నిమిత్తమాత్రులు. కథ జరిగింది అగ్రహారాల్లోనో, విజయనగరం, విశాఖపట్నాల్లోనో అయినా, జరిపించింది రాజమండ్రి నగరం. కాబట్టి నన్నడిగితే, కన్యాశుల్క నాటక నాయకుడు శ్రీ కందుకూరి వీరేశలింగం అంటాను. రఘుపతి వెంకటరత్నం అంశ కూడా సోకిందనవచ్చు.

వీరేశలింగం, వెంకటరత్నం నాయకు లనగానే, వ్యక్తులుగా వీరేశలింగం, వెంకటరత్నం అని నా వుద్దేశం కాదు. వాళ్ళు సారథ్యం వహించిన సంఘసంస్కరణోద్యమానికి పురుషవేషం వేస్తే, అదిమాత్రమే

కన్యాశుల్క నాటకానికి ప్రాణమూలం. అప్పుడు ఆచారపరత్వమూ, దోషనిబిడత్వమూ ప్రతి నాయకపాత్ర ధరిస్తాయి. వీరేశలింగం అంశ, వెంకటురత్నం అంశ సౌమ్యమై సౌజన్యారావైనట్లు, ఆచారపరత్వాం అంశ ఉగ్రమై అగ్నిహోత్రావధాన్లనూ, లుబ్ధావధాన్లనూ సాధనాలుగా చేసుకొంది. రామప్పంతులు, గిరీశం, మీనాక్షి వగైరాలు సమాజం చెట్టుతొడిగిన కుక్కమూతిపిందెలు. కరటకశాస్త్రుల్లు, మధురవాణి, వగైరాలు గాలివాటం తెలిసినవాళ్ళు. బుచ్చమ్మ, అచ్చమ్మ, వెంకి వగైరాలు కొత్తపాతల సంధింపులో నలిగి నవసిన వాళ్ళు. ఈ విధంగా విడమర్చి చూస్తే, కన్యాశుల్క నాటకం ఒక యుద్ధరంగమంటాను.

అయుధాలు ప్రయోగించలేదన్నమాటే గాని, మనస్సులు స్పర్థించి, భావాలు ఘర్షించక తప్పలేదు. రాజకీయాధికారం ఉచ్ఛదశకు చేరుకొన్నాక, ఇంగ్లీషు దొరతనంవారు దేశీయప్రజల ఆచారవ్యవహారాలలో జోక్యం కల్పించుకొని శాసనాలద్వారా కొన్ని సంస్కరణలను విధించారు అయినా, 1857 తర్వాత ఈ తొలి తీవరింపు తగ్గడమేగాక, కొంతవరకు సాంప్రదాయిక అధికారవర్గాలకు ప్రభుత్వ రక్షణ చేకూరింది. అయితే, ఇంకొకవైపున విస్తరింపసాగిన అంగ్ల విద్యావకాశాలతోబాటు, కుదురుకోసాగిన పెట్టుబడిదారీ ఆర్థిక పునాది, నగరాలలోనూ బస్తీలలోనూ విద్యాధిక ఉద్యోగివర్గాన్ని సృష్టించి, గ్రామీణ జీవితపద్ధతుల బారినుండి తప్పించి, సంస్కరణోద్యమాలకు అనుకూల వాతావరణం కల్పించాయి. ఇప్పుడు పాలితులలోనే ఒక కూటమి మరో కూటమితో స్పర్థించసాగింది. పత్రికలు, సభలు, సంస్థలు రణరంగాలయ్యాయి. న్యాయస్థానాలకు గూడా యీ వివాదాలు విస్తరించాయి. ప్రభుత్వం ఒక్కొక్కప్పుడు మధ్యవర్తి అయింది. ఈ కోలాహలమే కన్యాశుల్క నాటక కథావస్తువు. జీవితం ముక్కట్లు దాని నిలువంతటా కనిపిస్తాయి రక్తమాంసాలు కలిగిన యథార్థవ్యక్తుల గుణగణాలే దాని పాత్రలను అంటిపెట్టుకొన్నాయి. నాటకంగా దాని బలమంతా ఈ వాస్తవ వాదమే.

దీనినే దౌర్బల్యమనేవాళ్ళు లేకపోలేదు కన్యాశుల్క మనే సంఘాచారం రూపుమాసిపోయింది కాబట్టి, కన్యాశుల్క నాటక పాటవమూ నీగసించిపోయిందని వీరి వాదం. వట్టి ప్రచారపత్రమని యీ నాటక గుణాన్ని నిర్ధరిస్తే, యీ వాదం నిర్వివాదమౌతుందేమో! నేరుగా మోటుగా ప్రచారానికి దిగలేదు పాత్రలను రచయిత అభిప్రాయాలకు బాకాలు చేసుకోలేదు. వాటి సహజత్వాన్ని దెబ్బ తీయలేదు. అందుచేతనే, సాంఘిక చరిత్రాపత్రమైకూడా కన్యాశుల్క నాటకం మానవ మనశ్చిత్రంగా పాఠకులను మోహింపజేయ గలుగుతున్నది. బ్రాహ్మవివాహం వంటి వీరేశలింగం ప్రహసనాలకు పట్టిన గ్రహణం నుండి కన్యాశుల్క నాటకం తప్పించుకోగలిగింది.

"కన్యాశుల్కం గొప్పది. జీవితమంత గొప్పది. సాహిత్యంలో వాస్తవికతను ఇంత సమగ్రంగా ప్రదర్శించిన నాటకం ఈనాటి మన దేశంలో లేనేలేదు. ఇతరదేశాల్లో చాలా తక్కువగా ఉన్నాయి. చిన్న చిన్న జీవిత ఖండాలను (Slices of life) సవిస్తరంగా చూపించిన నవలలూ నాటకాలూ పాశ్చాత్యుల సాహిత్యంలో కుప్పలు తిప్పలుగా ఉన్నాయి. సమగ్రంగా, కళాయుక్తంగా జీవితాన్ని కళ్ళముందర పెడుతూ (అలా సత్యాన్ని ఉజ్జ్వలంగా చూపించడంలోనే ఉపదేశం ఉంది) మహాకావ్యమనిపించుకున్న గ్రంథాలు ఏ దేశంలోనైనా కొద్దిగానే ఉంటాయి. అటువంటివాటిలో భారతదేశంలో 'మృచ్ఛకటికం'తోబాటు ఒక్క 'కన్యాశుల్కా'న్నే నేను ఎన్నిక చేస్తాను." (1

ఇది అత్యుక్తికావచ్చుగాని, అనృతదోషానికి పర్యాయపదం కాదు. కొన్ని నిదర్శనాలు చూపితే, జీవితదర్శనం అప్పారావుది ఎంత అఖండమైందో సంపన్నమైందో తెలుస్తుంది.

అసిరిగాడు దిగదుడుపు వడపప్పు తిన్నాడే అనుకోండి, అజ్ఞానీ, అధమకులస్థుడూ "అపవిత్రంముండాకొడుకు" అని ఏమైనా అనవచ్చు. ఆ తిండిమీద ఆచారం నిషేధం విధించింది. సదరు నిషేధం వంద లేళ్ళుగా అమలుజరిగింది. ఇప్పుడే దానిని వుల్లంఘించడ మెందుచేత? ఏదో పెనుమార్పు వచ్చివుండాలి. మానసికమైన మార్పు. తింటే ఏం చేస్తుంది అనే ధీమా.

ఆకాశయానం గురించి బైరాగుల డంబాలు నమ్మేరోజులు కూడా చెల్లుకొన్నాయి. "తెల్లోడు తీగటపా యేసినాడుకాద్రా? నిమేటికి ఉత్తరం దేశదేశాలకి యెల్లదా?" ఒక గ్రామస్థు డన్నమాటలివి. మొత్తం పరిస్థితిని సూక్ష్మంగా సూచిస్తున్నాయి. ఎక్కడో క్రిమియాలో జరిగిన యుద్ధం వైనం ఇక్కడ మారుమూల పల్లెల్లో వినిపిస్తోంది. మనవాళ్ళయ్యబోటి దొంగలు బయటపడేకాలం ఇది.

"మనవాళ్ళయ్య: ఆకాశంబు సూన్యంబు అనగా యేమీ లేదన్న మాట.

"మునసబు: యేటీ లేదా? గుడ్డోళ్ళకి యేటీ లేదు తెల్లోడు యెర్రోడా? పట్టంలో గొట్టాలెట్టి అదే సూత్రడే ఆకాశంలోకి?"

మరి, గిరీశంగారి నేషనలిజం లెక్చరువిన్న పల్లెటూరి బండివాడు, తమ కానిస్టీబులు మారిపోయేదెప్పుడో అడిగాడంటే ఏం వింత? అవ్యక్తులు వ్యక్తులౌతున్నారు. రామప్పంతులన్నట్టు "యీ యింగిలీసు చదువులు లావైనకొద్దీ వైదీకులే అన్నమాటేమిటి అడ్డమైన జాతులవాళ్ళవాఁకి మా చాకచక్యాలబ్బుతాయండీ." వేదం ఎనభైరెండు పన్నాలుకానీ ఖర్చులేకుండా చదివిన అగ్నిహోత్రావధాను, కుమారుడి ఇంగ్లీషు చదువుకోసం ఆస్తి కరిగించివెయ్యడం సబబుగానే వుంది. లేకుంటే మునసబో, పోలీసో అయ్యేదెట్లాగు? కరటకశాస్త్రి శిష్యుడికి సంస్కృతం చదువుమీదనే గురితప్పింది. మధురవాణి "డబ్బురాని విద్య దారిద్ర్యహేతువ" అంటోంది ఇంగ్లీషు బట్లేరు ముక్కలతో గిరీశం నెట్టుకొస్తున్నాడు.

అది అట్లావుండగా, ఆచారాలక్షయం చిన్ని చిన్ని సంఘటనల ద్వారా బయల్పడుతుంది. ఉన్న ఆచారాల కన్నిటికీ ఏదో ఒక సమర్థన యిచ్చే కుహనా నవీనులకు గిరీశం ద్వారా అప్పారావు తగిలించిన చురక ఇదిగో: అప్పు వసూలు చేయవచ్చిన ఫొటోగ్రాపుపంతుల బంట్రోతును మభ్యపెట్టే దుకు గాయత్రిని వాడుకొన్న గిరీశం అంటున్నాడు: "ఇన్నాళ్ళకి జంఝప్పోస వినియోగంలోకి వొచ్చింది. థియాసోఫిస్టులు చెప్పినట్లు మన ఓల్డు కష్టమ్సు అనిటికీ యేదో ఒహ ప్రయోజనం ఆలోచించే మనవాళ్ళు యేర్పరిచారు." ఇక మధురవాణి

"బ్రాహ్మలలో ఉపదేశం లావూ ఆచరణ తక్కువ" అంటేనూ, బ్రహ్మ ద్వేషి అయిన డిప్టీకలెక్టరు "బ్రాహ్మల్లో ఉన్నంత ఖంగాళీ మాలకూడూ మరెక్కడా లేదు" అంటేనూ ఆశ్చర్యం ఎందుకు ?

కులం చట్రం కదలబారింది. ధర్మశాస్త్ర పద్ధతులకు స్వస్తి మొదలైంది. విద్యమారింది. ధనం ఉద్యోగం అధికారం లక్ష్యాలయ్యాయి. పోలీసుల, వకీళ్ళ, న్యాయాధికార్ల దాక్షీకాలూ లోపాయికారి పనులూ ఎక్కువయ్యాయి. గ్రామీణులమీద మతంపట్టు సళ్ళిచ్చి, సన్నగానూ మెల్లగానూ విజ్ఞాన శాస్త్రం చొరబారసాగింది. సంస్కరణ పవనం బలీయమౌతోంది. దమితులైవుండిన స్త్రీలకు ఒక గుర్తింపు వస్తోంది. ఎన్నో ఎన్నెన్నో చిట్టిపొట్టి మార్పులతో కళపెళలాడుతున్న ఒక ప్రాచీన సంఘ చిత్రాన్ని ఈ నాటకం చట్రం లోపల బంధించగలిగిన రచయిత, వామనమూర్తుల్లో త్రివిక్రముడు. నలుడు, ప్రతాపరుద్రుడు చిత్రనళీయం, ప్రతాపరుద్రీయ నాటకాలలో నాయకులై పురాణాలనూ చరిత్రలనూ తిరగదోడినా, కన్యాశుల్క పాత్రలకంటె ప్రజలను రంజింప చెయ్యలేకపోయారు. కారణం, పజలకు ఈ నాటకంలో తమ ప్రతిబింబాలే తమ సమస్యల బహురూపాలే కనిపించాయి తమ మాటలే తమ ఆలోచనలే వినిపించాయి.

"జీ తంలో లేనివి కన్యాశుల్కంలో ఏవి లేవు ? సంఘములో ఎన్నిరకాల మనుష్యులూ, మనస్సులూ ఉంటే, అన్ని రకాలనీ కన్యాశుల్కంలో చూస్తాము. ఆహారం, నిద్ర, భయం, మైథునం ఇవన్నీ ఉన్నాయి గుడ్డెమీద బాహ్యానికి వెళ్ళడం, పోలిసెట్టి కూతురు ప్రసవం ఇవీ వున్నాయి. చావునీ హత్యనీ సూచనప్రాయంగా మహాకవి వదిలేశాడు....

"ఇవన్నీ ఉండాలని ముందుగా అనుకొని గురజాడ అప్పారావు వీటిని నాటకంలో ప్రవేశ పెట్టలేదు. అలా అయితే గణాలు కిట్టించుకుంయూ కవిత్వం రాసినట్టే ఉంటుంది..." (2)

వ్యర్థమైన ఘటన లేనట్టే, కన్యాశుల్కనాటకంలో జీవితవాస్తవాన్ని కించిత్తుగానైనా బింబించని సంభాషణగానీ పాత్రపోషణగానీ

లేదు. ఒక మహాలక్ష్యం నిరంతర అప్రమత్తతను కలిగించినట్లుగా, మేల్కొని రాసిన నాటకం ఇది.

## 2

"ఒకవ్యక్తి ఒకపద్ధతిని ఏ పరిస్థితులవల్ల అవలంబించవలసి వచ్చిందో అర్థంచేసుకోనపుడు అన్నీ అపార్థాలే. కనక అటువంటి అపార్థాలు కలగకుండా, వస్తు నిర్దిష్ట స్వభావాన్ని తెలుసుకోవాలి."

— గురజాడ అప్పారావు : మాటామంతీ

మానవ స్వభావ చిత్రణలో కూడా అప్పారావు ఒక విశిష్టమైన పద్ధతిని అనుసరించాడు. దానిని శాస్త్రీయ మనేందుకు వీలులేదు. సిగ్మండ్ ఫ్రాయిడ్, జంగ్, ఏడ్లర మనస్తత్వ పరిశీలనగానీ, ఐవాన్ పావ్లోవ్ బిహేవియరిజం గానీ అప్పటికి ప్రసిద్ధికి రాలేదు ఆగస్ట్‌కామ్టే స్థాపించిన పాజిటివిజమ్ మానవునికి మకుటం తొడుగుతూ, సంఘ శాస్త్రాన్ని ఏకైక శాస్త్రంగా ఎన్నిక చేసింది. దానితోటి అప్పారావుకు కొంత పరిచయం వున్నట్లు తెలుస్తుంది. అయితే ఇది దాదాపు ఒక మానవమతం వంటిదైంది. అలాంటి మత విశ్వాసాలను అప్పారావు ఈసడించాడు. పోతే, ఇబ్సెను పేరుకూడా అప్పారావు రచనలలో కనుదగులుతుంది(3) "వాతావరణ వంశపారంపర్య ప్రభావాలు శీలస్వభావ స్థితిగతులను నిర్ణయిస్తాయనే ఇబ్సెనీయను సిద్ధాంతం యింతవరకూ పెంపొందిన జ్ఞాన దృష్ట్యా యెంతో హేతుబద్ధంగా కనిపిస్తుంది." (4) ఈ ప్రభావాలఫలితంగా కావచ్చు, అప్పారావు మానవస్వభావంగురించి తన కొక తత్వాన్ని ఏర్పరచుకొన్నాడు దానినిగురించి విపులంగా మరొక వ్యాసం చర్చిస్తుంది మంచి చెడ్డలనేవి శుద్ధరూపాలలో ఎవ్వరిలోనూ కనిపించవు. ఉన్న కొద్దిపాటి మంచిని గుర్తించి పెంపొందించడమే చేయవలసిన పని. వస్తుపరమైన దృష్టిని అలవరచుకొని, తన్మూలంగా విలువలు కట్టాలి. అలా తరతమాలు నిర్ణయించేటపుడు, వ్యక్తి యొక్క పూర్వాపరాలను గమనించాలి. మార్పుకుగల కారణాలను

దర్శించాలి. అన్నిటికంటె మిన్నగా, ఇతరులను ప్రేమార్ద్రనయనాలతో కరుణామహిత మనస్సుతో వీక్షించాలి. అప్పుడే మనస్సుల లోతు పాతులు, వాటి వాటి సొగసులు దర్శనమిస్తాయి.

వాత్సల్యపూరిత దృక్పథం కనకనే కన్యాశుల్క నాటకంలో కడు చిన్న పాత్రకుగూడా అపచారం జరగలేదు. ద్వేషించదగిన పాత్ర అంటూ ఒకటిలేదు. జగత్పితగానీ ద్వంద్వాతీతుడైన ఋషిప్రవరుడుగానీ కుటుంబపెద్దగానీ ఇలాంటి సమదృష్టిని చూపగలడు. అసిరిగాడు, హవల్దారు, అచ్చమ్మ మొదలు గిరీశం, రామప్పంతులు, బుచ్చమ్మ వరకు ఏ పాత్రకు అది అభిమానించదగింది. వాటి మంచి సెబ్బరల గురించి, నీత్యవినీతులగురించి లోకులు కొట్టుకుచావవలసిందేగాని, అవి అన్నీ రచయిత ప్రేమలో వంతులు పంచుకొన్నాయి. అందుచేతనే రచయిత మహాకవి కాగలిగాడు. మానవ స్వభావం మిశ్రపదార్థమనీ, ఉత్తమ లోహంతోటి అధమ లోహాన్ని వేర్వేరు నిష్పత్తులలో కలిపినప్పుడు, ఆ స్వభావం వన్నెలో హెచ్చు లొచ్చులు కనిపిస్తాయనీ, దేని కేదీ తీసిపోదనీ, దేని సొగసు దానిదేననీ, కన్యాశుల్క నాటకం చాటక చాటుతోంది. వైరుధ్యాలులేని స్వభావమంటూ ఉండబోదు. "మానవస్వభావంలోనే పరస్పర వైరుధ్యం వున్నది కనుక, దీనిని గణుతింపనక్కరలేదు." తనకు తెలీకుండానే, స్వభావసిద్ధమైన యీ పరస్పర వైరుధ్యాలు పాత్రల నడవడిలో వచ్చి పడివుంటాయని అప్పారావు ఒప్పుకొన్నాడు. (5)

అగ్నిహోత్రావధాన్లు, లుబ్ధావధాన్లు, సౌజన్యారావు వంటి పాత్రలపేర్ల ద్వారానే పాత్రల సార్థక్యం ప్రదర్శించదలచినట్లుంది. నీతి చంద్రికనుండి యుక్తిపరుడైన కరటకుని పేరుతీసి ఒక పాత్రకు తగిలించాడు. మొదటి ముద్రణలోని మహలక్ష్మి (గిరీశం మాత్రమే ఉంచుకొన్న సాని) ద్వితీయ ముద్రణలో రామప్పంతులకు కూడా వుంపుడుకత్తెగా మారి, మధురవాణి అయింది.

స్వతస్సిద్ధంగా చెడ్డమనుషులు కన్యాశుల్క నాటకంలో ఎందరో లేరు. వాళ్ళున్నా ఒకరి కొకరు నకలు కాదు. అగ్నిహోత్రావధాన్లు ముక్కోపి. అంతవరకే అతని సహజ దౌష్ట్యం. కోర్టు పక్షి అయా

డంతే, తన మొండిపట్టు ఒక కారణమైనా, రాజ్యాంగ వ్యవస్థతోబాటు ఆస్తి సంబంధాలు సమాజభావాలు కూడా కారణాలౌతాయి. మొదటి కూతురు బుచ్చమ్మ బాల్యంలోనే విధవరాలైనా బాధపడక, పాఠం నేర్చుకోక, రెండవ కూతురు సుబ్బిని లుబ్ధావధాన్లవంటి నడపీనుగకు అమ్మజూపినాడంతే, శిష్టాచారమని పేరుబడిన భ్రష్టాచారమే ప్రథమ ముద్దాయి. ఇంత నిష్ఠాగరిష్ఠుడైనా, కొడుకు వెంకటేశానికి ఇంగ్లీషు చదువు చెప్పిస్తున్నాడు. అక్కరకొద్దీ సానికొంపల్లో కాలుమోపాడు. కోర్టులో ప్రమాణం చేసి మరీ అబద్ధమాడాడు. లుబ్ధావధాన్లు వున్నాడు. "డబ్బుతోనేగాని ఇంకొకరితో స్నేహము లేదు." వ్యవహారజ్ఞానం సున్న. కుమార్తె మీనాక్షి తలమాసి ఇంట్లో గుండెలమీద కుంపటి లాగున్నా, తనకో ఆటవస్తువువంటి అర్భకురాలు భార్య కావాలని డబ్బుతో నరమాంసాన్ని కొనజూస్తాడు. భంగపడుతాడు. రామప్పంతులు, కరటకశాస్త్రి వేసిన వలపాలై, కరటకశాస్త్రి శిష్యుడి ఆడవేషాన్ని పెళ్ళాడి, వాడు తప్పించుకుపోగా, ఖూనీకేసులో ఇరుక్కొని నానాసంకటాలు అనుభవిస్తూ, తన విషాదాన్ని లోకులకు హాస్యం చేస్తాడు. అతని స్వగతాలు (పంచమాంకం) సంభాషణలకంటె పటుతరాలౌతాయంతే, ఈ స్వగతాలద్వారానే అతనిలోని మంచికీ, చెడుగుకీ సంఘర్షణ వెల్లడౌతుంది కాబట్టి. తాను పెళ్ళాడింది ఒక విధవరాలిననీ, దాని మొదటి మొగుడు దయ్యమై గుండెలమీదికెక్కి పీక నొక్కుతున్నాడనీ తనకై తాను ఒక నమ్మకం కల్పించుకొని ఇంటికప్పు లేచిపోయేటట్లు గొడవచేస్తాడు. "అయ్యో వెధవని పెళ్ళిచేసుకున్న తురక వెధవా నీ బుద్ధెక్కడికి పోయిందిరా? నీ చదు వెక్కడికి పోయిందిరా? నీ వేదం తగలబడనూ – యిహ బతకను." ఇక్కడ మీనాక్షి నవ్వుతుంది. "నవ్వుతావేవే భ్రష్టాకారముండా? నువ్వూ, నీ సవితల్లీ రాజమహేంద్రవరం పారిపోయి, వెధవపెళ్ళి చేసుకొంటారు, నాకు తెలుసును." ఇలాంటి స్వగతాలద్వారా లుబ్ధావధాన్లు పరమ అమాయకుడనీ, పరిస్థితులు కుట్రచేయగా ఏర్పడిన హాస్యపూరిత విషాదంలో చిక్కుకొన్నాడనీ తెలుస్తుంది. అయితే, చివరకు సౌజన్యారావు ద్వారా బయల్పడి, మీనాక్షిని రాజమహేంద్రవరం పంపించి

వేస్తాడు. కథాంతానికి, లుబ్ధావధాన్లు చచ్చి బతికినంతగా మారి పోయాడు.

పరిస్థితులు కొంచెంగానూ, స్వభావం ఎక్కువగానూ, దుష్టులుగా నిరూపించిన పాత్రలలో రామప్పంతులు, గిరీశం చేరుతారు. కరణీకం నిక్కా టక్కా మూర్తీభవించిన రామప్పంతులు కన్యాశుల్క నాటకంలో విలన్ పాత్రకు ముమ్మూర్తులా అమరిపోతాడు. పేచీకోరు. కోర్టుపక్షి. లంచగొండి. వ్యభిచారి. వంచకుడు. అయితే పిరికివాడు. పిత్రార్జితమంటూ మిగిలిన దానిని రంకులలో బొంకులలో తగల బెట్టుకొని, వాళ్ళావీళ్ళా నోళ్లుకొట్టి వైభోగం వెలిగిస్తున్నాడు. ఇతని సలహాతోనే లుబ్ధావధాన్లు పెళ్ళికి కాల వూపుతాడు. ఇతని సలహాతోనే, కరటకశాస్త్రి దొంగపెళ్ళికి పూనుకొంటాడు. అటు అగ్నిహోత్రావధాన్ల వద్దా, ఇటు లుబ్ధావధాన్ల వద్దా, మళ్ళీ కరటక శాస్తుర్ల వద్ద కూడా దొరికిన మట్టుకు దొరక బుచ్చుకొంటాడు. ఈ విపరీత స్వార్థానికి ఒక తాత్విక సమర్థన కూడా కల్పి చుకొన్నాడు. తృతీయాంకంలో మధురవాణితో సంభాషణ : బ్రాహ్మల పెళ్ళిళ్ళలో కనిపించే జాతకాలు బనాయించినవేగాని నిజమైవి కావని రామప్పంతులంటే, మధురవాణి "యే మ్మోసం!" అంటుంది.

రామ :- లౌక్యం, లౌక్యవఁను ?

మధు - రెండింటికీ యేవిఁటో భేదం ?

రామ :- నమ్మఁచోట చేస్తే మోసం, నమ్మఁచోట చేస్తే లౌక్యవూఁను.

మధు :- తానుచేస్తే లౌక్యం, మరోడుచేస్తే మోసం అనరాదా? అబద్ధానికి అర్థవేఁవిఁటి ?

రామ :- యావఁన్నావూ? అబద్ధఁవఁనా? ఉద్యోగధర్మం లౌక్యవృత్తి అని అది ఒక వృత్తి భగవంతుడు కల్పించాడు. ఆ లౌక్యవృత్తి యెటువంటింది ? నిజాన్ని పోలిన అబద్ధవాఁడి ద్రవ్యాకర్షణ చేసేది."

బాగా కుళ్ళిపోయిన పండేమో, రామప్పంతులు స్వభావం పోను పోనూ చెడిందేగాని, మంచివైపు ఏ మార్పూలేదు, మారే సూచనా లేదు.

ధాదాపు అంతగానూ చెడిన సరుకే మీనాక్షి. బుచ్చమ్మకంటె అణ్నమ్మ ఒకఆకు ఎక్కువ చదివిందేగాని (గిరీశానికి బుచ్చమ్మద్వారా ప్రచయ సందేశమైనా పంపింది కాబట్టి), మీనాక్షి తెంపరి తనంముందు అచ్చమ్మకూడా బలాదూరు. వృత్తినిబట్టి వ్యభిచారంచేసే మధురవాణికీ, అక్కరబట్టి చేసే మీనాక్షికీ ఈ నాటకంలో మంచి తేడా కనిపిస్తుంది. ఒంటి దినుసు అలాంటిదని కాదు. మీనాక్షి బాల వితంతువు. యవ్వనావస్థకు సహజమైన వికారాలకు లోనైంది. దేహానికి సంబంధించిన అక్కరను తట్టుకోలేదు. అనుకూల వాతావరణం అమరి వుంది. రసికుడు రామప్పంతులు, వార్తాహరుడు అసిరిగాడు, ఇంటి దొంగను పట్టలేని మూర్ఖుడు లుబ్ధావధాన్లు, మీనాక్షి పోకిళ్ళకు వీలునిచ్చారు. కొండుబట్టీయంలోని పార్వతి కంటె గడసరి. అయినా ఎల్లకాలమూ ఈ దొంగకూళ్ళేనా అనే విసుగుదల లేకపోలేదు. రాజమహేంద్రవరం పోయి రామప్పంతుల్ని పెళ్ళాడాలని కలగన్నది. లోపలి ఆశయాలకూ, వెలుపలి వాస్తవాలకూ జరిగిన ఘర్షణలో, ఆత్మవంచన చేసుకొన్నది. తన తప్పుగురించి ఎలాంటి భ్రమలూలేవు. తన పతనం గురించి తనకే అసహ్యం. తన 'నీతి' గురించి తనకే అవహేళన. అసిరిగాడు దిగదుడుపు వొడపప్పు తినే అపవిత్రం ముండా కొడుకని రామప్పంతులంటే (పంచమాంకం) మీనాక్షి అందు కొంటుంది :

'మీనాక్షి : పవిత్రం అంటే మీదీ నాదే!

రామ : అదేం అలా అంటున్నావు ?

మీనాక్షి : నేను వెధవముండనీ మీరు సరసులున్నూ. మన కంటె పవిత్రం అయినవారు యవరుంటారు ?'

ఎవరికో ఒకరికి చెందిపోవాలనే కోరిక మీనాక్షికి గొంతెమ్మ కోరిక. నగలూ నాణ్యాలూ లేకున్నా, వెళ్ళి రాజమహేంద్రవరంలో పెళ్ళిచేసుకోవాలనే వేగిరపాటు. వెంటనేకాకున్నా, 'మీ యిష్టంవొచ్చి నప్పుడు పెళ్ళాడుదురుగాని యింట్లోంచి లేవదీసుకొచ్చారుగదా ? యిహ నేను మీతో వుండవలసినదాన్నే; పదండి' రామప్పంతుల్ని యింటిదాకా వెన్నాడి, రెక్కపట్టుకొని ఆపి, ప్రమాణాన్ని నిలబెట్టుకో

మంటుంది. 'కాగల పెళ్ళాం'. రామప్పంతుల దేంపోయింది? 'కల గన్నావా యేమిటి?' అంటాడు. నిజంగానే కల. దొంగకూళ్ళు అక్కర్లేని కల. పరువుగా కాపురంచేయడానికి కల. ఎంత విషాద పూర్ణమైంది? బుచ్చమ్మద్వారా బాల్యవైధవ్యంలోని దయనీయత ప్రదర్శించి, విషాద విహ్వలత మీనాక్షిద్వారానే అప్పారావు వెల్లడించాడు. బుచ్చమ్మ చెడలేదు. మీనాక్షి చెడింది. మూలకారణమేమిటి? బాల్య వివాహాల ఖండనకు మీనాక్షి పాతకంటె గొప్పసాక్ష్యం ఈ నాటకంలో మరెక్కడాలేదు. రక్తమాంసాల న్యాయమైన కోర్కెలు తెన్ను వెరేలేక తప్పు తెన్నులు పట్టవలసి రావడమే అంతర్గత విషాదం.

ఇన్ని పాత్రలున్నా, గిరీశం మధురవాణీ వాటి తలలుతన్ని నిలుస్తున్నాయి. ఎంచేత? అప్పారావు చమత్కారమంతా గిరీశం పాత్రలో కూరిపెట్టాడు. ఉపదేశం మధురవాణి పరంచేశాడు. వంచనను లలితకళగా మార్చుకొన్న గిరీశం, ప్రపంచ ప్రసిద్ధపాత్రల కోవలోనివాడు ఎందరు ఎన్నివిధాలుగానో ఈ పాత్ర స్వభావాన్ని వర్ణించారు. 'గోడ మీది పిల్లిలాగు జీవించే ఏబ్రాసికాని, స్థిరమనస్కుడు కాడు; పాప భీతిలేని పాషండుడు, ఋజుమార్గవర్తి కాడు,' అని శ్రీపాద కామేశ్వరరావు. (6) Struggle for existence అనేదే గిరీశం శిలంలోని కీలకమనీ, అతని మోసాలన్నీ జానెడు పొట్టకోసమేననీ, శ్రీనివాస చక్రవర్తి. శ్రీనివాస చక్రవర్తి భావానికి చిలవలు పలవలుకూరుస్తూ, 'భూపతనమైన దగ్గరనుంచీ గిరీశానికి పట్టుకున్న దొకటే గొడవ. ఈ పూటకు బిఛాణా ఎక్కడవేయాలి అని... పూటకు టికాణాలేని పక్కా ఫకీరతడు ...రాజస సమాజంలో వుంటూ కౌబేరసమాజపు తొలిరేకలు సోకినవాడు గిరీశం' అని రాంభట్ల కృష్ణమూర్తి. (7) గిరీశ పాత్ర ధరించి చాలా పేరుపొందిన డాక్టరు గోవిందరాజుల సుబ్బారావు ఇంకొక వ్యాఖ్యానం చేస్తున్నారు. 'కేవలం ఛట్కారీగా తిరిగి వుల్ఫాగా జీవనంచేసే సోమరిమాత్రం కాదు, ఎప్పటికికూడా... ఒక దారితప్పిన యువకుడుగాను, అందువల్ల తన తెలివితేటలన్నిటినీ స్వప్రయోజనానికి ఉపయోగించుకునే ఒక వ్యక్తి అని మొదట్నుంచీ నా వుద్దేశ్యము.

ఎంత దారి తప్పినవాడైనప్పటికి, ఒక అవ్యక్తమో లేక సువ్యక్తమో అయిన గమ్యస్థానాన్ని చేరాలని, జీవితాన్ని అటుఇటు పనగలిపి నెట్టు కొస్తున్నవాడు గిరీశం." (8)

వంచకుడనే విషయం గురించి మాత్రం అభిప్రాయభేదం లేదు. ఎందుకుగాను ఈ వంచన అనేదే వాదగ్రస్త విషయమైంది. అతను వంచించింది వ్యక్తిమాత్రుల్నిమట్టుకే గాదు, రామప్పంతుల్లాగు. సెట్టి ఈశ్వరరావు అన్నట్లు, "పౌరహిత ఉద్యమాల్ని తమస్వార్థానికి ఉపయో గించుకొనే అనేకుల ప్రతిబింబాలే గిరీశంలో కనిపిస్తాయి". (9) 'హంస' పత్రికలో కొడాలి దామోదరయ్య, గిరీశం సంఘానికి వేరుపురు గని వర్ణించి ది కూడ న్యాయంగానే వుంది. బాల్య వివాహాలను ఖండించే వీరేశలింగం ఉద్యమం, వేశ్యావృత్తిని గర్హించే రఘుపతి వెంకటరత్నం ఉద్యమం, జాతీయవాదాన్ని ప్రబోధించే కాంగ్రెసు ఉద్యమం ఇవన్నీ గిరీశం లౌక్యానికి సాధనోపకరణ లయ్యాయి. తన అక్కరకొద్దీ వాటిని పొగడ్డమో తెగడ్డమో జరిగింది నిజానికి ఆ వుద్యమాలతో ఇతనికి ఎంతోకొంత సంబంధంలేకుంటే, పరిజ్ఞానం మాట ఏమైనా పలుకుబడిమాత్రం అంతగా కలిగే కాదు ఆయా ఉద్య మాలలో "దొంగలున్నారు జాగ్రత్త!' అనే బోర్డు, గిరీశం ఉండబట్టి, అవసరం లేకుండా పోయింది. అసలు నాటక రచయితకే ఈ ఆషాఢ భూతులనుగురించి అనుమానం వున్నట్టు, ఉపన్యాసాల పసగురించీ, మదాసు కాంగ్రెసుమహాసభ పోకడగురించీ, దేశభక్తుల నడవడి గురించీ, థియోసోఫిస్టులా బ్రాహ్మసమాజికులా రెండు నాల్కల వైఖరి గురించీ ఆయన అక్కడక్కడ విసిరిన ఛణుకులే తెలుపుతున్నాయి. కాబట్టి వట్టి హాస్యంకొరకు గిరీశంపాత్ర సృష్టికాలేదనిపిస్తుంది రాజకీయ, సాంఘిక ప్రయోజనం ఆశించిన వ్యంగ్యచిత్రమే ఇది ఒక్కసారిగా ఈ పాత్రలో నిబిడీకృతమైయుండిన అవకాశాల నన్నిటినీ ఆయన బయల్ప రచలేదు. కొండుభట్టీయంలో మరొక అవతారం ఎత్తిన గిరీశం, పూర్తిగాని తుంటల్లో మరోరకంగా దర్శనమిస్తున్నాడు "మాటా మంతి"లో "బ"గారబ్బాయి అనే శీర్షిక గిరీశం జన్మమీద కొంత వెలు గును ప్రసరిస్తుంది.

'మనిషికి పెద్దంత్రం చిన్నంత్రం లేదు. కొత్తా పాతా అన్న మొహమాటం లేదు. చదువుకున్న వాళ్ళూ చదువుకోని వాళ్ళూ అంతా వొకటే. ఎవర్నయినాసరే, అబద్ధమో, సుబద్ధమోఆడి బుట్టలో వేసుకోవచ్చునని చొరాయించుకు పోతాడు. నూరబద్ధాలాడైనాసరే, తనపని తాను చేసుకుపోవాలనుకుంటాడు.

'...జంకూ గొంకూ లేదు. సిగ్గూ బిడియమూ సున్నా. నిలువు నిలుపాదం మోసం.

'......టక్కరితనంవల్ల, బతుకు బాగుపడుతుందని అతని నమ్మకం... ...' అదే గ్రంథ లో "రెండవకథ" అనే శీర్షికగూడా గిరీశం పరిణామంకోసమైనా పరిశీలించదగిన రచన. అందులో నాయకుడు కాబోలు అంటున్నాడు:

"నాయ: ...గిరీశం! గిరీశం! వాడా? వాడొట్టి దగుల్బాజీ! శుద్ధస్కాంద్రల్!

రెవ: కాదు, నాయనా, కాదు. నిదానించి మాట్లాడు... అతని హృదయం మంచిది...తత్వతః అతను క్రిస్టియను...'

ఈ కథలో గిరీశమే మారువేషంధరించి పాల్గొంటాడు. "అరుంధతినైనా చెరపట్టే మహాయోగ్యుడు"అనినాయిక అను కొంటుంది. ఇంతకంటె గిరీశాన్ని వర్ణించగల వాక్యం మరోటిలేదు. అట్లాగే "జులాయి మచ్చు" పాత్రకూడా గిరీశం సృజనకు దోహదంచేసి వుంటుంది.

గిరీశం లేకున్నా కన్యాశుల్క నాటకకథ జరుగుతుందేమోగాని, మధురవాణి లేకుంటే అస్సలు నడవదు. కథానాయకుడు లేని నాటకంలో నాయికమాత్రం వుంది. కన్యాశుల్క ఇతివృత్తాన్ని వేశ్యా సమస్యతో ముడిపెట్టేందుకేగాక, వేశ్యద్వారా ఉజ్వల మానవత్వ సందేశాన్ని లోకాని కిచ్చేందుకుగూడా ఈ పాత్ర సాధనమైంది. మృచ్ఛకటిక నాటకంలోని వసంతసేనవంటి మనిషి కల్పనలోనే తప్ప వుండదని సౌజన్యారావు అంటాడు. కాబట్టి మధురవాణి పాత్రను మలచడంలో అప్పారావు ముందు ఒక మూలప్రతిమ - వసంతసేన - వుంది. అయినా మధురవాణి వసంతసేనవంటిది కాదు. వసంతసేన "గుణాను

రక్త' యగు వేశ్యాంగన అని శూద్రకుడు వర్ణించడంబట్టి, ధనానురక్త కాదని ధ్వని. వసంతసేన నివాసగృహం రాజప్రాసాదం వంటిది. ధన ధాన్య సమృద్ధి వుంది. మిక్కిలి రొక్కము లీయలేని దరిద్ర చారుదత్తుని ప్రేమించి, రాజు వెనక రాజంతటి శకారుణ్ణి తోసివేసిందంటే, వసంత సేనకు కడుపునిండింది కాబట్టే. మధురవాణికి దినవెచ్చం తీర్చే రసి కుడితో జీవితాంతం అక్కరవుంది. వసంతసేన స్వీయనాయిక కాదేమో గాని మధురవాణి 'సామాన్య' శ్రేణికి చెందిన నాయిక. "కొద్దికాలము ఉండే యౌవనాన్ని జీవనాధారము చేసుకొన్న మాకు వలపు బంగా రము మీదనే. శృంగారము వన్నె చెడిన దగ్గరనుంచీ బంగారము కదా తేటతెచ్చేది?" ఈ Old Age Insurance వసంతసేనకు పూర్తిగా అనావశ్యకం. కాబట్టి నీతి, అవినీతులకంటె ప్రాథమికమైన విషయాన్ని- ఉదరపోషణం- మధురవాణిద్వారా అప్పారావు ప్రస్తా వించబూనుకొన్నాడు.

ఇది ఎక్కువగా మానవ సమస్య నీతికి రెండవస్థానం మాత్రమే. అయినా విధిలేదు కనుకనే మధురవాణి వెలయాలుగా బతుకుతున్నది గాని, తనకే వసతి వున్నట్లాయెనా, ఎంత నిష్ఠురమైనా దాంపత్య జీవి తాన్ని గడిపేది. "కాపు మనిషినైపుట్టి మొగుడి పొలంలో వంగమొక్క లకూ, మిరపమొక్కలకూ దోహదం చేస్తే, యావజ్జీవం కాపాడే తన వాళ్ళన్న వాళ్ళు వుందురేమో!" (కింది గీతలు వ్యాసకర్తవి) బతుకు తెరువుకోసం పడుపు పని. నగ్నసత్యం. ఇక తకంటె మా వజీవితంలో విషాదం ఏమి వుంటుంది? వలపు వున్నా లేకున్నా గిరీశ వంటి రామ ప్పంతులవంటి పూరకుక్కలనూ సీమకుక్కలనూ సంతోషపెట్టాలి. మర్యాదస్తులనూ నీతిపరులనూ "చూడడమునకైనా అర్హత కలిగివుండ లేదు". అంటే ఏమిటన్న మాటః తాము అస్పృశ్యుల జాబితా లోకి వస్తామన్న మాట. వేశ్యలు పెళ్ళి చేసుకోవాలట! ఎవడా వెర్రి వెంగళప్ప అన్నది? సౌజన్యరావు మంచివాడే గాని వెర్రివాడు. వేశ్యా గర్హణం అతని మానవ స్వభావాన్ని కూడా మరుగు పరచింది. అతను "అచ్ఛాదీ". ఇదీ ఒక విధమైన గుణ

లోపమే. కాకుంటే, ప్రమాదంవల్ల వేశ్య శరీరం తగిలితే తన శరీరం కోసేసు కొంటాడట! "సానిదానికి మంచితో పని ఉండదు." ఇదొక కొత్త మత సిద్ధాంతం లాగుంది. దానిని గేలిచేసి భంగపరిచేందుకే మధురవాణిని అప్పారావు నియోగించాడు. చివరకు, మధురవాణిని ముద్దాడ బోయేవరకూ సౌజన్యారావును మంచితో లొంగదీయడం జరిగింది. అయినా మధురవాణి ముద్దాడ నివ్వలేదు. కాబట్టి గెలిచింది సౌజన్యారావు కాదు. ఓడింది గిరీశం. మధురవాణి విజేత. లోపంలేని సౌజన్యారావు వ్యక్తిత్వం దుర్గమ పర్వత శిఖరం వంటిది కాగా, గిరీశం వ్యక్తిత్వం లోపాల యమకూపం: ఈ రెండూ రెండే! లోపంవున్నా దానిని కిందుచేసే గుణం గలిగిన మధురవాణి వ్యక్తిత్వమే భూతల వంటి సాధారణ వాస్తవం. దానికే పర్వత శిఖరాన్నీ పాతాళ అగాధాన్నీ అప్పారావు బలియిచ్చాడు. వేడుకా విలాసమూ వెలిబడిన కటిక చల్లని ఆదర్శం అసాధ్యమేగాక అవాంఛనీయం కూడా. ఆదర్శం లోపాలను వాస్తవం పూరించింది.

మధురవాణికి యీ "తిక్క" ఎక డినుంచి వచ్చింది? "చెడని వారిని చెడగొట్టవద్దని మా తల్లి చెప్పింది." "మంచివారి యెడల మంచిగానూ చెడ్డవారి యెడల చెడ్డగానూ ఉండమని మా తల్లిగారు ఉపదేశం చేశారు." "కష్టపడి ఆర్జించినకంటె మీ (కరటకశాస్త్రి) పాలు చేస్తున్నాను. మా తల్లిచూస్తే భవిష్యం వుంచునా?" "ఆమె (మీనాక్షి) బ్రతుకు భ్రష్టు చెయ్యనే చేశారు, పెళ్ళాడి తప్పు దిద్దుకోండి."

పదిమంది వసంత సేనలకైనా ఇంత తెలివి వుండదు. ఒకవైపు డబ్బుకోసం కక్కుర్తి పడుతూనే వుంటుంది. మరొకవైపు సరసులు కష్టాల్లోవుంటే తన కష్టార్జితం ఇచ్చి ఆదుకొంటుంది. "ఫలానా పంతులుగారు ఫలానా సాన్ని ంచుకొని బాగుపడ్డారంటేనే నాకు ప్రతిష్ఠ." "వృత్తిచేత వేశ్యని గనక చెయ్యవలసినచోట ద్రవ్యార్జన చేస్తానుగాని, మధురవాణికి దయాదాక్షిణ్యాలు సున్న అని తలచారా?" ఒక్కొక్కసారి లేని ఔదార్యం చూపుతుంది. మరోసారి ఇతరుల మేలు కోసం సర్వం సమర్పించ బూనుకొంటుంది "చెయ్ చిక్కినంత సొమ్ము

చిక్కించుకొని పెందరాళే మరో కొమ్మ పట్టుకోవాలి" అని తనకు తాను హెచ్చరిక చెప్పుకుంటూనే, పైకి మాత్రం "నాకు డబ్బే ప్రధాన మైనట్లు మీ మనసుకి పొడగడుతూంది కాబోలు. నాకు డబ్బు గడ్డిపరక" అంటుంది. ఈ వైరుధ్యాలను మీరి, మంచివైపు పయనించింది కాబట్టే మధురవాణి పాత్రకు నిండుదనం చేకూరింది.

మధురవాణి, కన్యాశుల్కం తొలికూర్పులో, ఇలాగుండేదికాదు. "మధురవాణి పాత్ర-ఒక పరిశీలన, ఒక పరిశోధన" అనే వ్యాసంలో(10) ఆరుద్ర చేసిన సిద్ధాంతం సహాయకరంగా వుంది. మొదటి మధురవాణి రామప్పంతులు సాని మాత్రమే. గిరీశం సాని పేరు మహాలక్ష్మి. మొదటి మధురవాణిది హేయమైన బుద్ధి. కరటకశాస్త్రుల్ల కుత్రుకు ఏ విధంగానూ ఉపకరించదు. మాటసరసం,సున్నితం చేతకాదు. సరసులలో హెడ్డునీ వకీలునాయడనీ విచక్షణచూపదు. ఆలోచించిన సుగుణాలన్నీ రెండవ మధురవాణికి అబ్బినాయంటే, 'కొండుభట్టీయం' లోని మంజువాణి ద్వారానని ఆరుద్ర అంటాడు. అయితే మంజువాణిలోని పిల్లతరహా రెండవ మధురవాణిలో లేదట. మంజువాణికి లేని అభ్యుదయకరమైన తాత్త్వికజిజ్ఞాస రెండవ మధురవాణికి అమర్చడంలో, Stooping to Rise (సంస్కర్త హృదయం) కథానాయిక సరళ సాయపడిందట. సరళనుకూడా బేలను చేసేటంత తెలివి ఈ మధుర వాణి పరమైంది. ఎందుకంటే, తన వలపును దాచుకొన్నదే గాని బయటవేసి చులకనపడలేదు సరళలాగా.

శ్రీనివాసాచారివంటి మిత్రుల సూచనలవల్లనో, ఒంగోలు ముని సుబ్రహ్మణ్యంవంటి అనుచరుల విమర్శలవల్లనో, ఎట్లాగైతేనేమి, రెండవ కూర్పులో అప్పారావు చాలా మార్పులు చెయ్యక తప్పలేదు. "మొదటి కూర్పుకంటె రెండవ కూర్పు నా మనోభావావాలను ఆలోచనలను సమగ్రంగా వ్యక్తం చేస్తున్నది". (11) నాటకం తిరిగి రాసేకొద్దికీ, మధురవాణి పాత్రమీద తన కుండిన దృక్పథం మారుతూ వచ్చినట్లు, పుస్తకం అచ్చు అవుతు డగా కూడా ఈ మార్పులు చేస్తూ ఉండినట్లు, అందుచేతనేమో పరస్పర విరుద్ధ లక్షణాలు వచ్చిపడివుండ వచ్చుననీ లేఖలద్వారా అప్పారావు చెప్పాడు. "మధురవాణి పాత్ర

అంతే నాకు నేనే ముచ్చటపడుతున్నాను. కనుక ఆమెను చివరి అంకంలో సంస్కరించాను."(12) మధురవాణిచేతిలో భగవద్గీత. సజ్జనుల దయ లభించాక దుర్వృత్తి వుండదనే హామీ. ఇదే మధురవాణి "సంస్కరణ". శరచ్చంద్ర ఛటర్జీ నాయికలాగా తయారైంది. పతివ్రతల మతం పుచ్చుకోకున్నా, నియమబద్ధ నైతిక జీవితానికి, దాదాపు సన్యాసానికి, మనస్సు నర్పించింది బతుకుదెరువో?" దైవానుగ్రహం వల్ల (స్థితి) లోపంలేదు. నా వృత్తియొక్క హైన్యతను గుర్తెరుగుదును."

కన్యాశుల్క నాటకంలో కవితాన్యాయం పేరున బలవంతంగా పాత్రలకు ఉచితమైన పర్యవసానం చేకూరివుంటే, ఈ ఒక్క ఘట్టంలోనే సంస్కరణ నెపాన జరిగింది. మంచి గెలిచిందన్నమాటే. మీనాక్షి, బుచ్చమ్మలకు వితంతు శరణాలయంలో స్థానం లభించింది. గిరీశంగారు నిర్వహించిన కథ అడ్డం తిరిగింది. అయినా ఇవేవీ బలవంతాన జరిగినవి కావు. జరగవలసిన తీరులోనే జరిగాయి కాబట్టి బలవంతాన జరిపినవనడానికి వీల్లేదు. మంచి గెలవడమేమిటి, చెడుగు మన్ను గరవడమేమిటి? మంచి చెడ్డల గురించి అప్పారావు అభిప్రాయమే ఈ తీర్పుకు విరుద్ధమైంది.

"మంచి చెడ్డలను ఏర్పర్చగలిగినవాడు ఎవడు? మంచిలోనూ చెడ్డ వుంటుంది; చెడ్డలోనూ మంచి ఉంటుంది." (13)

కాబట్టి నిరంకుశమైన కొలబద్దలేవో పెట్టుకొని, నియంతగా మారి నాటకకర్త న్యాయపాలనం చెయ్యలేదు. కళానైపుణ్యంతో ఆదర్శవంతం చేసినా, జీవితవాస్తవంతో చెలగాటమాడే సాహసానికి పూనుకోలేదు. కనుకనే కన్యాశుల్క నాటకంలో సహజత్వం అంత ప్రస్ఫుటంగా ఉంది. గొప్ప రచనకు ఇదే గీటురాయి.

"బిడియమనేది అడ్డువస్తున్నమాట నిజమే అయినా కన్యాశుల్కం గొప్ప రచనగా రూపొందించానని నేను అనుకొంటున్నాను." (14) లోకమూ కాలమూ ఈ మాటను ధ్రువీకరిస్తున్నాయి.

## పాదపీఠికలు (Foot notes)

(1) 'కన్యాశుల్కం' - గురజాడ ముత్యాలసరాలు : శ్రీ శ్రీ. పు. 58. (2) పు. 59. (3) లేఖలు, పు 94-95. (4) మాటామంతీ, అవీ: ఇవీ, పు. 114-115 (5) లేఖలు, పు. 81. (6) కన్యాశుల్క నాటకవిమర్శనము : భారతి, ఆగస్టు 1933. (7) పరిశోధన, డిసెంబరు, జనవరి 1956. (8) హంస, 15-11-1959. (9) మహాకవి-మహాపురుషుడు : సెట్టి ఈశ్వరరావు. పు. 26. (10) పరిశోధన. (11) లేఖలు, పు. 75. (12) లేఖలు. పు. 81. (13) కన్యాశుల్కం ; సప్తమాంకం. (14) లేఖలు, పు. 75.



# 10. మీనాక్షి మొర

'పంతులా యేవిఁటి చెప్మా' అనుకొంది మీనాక్షి. చీకట్లో సరిగా కానరావడంలేదు. మీనాక్షి రాజమేంద్రంవచ్చి ఆరునెల్లు కావస్తోంది. సౌజన్యారావు వుణ్యమా అని ఈ వితంతు శరణాలయంలో చేర్పించాడు. మొదట్లో లుబ్ధావధాన్లు కాస్త వైదీకం చూపాడుగాని, చివరికి మెత్తబడక తప్పిందికాదు: నిజం చెప్పవలసివస్తే అవధాన్లకు రెండో పెళ్ళాం ముండ నూతిలో పడ్డప్పుడుగాకున్నా, దాని మొదటి మొగుడు, జులపాలవాడు పీక పిసికినప్పుడే జ్ఞానోదయమైంది. అమ్మిని రాజమేంద్రం పంపేద్దామని అప్పుడే నిశ్చయించుకొన్నాడు. ఊళ్ళో అది చెడునడతలు నడిచిందంటేనూ, ఆరెల్లకోసారి అల్లరితెచ్చి పెడుతుందంటేనూ దాని తప్పేయేవిఁషి? దాని వయసు తప్పు. దాని రక్తం తప్పు. దానిపసిగుండెలో పొటమరించిన వెచ్చటి కోరికలతప్పు. ఇంకా ఏకరూపెట్టాల్సేవస్తే, పెళ్ళికాగానే గుటుక్కుమన్న దాని ముసలి మొగుడుదీ, ఇలాంటి తంటాలమారి పెళ్ళిళ్ళుజరిపించే బ్రాహ్మణ సంఘానిదీకూడా ఆ తప్పు. "బ్రాహ్మల్లోవున్న కంగాళీ కూడు మరెక్కడా లేదు" అన్నదికూడా బ్రాహ్మడేకాబట్టి, ఆ మాటకు విలువకద్దు.

ఎట్లాగైతేనేవిఁ, మీనాక్షి రాజమేంద్రం చేరుకుంది. చేరుకుంటేనే యేవాఁయ, పెళ్ళి జరిగిందా, అని అడక్కండి పెళ్ళి చేసుకొనేవాడొకడు పుట్టుకురావాలిగా? చూస్తూ చూస్తూ తలమాసిం దాన్ని ఎవడు చేసుకుంటాడు? చూసింది. చూసింది. ఎంతో ఓపిక పట్టింది. శరణాలయంలో వున్న వాళ్ళల్లో తాను అందరికంటె కొత్తగా వచ్చింది కాబట్టి వాళ్ళందరికీ అయ్యాకనే తనకు పెళ్ళి.

అదయినా జరుగుతుందనే నమ్మకంలేదు. మనసు వంకర్లు దిద్దుకొని, మంచిగా ఉంటానికి పూనికచేసుకొని వచ్చాకగూడా, యీ బలవంతపు పాతివ్రత్య మేవిఁటి ? మీనాక్షి పశ్చాత్తాప పడసాగింది. దేనికి ? తానీ చెరసాలలో చిక్కుకొన్నందుకు. రావఁప్పంతులు కళ్ళల్లో, కలల్లో మెదలసాగాడు. చచ్చినాడు ఆ సానిదాన్ని వుంచుకుంటే వుంచుకున్నాడుగానీ, అడపాదడపా తన గడపా తొక్కేవాడు అసిరిగాణ్ణి పురమాయించి పంతుల్ని రప్పించుకోవడం, దీపమార్పి చీకట్లో పంతులు వొళ్లో కూర్చోవడం యింకా గుర్తుంది. ఆ గ్యాపకమే మనసును బాధిస్తోంది. మధురవాణి చేరదీసింది తనపక్క చోటిచ్చింది. చెల్లెలా అని పిలిచింది. అయినా పంతులు లొంగాడుకాడు. మరెందు కొస్తున్నాడో ఇప్పుడు ? మధురవాణి హెడ్‌తో లేచిపోయింది గామోసు ? మీనాక్షికి నవ్వొచ్చింది. సానిది లేచిపోవడ మేంఖర్మ ? సానిదానికి నీతేవిఁటి భీతేవిఁటి ? సబ్లిగ్గా సిద్ధాంతితో, పోలిశెట్టితో, బుగతతో పేకాడి పంతులి మనసు విరిచివుంటుంది. రానీ పంతుల్ని ! ఎగిరి జుట్టేసుకుంటాను ... ఆఁ ? ఉహుఁ ! ముద్దెట్టుకొంటాను. ఏం ? ఎందుకెట్టుకోను ? అతనే నాకు స్వేచ్ఛాదాత !' అనుకొంది మీనాక్షి.

ఇంతలో పంతులు రానే వచ్చాడు. అరే ? ఇదేమిటి ! ఆనియ్యోగపుఠీవీ, దర్జా కనిపించవేం ? ఆశ్చర్యపోయింది, మీనాక్షి. సంశయపడింది. కళ్లు విప్పార్చిచూసింది. ఇత నెవరో కొత్తవాడు కోటుమీద కోటు, తలపాగా, చేతికఱ్ఱ ... శవాకారం ! మనిషిలో సత్తువే వున్నట్టులేదు. తనతో యేంపనో ? చూడగా చమత్కారిలాగున్నాడు. మీసకట్టు లోపల ఎంత క్లుప్తంగా సరసంగా నవ్వుకొంటున్నాడు ! తననిచూచి నవ్వడం లేదుగదా ?

'ఎవరండీమీరు ?' అడిగింది మీనాక్షి. 'నేనా ? అదో పెద్దకథ, ఇప్పుడెందుకుగానీ, ఒక పనిమీద వచ్చాను,' అన్నాడు. తనతో పనా? ఏం పనుంటుంది చెప్మా ? బహుశా....ఛఛ, ముసలివాడు, పుష్టిలేనివాడు, ఇతనితో యేవిఁటి ? కొంపదీసి పెళ్ళాడుతాననడుగద ? చచ్చాం ! త్వరలో మరోసారి తాడు తెంచుకోవాల్సివస్తుంది. 'ఏం పనండీ ?', అంది. 'చూసిపోదామని', అన్నాడు. 'ఎవర్ని చూట్టం ? మీ

చుట్టూలెవరైనా ఉన్నారా ఇక్కడ? ఎవర్ననుకొని పలకరిస్తున్నారో, మీరు నాకు బొత్తిగా తెలీదు' అంది. ఆయన నవ్వాడు ఈసారి మరింత దీర్ఘంగా. తననిచూసే నవ్వుతున్నాడు. సందేహంలేదు. నవ్వే తనకి దూరమైపోయిందికద! హు! అనుకొంది మీనాక్షి. "తెలీదూ? నేను నీకు తెలీదూ?", అని మళ్ళీ నవ్వాడు. మీనాక్షికి కోపం వస్తూంది. 'ఎందుకలా విరగబడి నవ్వుతారు?' అంది. ఆయన వూరుకొన్నాడు కాదు. 'నవ్వితే నీకు కోపం వస్తుందని నాకు తెలీదే!' మళ్ళీ నవ్వు. 'నువ్వు ఎంత నిండుగా నవ్వేదానివో మరిచావా? అలనాడు లుబ్ధావధాన్లు భయంతో విహ్వాలిస్తుంటే విరగబడి నవ్వలేదూ నువ్వు?', అని అడిగాడు. 'మళ్ళీ నవ్వు వస్తోంది' అన్నది మీనాక్షి. 'ఆ దృశ్యం తలచుకొంటూవుంటే నవ్వాగడంలేదు'. నవ్వేసింది. నవ్వులోనే మాటలు. 'దయ్యమో మొర్రో అని ఏడుస్తున్న ముసలాణ్ణిచూస్తే నవ్వాగింది కాదు', అన్నది. ఇంతలో మీనాక్షికి ఆశ్చర్యం. తన ఇంటి సంగతులు ఈయన కెట్లా తెలిశాయో? 'ఇంతకీ మీ రెవరో....' 'నేనా? నేను నీకు తండ్రిని' అని నవ్వాడు. ఈసారి మీనాక్షికి నిజంగా కోపం వచ్చింది. ఆ కోపంలో వ్యంగ్యం. "మా అమ్మని ఎప్పుడు పెళ్ళాడారండీ తమరు?" మళ్ళీ? నవ్వుతాడే? పిచ్చివాడు కాడుగద! అమ్మయ్యో! "నిజం చెప్పమంటావా నీకేగాదు; మీ నాన్నకీ, నీపంతులుకీ, ఆ సానిపిల్లకీ అందరికీ నేను... తండ్రిని." నిజంగా పిచ్చాడే! సందేహం లేదు 'విశాఖపట్నం ఆస్పత్రినుంచి తప్పించుకొచ్చావా?' అన్నది. 'లేదు లేదు.... ఊరు విజయనగరం, పేరు గురజాడ అప్పారావు' అన్నాడు. 'ఓరి నీ తస్సదియ్య, నువ్వా? నువ్వా!' మీనాక్షికేం తోచిందికాదు. తనని పుట్టించిన బ్రహ్మదేవుడే ఎదుట నిలిచినట్లయింది. 'ఒసే వెంకీ, పంతులుగారికి పీటెయ్యవే' అని పిలిచింది. 'అసాధ్యురాలివే. నా మాటలుకూడా దొంగిలించావు. ఇవి కొండుభట్టీయం లోనివి' అన్నాడు.

'కొండుభట్టీయం నాకు తెలియ దనుకున్నారా?' అంది మీనాక్షి. 'నీకెలా తెలుసు?' అన్నాడు అప్పారావు. 'అట్లారండి దారికి. నా చెల్లెల్ని అందులో చొప్పించలేదూ మీరు?' అన్నది.

'నీ చెల్లెలా? నీకొక చెల్లెలుందని నాకు తెలీదే?' ఆశ్చర్యపోయాడు.

'తెలీదేం? పాపం! నంగనాచి! పార్వతి ఎవరనుకున్నారు? కొండుభట్లు తలమాసిన మేనకోడలు లేదూ, అది' అంది మీనాక్షి.

'ఓస్! అదా? అయినా దానికీ నీకూ పోలికేమిటి? నువ్వు అఖండురాలివి. అది వర్తిపిచ్చిది,' అన్నాడు. "ఒప్పుకొన్నాను. బుచ్చమ్మ అమాయకత్వం కొంత, నా పోకిరీతనం కొంత కలిపి పార్వతిలో ఇమిడ్చారు. అవునా?" అంది. 'మంచి సవాలే! పార్వతికి మగవాసనే లేదు. మగవాడు పిల్లాడైనా సరే, వాడి తాకిడే చాలుననుకొంది. వెంకన్నకి చిరుతిండి పెట్టి మచ్చిక చేసుకొని తన పార్శ్వాన్ని వాడికి ఆనించి తృప్తిపడింది. ఎంత జాలిపడాల్సిన విషయం! పార్వతికి అనుభవమే లేదు. అది నీకు అతిశయించింది,' అని వివరింరించాడు. 'ఎంత జాలి వొలకబోస్తున్నారు! చేసిన అన్యాయానికి సిగ్గుతో తలవంచుకోవాలి మీరు,' అంది. కసి పెరిగింది. 'నేనేం చేశాను మధ్య? తలవంచుకోవాల్సింది నీ తండ్రి, నీ భర్త, ఆ నియోగప్పంతులూ – అంటే సంఘం, సంఘదురాచారమైన బాల్యవివాహం' అన్నాడు.

'అలా తప్పించుకోగల ననుకుకొంటున్నావా?' అంది. 'ఏకవచన ప్రయోగంచేస్తావేం?' అన్నాడు. 'చేస్తానా, తోస్తానా? నువ్వు కటికివాడివి. నన్నో దుష్టని చేశావు. పార్వతినో దుష్టని చేశావు, అంది,' 'నేను చేసిందేవిటి? మీతరహాయే అంత. అబదమాడమన్నావా నన్ను? ఉన్న చెడుగుకి వెల్లవేసి ఆకర్షణీయం చెయ్యాలంటావా? చస్తే చెయ్యను. నేను వాస్తవవాదినే గాక, విమర్శాయుత వాస్తవ వాదిని గనక, ఉన్నది ఉన్నట్లుగా చూపించాను. ఆ చూపడంలో చెడుగును విమర్శించకనే విమర్శించాను,' అని ఉపన్యాసం ఇచ్చాడు. 'గరీశం బాబాయి తలదన్నేట్లున్నావు. నా దగ్గర ఈ పప్పులుడకవు. మాది దౌష్ట్యమంటున్నావా? ఇది న్యాయమేనా నీకు? మళ్ళీ ఇబ్సెనంటావు. ఆనువంశిక ప్రభావాలూ, పరిసరప్రభావాలూ వ్యక్తి శీలాన్ని నిర్ణయిస్తాయంటావు. మరొక చెంపన, ఇద్దరు బాల వితంతువుల్ని రచ్చకీడ్చి, వారిలో ఉన్నదంతా చెడ్డ అని పుస్తకాలనిండా రాస్తావూ?' అంది.

'గట్టిచిక్కే వచ్చి పడింది...' ఆలోచించాడు. ఇంతలో యుక్తి స్ఫురించింది. 'మరో బాల వితంతువు బుచ్చమ్మని సృష్టించి, మంచి దాన్నిగా నిరూపించాను కానా ? ఒకరిలాగా మరొక రుంటారా ? నీకు నువ్వే సాటి, బుచ్చమ్మకు బుచ్చమ్మే' అన్నాడు. 'ఆ వెర్రి బాగుల్దాని మంచితనం ఎవతెక్కా వాలి ? సౌశీల్యం పేరుతో హృదయాన్ని అణచిపెట్టుకోవడం నావల్లగాదు. అమాయకత్వ మంటే పనికిమాలినతనమైతే, నేను గడుసరిదాన్నే అవుతాను. నేను నీమీద ఆరోపిస్తున్న నేరం నాకు తెలివినీ, తెగింపునీ ఇచ్చావనికాదు. అందుకు నేను నీకు రుణపడి వున్నాను,' అన్నది. 'మరేమిటి నేను చేసిన నేరం?' అన్నాడు.

"వింటావా ? నాలో ఈషణ్మాత్రం మంచినైనా చూపించావూ? సంసార్లందరూ అసహ్యించుకొనేటట్టు చూపెట్టావు. పార్వతినైనా విడిచావా అంటే, పసివాళ్ళ మనస్సులను చెడగొట్టే దాన్నిగా చూపెట్టావు. చెడుగు పక్కనే మంచి వుంటుందన్నావే, మాలో ఏదీ అది ?"

'మీలోనా ? మంచి ఎందుకులేదు ? మగడు చచ్చాడని నిరాశపడి ఉరేసుకో లేదు. ఏ బావిలోనో దూకలేదు. తప్పులు చేస్తే చేశావు. అవి మనుషులు చేసే తప్పులే. చేస్తూనే, పెళ్లి చేసుకొని, నీ అన్నవాణ్ణి ఏర్పరచుకొని, గృహిణివై, మాతవై స్థిమిత పడుదామనుకొన్నావు. అందుకే ఈ శరణాలయానికి వచ్చావు. అట్లాగే పార్వతిన్నీ. వెంకన్న వెర్రాడైతే యేం, రామమూర్తిని పెళ్ళాడా లనుకుంది. మీ బాబాయి గిరీశం సంఘ సంస్కారం కెత్తాను వేషంలో ప్రత్యక్షమై దివాన్ బహద్దరు రాజారామ్‌తో కలిసి ఆ పెళ్ళికి ప్రయత్నాలు చేస్తున్నాడు', అన్నాడు.

'చేస్తే యేం లాభం ? పెళ్లి జరగలేదుగా?' అంది. 'ఆ కథ ముగిస్తే జరిగి వుండేదే.' అన్నాడు.

"జరగని పెళ్ళికి ఎలా సంతోషించమంటావు ? మాకు పెళ్ళి చెయ్యడమే నీకు సమ్మతమైనట్టయితే మాలో ఎవరికో ఒకరికి చేయించి వుందువు. పోనీ, నీ అభిమానపుత్రిక బుచ్చమ్మకైనా చెయ్యం

చావూ? ఊహూఁ? ఎందుకు చెయ్యిస్తావు? నువ్వూ ఆ తానులో గుడ్డవే. అందుకే నేనూ బుచ్చమ్మా ఇక్కడ పడిగాపులు పడుతున్నాం. ఎదురు తెన్నులు చూస్తున్నాం. మాకు తగిన భర్త దొరికేనా? మూడు ముళ్ళూ పడేనా? మానొసట సుఖం, కడుపున సంతానం, రాసిపెట్టి వుంచేనా? మా ఖర్మ! మమ్మల్ని పుట్టించినవాడి నిర్దాక్షిణ్యానికి బలిపశువులమైపోయాం," అంది.

ఆయన తలదించుకొన్నాడు. కళ్ళలో నీళ్లు నిలిచాయి. గొంతు తడబడింది. "పొరబాటే చేశాను. ఒక చెర వదిల్చి యింకో చెరలో పెట్టాను. పంతులుగారితో మాట్లాడి మీ అక్కరలు తీరుస్తాను" అన్నాడు

మీనాక్షి అతన్ని చూస్తూ నిలబడిపోయింది. ఆయన నవ్వేప్పుడు ఆ పేశాడో అనుకొంది. "వంగి నడుస్తున్నాడు. లోకం బరువు అతని మూపెక్కి కూర్చుందా ఏమిటి? హాస్యం అనుకొన్నానుగాని, దాని వెనక ఎంతజాలి, ఎంత దయ? లుబ్ధావధాన్లు పేరుకేగాని, ఈయనే నాతండ్రి," అనుకొంది.

—



# 11. నాటక శకలాలు

"నువ్వు వాస్తవిక విషయాలను యథార్థాలను కప్పి పుచ్చకు. ఇంతే నేను నిన్ను కోరుతున్నది. రోగికి డాక్టరు శస్త్ర చికిత్స చేసినట్లు సమాజంలోగల రుగ్మతలను కత్తి తీసుకొని కోసి దేనికది విడదీసి అన్ని భాగాలనూ పరీక్షించి చూడు."

— ఒంగోలు ముని సుబ్రహ్మణ్యంగారికి
అప్పారావు లేఖాంశం

కన్యాశుల్క నాటకంలో ప్రస్తావనకురాని సమాజ రుగ్మతలు అట్టేలేవు. మత విశ్వాసం, హేతువాదం; దాంపత్యం, సానిరికం; ఛాందసం, విశృంఖలత్వం; పురుషాధిక్యం, స్త్రీ జనాక్రోశం; గ్రామీణ జన బుద్ధి జడిమ; నాగరజన బుద్ధి వక్రత; అధికాం దుర్వినియోగం, పాలిత ప్రజా దైన్యం; రాజకీయోద్యమ సంచలనం, రాజభక్తి భావ స్థైర్యం; సంస్కారోద్యమ స్పందనం, ఆచార పరత్వ నిశ్చలత్వం — ఈ విరుద్ధ లక్షణాల మధ్య మరెన్నెన్నో మధ్యస్థ స్థానాలు: కన్యాశుల్కం నవలగా వుండవలసిన నాటకం! దాని పరపూ విప్పూ నాటకోచితాలు కావు. యుగసంధి కాలంలో ఆంధ్రజాతి జీవిత చరిత్ర చిత్రపటం వంటిది, ఈ వచనేతిహాస గ్రంథం.

అయినప్పటికీ, కొన్ని సమాజ రుగ్మతలను తేలికగా తాకీ తట్టీ ప్రస్తుతానికి విడిచి పెట్టడం, మరి కొన్నింటిని పేర్కొని మాత్రమే తృప్తి పొందడం జరిగింది ఈ మిగుళ్ళు సగుళ్ళు, రోగ బీజాలను వెద

జల్లి కుండేందుకై మరొక శస్త్ర చికిత్స అగత్యమైంది. అదే కొండు భట్టీయం.

ఒకే కవి పరంపరగా రెండు బృహత్ రచనలను సాధించ లేడనేందుకు, కొండుభట్టీయమే సాక్షి. కన్యాశుల్కాన్ని చదివితే పట్టపు ఏనుగు గుర్తుకు రాగా, ఇది చెల్లా చెదరుగా పడివున్న ఏనుగు ఎమ్ముల తుంటలను స్ఫురింప జేస్తున్నది. ఆ సమగ్రత ఇక్కడ అసమగ్రతగా భాసిస్తోంది. కన్యాశుల్క రచన, అప్పారావులోని ప్రతిభా సాగరాన్ని అగస్త్యుడు తాగివేసినట్లుగా, సృజనాత్మకమైన శక్తులను వ్యయంచేసి విడిచివేసినట్లుగా. నీరసించిన రోగి ఆరోగ్యం కోలు కొంటూ నడిచేందుకై చేసిన దుర్బల ప్రయత్నంవలె, కొండుభట్టీయం దర్శనమిస్తోంది. అవే చమక్కులూ, చెణుకులూ వినిపించ వచ్చుగాక, అవే పాత్రలు మరో తెన్నున ప్రవర్తిల్లవచ్చుగాక, సూక్ష్మంగా వదలి పెట్టిన సమస్యలకు వైపుల్యం ఘటిల్లవచ్చుగాక, దానితో పోలిస్తే ఇది దయనీయమౌతోంది.

కారణాలు అనూహ్యాలుకావు. రెండో కూర్పుకోసం కన్యా శుల్కాన్ని మార్చి మరోమూసలో పోస్తూండిన రోజుల్లోనే, ఈ కొత్త నాటకం రాయడం జరిగిందని, అప్పారావు లేఖలు తెలుపుతున్నాయి కావూ? నీలగిరి మకాంలో 1906 లోనే దీనిని రాసికూడా, సదరు ప్రతి పోయినందుచేత, ఒకటి రెండేళ్ళ తాళి మళ్ళీ రాసినట్లు తానే అన్నాడు. ఈలోపల ఒక చోద్యం జరిగిపోయింది. తనకు పూర్తిగా తెలియకుండానే. కన్యాశుల్కం రచనోత్సాహం పొంగి పొర్లి, కొన్ని కెరటాలు కొండుభట్టీయం మడుగులోనే నిలబడిపోయాయి.

మాటలకు మాటలు, వాక్యాలకు వాక్యాలు, ఊహలకు ఊహలే కవలపిల్లల్లాగా రెండింటిలోనూ చోటుచేసుకొని వున్నాయి.

ఒక తార్కాణం.

మంజువాణి అనే వేశ్య, తార్పుడుగాడైన కొండుభట్లును పాద తాడనంచేసి మరీ సరసమాడుతూ, ఇలాగంటుంది: "యీ తాపు మదనశాస్త్రంలో క్రియకింద పరిగణన అవుతుందా? భూసురోత్తముల తన్నిన పాపం కింద పరిగణన అవుతుందా?

కొండుభట్లు :— "పదిరూపాయలు పారేస్తే పుణ్యంకింద పరిణామం అవుతుంది."

కన్యాశుల్కం తృతీయాంకంలో, రామప్పంతులుతో కరటకశాస్త్రుర్లు అంటున్నాడు: "ఈ పాపపు సొమ్ముకే తమరు ఆశించాలా అండీ ?" రామప్పంతులు జవాబు కొండుభట్లు ఇచ్చినా ఆశ్చర్యానికి తావుండదు: "పాపపు సొమ్ము మా దగ్గరకి రాగానే పవిత్రమై పోతుంది."

కన్యాశుల్కంలో కరటకశాస్త్రుర్లు లాగానే ఇక్కడ కొండుభట్లు ఆత్మస్తుతికి పూనుకొని, "దేవతలు బ్రాహ్మణులు చేసే పనులు తప్పు పట్టగూడదు. స్వర్గంలో వాళ్ళు దేముళ్ళయితే భూలోకంలో మేం దేముళ్ళం; అంచేతనే మమ్మల్ని భూసురు లంటారు," అంటాడు. కన్యాశుల్కంలోని హవల్దారు బ్రాహ్మడు కాకపోయినా, శతాబ్దాల నుండీ స్థిరపడివున్న బ్రాహ్మణ వర్ణాధిక్యాన్ని జీర్ణించుకొన్న శూద్రుడు కాబట్టి, బ్రాహ్మలను దేవుళ్ళతోనూ గవర్నమెంటు తోనూ కూడగట్టి, "వారి నేరాలు వారివి. వాటితో మనకి పనిలేదు. మనభక్తి మనకుండాలి," అంటాడు.

స్థూలంగా చూస్తే, ఈ పోలికలు కొండుభట్టీయాన్ని కన్యాశుల్కానికి నకలుగా మార్చవు. ఒకే విధమైన సమస్యను రెండు దృక్కోణాలనుంచి పరిశీలించిన ప్రయత్నాలు. కన్యాశుల్కంలో అనేకానేక విషయాలలో సానిరికం ఒకానొకటి మాత్రమే. మధురవాణిని కన్నతల్లిగానీ, దోస్తీకట్టిన ఇతర వేశ్యలుగానీ, తార్చే తైనాతీలుగానీ అందులో కనిపించే వీల్లేదు. సానిబతుకును, వెలుపలినుంచిమట్టుకే అది వీక్షించింది. అయితే ఇది, లోపలినుంచి, దగ్గరగావుండి, గుట్టుమట్లు నెమకి, లోతుకుదిగి తరిచింది. కన్యాశుల్కం విరివి దీనికి లేకున్నా, కొండుభట్టీయం లోతు దానికిలేదు. కాబట్టి ఈ రెండో నాటకం, A study in depth అనదగింది.

ఎక్కడో ఒకటి రెండుపట్ల దివ్యజ్ఞాన సమాజంవారినీ, బ్రాహ్మసామాజికులనూ కన్యాశుల్కం పేర్కొనగా, అది యథాజీవిత ప్రమా

ణాలకు పెరిగి, కొండుభట్టీయంలో ప్రముఖ స్థానమే ఆక్రమించింది. సంస్కరణోద్యమ నిజస్వరూపం ఇక్కడ ఎదురౌతుంది.

బ్రాహ్మణ దుర్వ్యాపారాలను కరటకశాస్త్రుల్లు పరోక్షంగా, రామప్పంతులు ప్రత్యక్షంగా నిరూపించినా, అగ్నిహోత్రుడూ లుబ్ధుడూ అడ్డుతగిలి, బ్రాహ్మణ్యాన్ని యెంతో కొంత సమర్థించుకోగలిగారు. ఇలాంటి తుప్పట్టిన డాళ్ళనుకూడా తొలగించి, కొండుభట్టు ద్వారా బ్రాహ్మణ్యం పరువును కడగబూనుకొన్నట్లు అప్పారావు పరం పరగా దారుణ హేళన ఖండనాస్త్రాలను ప్రయోగించాడు. కన్యాశుల్కం సప్తమాంకంలో బ్రహ్మద్వేషి అయిన ఒక శూద్రుడు (విద్యాధికుడైతేనేంగాక) "బ్రాహ్మల్లో ఉన్నంత ఖంగాళీ, మాలకూడూ మరెక్కడా లేదు," అని కులదూషణచేస్తే, అది అతగాడి మనస్సంకోచానికే తప్ప మరెందుకూ సూచిక కాలేదు. అయితే కొండుభట్టు ద్వారా ఈ విమర్శకు పుష్టీ పోడిమీ కలిగాయి. అతని కొడుకైన రామ్మూర్తే తండ్రినిచూసి రోయించుకొన్నాడు. బయటినుంచి గాక, బ్రాహ్మణ్యంకే ద్రస్థానం నుంచే యీదఫా దాడిసాగింది. అందుచేత కన్యాశుల్కనాటకానికి మరొకతెన్నులోసాగిన విస్తరణమే కొండుభట్టీయనాటకం.

అది ఆమూలాగ్రమూ లభించివుంటే, విమర్శకుల నిర్ణయాలు వేరే విధంగా వుండేవేమోగాని, అచ్చుప్రతి అసమగ్రంగా వుంది. దానికి అవసరాల సూర్యారావు సమకూర్చిన 'అవతారిక', అప్పారావు చేసిన మార్పు కూర్పులకు కారణాలు చూపెట్టింది. అయితే ఒక్క అంశంలో సూర్యారావు పొరబడి వుంటాడనుకొనే వీలుంది. ఒంగోలు మునిసుబ్రహ్మణ్యంగారికి అప్పారావు రాసిన ఇంగ్లీషు లేఖలను తెలుగు చేస్తూ సూర్యారావు ఒక వ్యాఖ్య చేశాడు:

" 'వ్రాతప్రతిలో వున్న విషాదాంత నాటకం నీకు తెలుసున్నదే కదా' అనే మహాకవి లేఖలోని మాటను పురస్కరించుకొని యీ నాటకము ఎలాగున విషాదాంతముగ పర్యవసించినదో పూజ్యశ్రీ సుబ్రహ్మణ్యముగారిని తెలుప వేడితిని. కాని ఇది నలభై ఐదేళ్ళనాటిమాట! ఆ కథాశేషము వారికి యెటుల జ్ఞప్తికి రాగలదు"? (1)

ఇంగ్లీషు జిబుగు రాతలో Tragedy అనే పదానికీ Third అనే పదానికీ భేద మెంచలేకపోయినందుచేత, ఈ పొరబాటు జరిగివుంటుందా ? అయితే రెండవ నాటకం ఏమిటి ? మరొక అనూదిత లేఖలో, "వ్రాతప్రతిలో వున్న మూడో నాటకం నీకు తెలుసున్నదే కదా !" అని వుంది.(2) ఈ లేఖాకాలం 1909. అంతకు మూడేళ్ళక్రితమే (1906) ఆ నాటకరచన జరిగినా, ఆ ప్రతి రైలు ప్రయాణంలో తప్పిపోయింది కాబట్టి, 1909 లో దీనిని తిరిగి రాయడం జరిగింది. మూడంకాలకంటె ఎక్కువ కాలేదు. అప్పారావు గతించిన అనేక సంవత్సరాలకు, 1906 ప్రతి దొరకబట్టి, దానిని 1910 ప్రతితో సమన్వయించి, 1939 లో ముద్రించడమంటూ జరిగింది.

ఏ విధంగానూ విషాదాంతనాటకంగా పర్యవసించగల సూచనలు ఈ మూడంకాలలోనూ కనిపించవు. శూద్రులింట పుట్టి, కరువు కాలాన తల్లికి భారంకాగా, కొండుభట్లు పోషణకిందికి వచ్చి, పెరిగి పెద్దయ్యాక పెంపుడుతండ్రిలాంటి కొండుభట్టే కాసుకోసమై రామసాని అనే వృద్ధవేశ్య పాల దోయగా, మంజువాణి నాలుగేళ్ళబాటు సానిదైంది. రామసాని పీడ విరగడైంది. స్వేచ్ఛ లభించింది. మిరాసీదార్లు మొదలు తోళ్ళ సాయెబులవరకూ గల నానారసికులను మంజువాణికి తార్చి, దాని దయాదాక్షిణ్యాలతో బతుకు నెట్టుకువచ్చే కొండుభట్లుకు, మరో వేశ్య రత్నాంగిచేత దేహశుద్ధి జరిగింది. కొండుభట్లు చౌర్యానికి పూనుకోవడమే చేటైంది. అతని కొడుకైన రామ్మూర్తికీ, అతని మేనకోడలైన పార్వతి (విధవ)కీ గిరీశం ఆధ్వర్యాన పెళ్ళి ప్రయత్నాలు చాటుమాటున జరుగుతున్నాయి. కొండుభట్లు అన్న కొడుకు వెంకన్న కూడా అక్కాభత్తుడనే కంసాలివాని సాయంతో, ఒక యింటివాడు కాబోతున్నాడు. కథాంశాలన్నీ శుభాంతానికే అనుకూలిస్తున్న అదును చూసుకొని, అచ్చులోని కథ అమాంతం ఆగి కూర్చొంది. సంఘ సంస్కరణకు సంబంధించిన యితివృత్తం కాబట్టి, దానికి విపర్యయం కలిగించే యోచన గ్రంథకర్తకు వుండివుండదు. ఉంటే, సంస్కరణం కూడా Damn it, కథ అడ్డం తిరిగింది, అనాల్సి వుండదా మరి ?

ఈ నాటకంలోని పాత్రలన్నీ వాస్తవ జీవితం నుండి గ్రహించినట్టి వంటాడు, కొన్ని నిదర్శనాలూ చూపాడు, అవసరాల సూర్యారావు. చూపిన వాటికంటె, చూపనివే ఆసక్తిని కల్పించేవిగా వున్నాయి. కన్యాశుల్కంలో డిప్టీకలెక్టరు కుమార రత్నాన్ని మధురవాణికి తార్చి, క్రమంగా తానే దాని పొందు మరిగిన గుంటూరు శాస్త్రుల్లే, కొండు భట్టుగా రూపాంతరం పొందాడా అనిపిస్తుంది. తన రక్త మాంసాలు పంచుకొన్న పార్వతి అనే మేనగోడల్ని కూడా సంసారి సానిగా మార్చజూచే ధనలుబ్ధుడు, తన నీచ వ్యాపారాన్ని మత వైచిత్రితో నిరూపించుకో జూస్తాడు. 'శాక్తేయుణ్ణీని, వామాచార తత్పరుణ్ణీని'. కొడుకు రామ్మూర్తి కంటగింపులకు జవాబుగా కొండుభట్లు చాటిన తత్వం, స్మరణీయం.

"జాజి మొక్కకి పేడ వగైరా అసుద్ధ పదార్థములువేస్తే మొక్క పెరిగి పరిమళ భరితములగు పుష్పాలు పూస్తుంది. చెట్టుకి పేడ వేశామని పుష్పాల కేమయినా అపవిత్రత వచ్చిందా? అవి దేవుడి నెత్తి మీద పెడతాం. అప్పుడెనే యే మాయోపాయం చేతనైనా ద్రవ్యం సంపాదించి పెద్ద అవస్థలోనికి వచ్చిం తరవాత వుచితంగా ధర్మం చేస్తే పాపాలన్నీ దహించుకు పోతాయి..."

తాను పేడ; కొడుకు పూవు. వాడి కోసమేకదా ఈ తాప త్రయం వేశ్య అయిన తల్లి, తన కుమార్తెకు తాళిని కోరుకొనేటట్లు, దుర్మార్గుడైన కొండుభట్లు, రామ్మూర్తికి ఉచ్చదశను కోరుకొంటు న్నాడు. ధనమే కదా సాధనం? ధనానికి సాధనం తైనాతీపని. అది ఎంత నీచమైనా, ఫలితమూ పరమ కామ్యమూ దొడ్డది కాబట్టి, ఫలితాన్నిబట్టి సాధనానికి కూడా పవిత్రత ఏర్పడుతుంది. ధనం శక్తి కాగా, తాను శాక్తేయుడైనాడు. లోక గతితో వికటించే వృత్తికి పూనుకొని, వామాచార తత్పరుడైనాడు. అయితే, తన ఆరాధ్యదైవత మైన లక్ష్మి అనుగ్రహంకోసం, మంజువాణి రక్త మాంసాలను లోకం లోని చెడుమూకకు విక్రయించి, మంజువాణికి వచ్చే ప్రతీవరహాలోనూ తానొక కాసు మినహాయించుకుంటున్నాడు. ఎట్లాగైతేనేమి, రామ్మూర్తి బాగుపడడంకదా కావలసింది! ఒకవేళ తనకు పాపమే మిగులు

బాళొతుందేమో? ఊఁ! అంతా పిచ్చి! రక్తపు సొమ్ములో నాలుగు రూకలు విదిలిస్తే, పాపం పుణ్యమౌతుంది. వారమంతా చేసిన తప్పులు, వారాంతాన చెంపలు వేసుకోవడంతో, ఉప్పున ఎగిరి పోతున్నాయికాదా? దేవుడికి కావలసింది పశ్చాత్తాపమేకదా? అది నిజమైందా, తెచ్చిపెట్టుకొన్నదా, అని సదరు దేవుడు నిన్ను పరీక్ష చేస్తాడా ఏమిటి?

లోక వంచనకు పునాది ఆత్మవంచన. అది కొండుభట్టుని ఆశ్ర యించింది. కులధర్మాన్నీ మతధర్మాన్నీ లౌక్యానికి బలిచేసే ధూర్తులకు ఈ పాత్ర ప్రతీక.

మంజువాణి అనే మర్రివిత్తనం నుంచి మధురవాణి అనే మహా వటవృక్షాన్ని అప్పారావు ఏ విధంగా సాధించాడో, దానినిగురించి ఆరుద్ర పరిశోధనను లోగడ తెలిపాను. అయితే ఒకేఒక భేదం కాన వస్తోంది. పుట్టుకబట్టి మంజువాణి సానిపిల్ల కాదు. మధురవాణి "సత్శూద్రుల పిల్ల"గా పుట్టినంత మాత్రాన, మంజువాణికంటె చెడి పోలేదు. సౌజన్యారావంతటి వివేకి, "కాలుజారిన సత్పురుషుడి పిల్లవై వుంటావు" అని ఒక యోగ్యతాపత్రం పడవేస్తే వేశాడుగాని, సానిపిల్ల లోని మానవత్వం ప్రదర్శించడమే అప్పారావు ధ్యేయమైంది. పుట్టుక బట్టిగాక, వం నుగతంగానూగాక, పెంపుదలనుబట్టిన్నీ పారిసర్యాన్ని బట్టిన్నీ మనుషుల గుణగణాలు ఎక్కువగా నిర్ణీతాలౌతాయన్న శాస్త్ర విషయాన్నే మంజువాణిద్వారా ప్రదర్శించాడు.

కొండుభట్టీయ నాటకంలో పరీక్షగా చూడవలసిన అంశం గురించి ఎవరూ పట్టించుకొన్నట్టులేదు, చిత్రం కాదూ?

అప్పారావు సంస్కరణాభిలాషి సరేగాని, సంస్కరణాభిమాను లను విమర్శించ బూనుకొన్నాడు, ఎందుచేత?

కన్యాశుల్కంలో వలె గిరీశాన్ని చాటుచేసుకొని, కొండుభట్టీ యంలో అప్పారావు నాటకమాడలేదు. సౌజన్యారావంతటి అచ్ఛాదీని కూడా ఇందులో శరణు వేడలేదు. యథార్థాలకు మరింత చేరువగా పయనించి వచ్చాడు. ఈ నాటకంలోకూడా గిరీశం వున్నాడన్నమాటే గాని, వాడికీ వీడికీ కొట్టవచ్చినంత అంతరం వుంది. అతని కంటె

గంభీరులూ విద్యాసంస్కారయుతులూ సంస్కారోద్యమ సారథులై కనిపిస్తున్నారు. గిరీశమైనా "పంతులు" స్థాయికి పెరిగాడు. కన్యాశుల్కంలో ఒక్కొక్కచోట, గిరీశం వల్లెవాటుకింది చొక్కా చిరుగులాగా వాగాడంబరం మాటున దాగిన అజ్ఞానం కనిపించింది. ఉదాహరణకు, షేక్స్పియర్ పడ్డ అవస్థలో పడ్డానన్నప్పుడు, షేక్స్పియరుకు బదులు హేమ్లెట్ అనవలిసింది. అనలేదంటే, అతనికి హేమ్లెట్ ముక్కూ మొహమూ తెలియవన్న మాట. కొండుభట్టీయంలో అలాక్కాదు. ఇక్కడ తాను యుగంధరరావు పంతులు కుమారుడు. బి. ఏ. పట్టం పుచ్చుకొన్నాడు. బళ్లేరీ ఇంగ్లీషు కలికానికైనా లేదు. ఉపనిషత్సూత్రాలనూ వేదసూక్తాలనూ ధారాళంగా వల్లించి వ్యాఖ్యానిస్తున్నాడు. మతాన్ని గురించి సాధికారంగా ఉపన్యసిస్తున్నాడు. నెపోలియన్ ఆఫ్ యాంటీ నాచ్చిగానేగాక, సంస్కారోద్యమపు కెప్టానుగా, నిశిరాత్రివేళైనా ఒక్క కేకతో రెండువేలమంది బలగాన్ని సమకూర్చగల కార్యదక్షుడుగా దర్శనమిస్తున్నాడు. దివాన్ బహద్దర్ రాజారాం అంతఃపురాంగనమీద ఒక కన్ను వేసికూడా, స్వార్థం కఫంలోనే ఈగవలె పడి కొట్టుకోకుండా, కొండుభట్లు ఇంటికి ఎసరు పెట్టి రామ్మూర్తికీ పార్వతికీ పెళ్ళిచేయబూనాడు. అందుకోసమే శంకరశాస్త్రిగా వేషం మార్చి ఒక ప్రతిలోనూ, కొండుభట్ల సాయంతో మంజువాణి కొంపకు పోయి దాని విటుడైన పంతుల్నీ కొండుభట్లనీ దేహశుద్ధి ద్వారా మనోపరివర్తన కలిగించజూచే తోళ్ళసాయెబుగా మరో ప్రతిలోనూ కనిపిస్తాడు. అయితే తాను గిరీశం – జాతికి చెందినవాడే కాబట్టి, "కోటివిద్య లున్నాయి. నాటకా లాడుతాడు. పాడుతాడు. గారడీ చేస్తాడు."

అంతకంటెకూడా సార్థకమైన పాత్రలు, ప్రత్యక్షంగానే దివాన్ బహద్దర్ రాజారాం, కేశవరాయడు; పరోక్షంగా మాధవయ్య. ముగ్గురూ సంస్కారోద్యమం ఇలాకా వ్యక్తులే. అయితే ఎవరి తెన్ను వారిదే. కేశవరాయడేమోగాని, తతిమా ఇద్దరున్నూ రాజభక్తులు. అప్పారావు మాత్రం కాడా? అయినా, 1910 తర్వాతగాని అప్పారావుకు ప్రభుత్వం చేసిన మేలు ఇదమిత్థమంటూ ఏదిన్నీ లేదని గుర్తు

పెట్టుకొన్నప్పుడు, ఈ నాటకం తృతీయాంకం ద్వితీయ రంగంలోని సంభాషణల ప్రాముఖ్యం బోధపడగలదు. రాజభక్తి, సంస్కారానురక్తి సంధానించి వుండిన కొందరిమీద అప్పారావు విసురుపడక తప్పలేదు. రాజారాం కపటి. దొరల మెప్పుకోసం సంస్కారోద్యమంలో వేలు పెట్టాడు. దొరల మెప్పుద్వారా, మళ్ళీ దివాన్గిరీగానీ, కౌన్సిలుసభ్యత్వం గానీ చేజిక్కించుకోవాలి. అందుచేత, అరమనస్సుతో, ముఖ్యంగా పెదవిదాటి లోతుకు దిగని సానుభూతితో, సంఘసంస్కరణను విధిలేక అభిమానించి, అదీ తన యింటి వెలుపలనే జరిగేటట్లు కట్టుదిట్టాలు చేసుకొని, మరీ గిరీశాన్నీ, కేశవరాయణ్ణీ కార్యరంగంలోకిదించి తాను వెనుకవుండి, ప్రతిష్ఠలో మాత్రం తనకే ఎక్కువ వంతు రావాలని సంకల్పిస్తాడు. అతనికి మాధవయ్య అంటే అరికాలిమంట. ఎందుకు ? మాధవయ్య నిజంగా సంస్కర్త. ప్రతిష్ఠనంతా ఆయనే అనుభవిస్తు న్నాడు. తనలాంటి గోముఖవ్యాఘ్రాలకు పంచిపెట్టడంలేదు. అందు చేత మాధవయ్య మొండివాడనీ, సంస్కర్తలలోనూ ఛాదస్తుడనీ కొన్ని మాటలు వదులుతాడు.

"మాధవయ్యగారిది వైదీకపురస్తా. అందులో వేగినాటి సన్యాసం అయ్నుకు దేశాన్నిపట్టి అబ్బింది. గ్రంథాలయితే చాలా రాశారు."

అయితే అవీ పుస్తకాలేనా ? ఒక్క 'సోలిడ్ బుక్కైనా' ఉంటే ఒట్టు! "పిట్టకథలు, పిచిక కథలు, తిట్లూ" రాశాడట మాధవయ్య.

సంస్కరణోద్యమ నిర్వాహకం గురించి గూడా వాళ్ల మార్గాలు భేదిస్తాయి. సంస్కరణ వివాహాలను శాస్త్రోక్తపద్ధతిలో హైందవంగా సలక్షణంగా మాధవయ్య జరిపిస్తున్నాడు. బ్రాహ్మసమాజ సూత్రానుగుణంగా జరిపించవలెనని కేశవరాయనివంటి బ్రాహ్మలను రాజారాం ప్రోత్సాహపరుస్తాడు. కేశవరాయడికీ, మాధవయ్యగారికీ జుట్లుపందెం ముదిరితే, "ఈ దేశంలో రిఫారము అమాంతంగా రెండు ముక్క లవుతుంది" అని గిరీశం తెలుసుకొన్న సత్యాన్నికూడా రాజారాం గ్రహించడో, గ్రహించినా పట్టించుకోడో, ఏదో ఒకటి. అతనికి రిఫారమెందుకు, కావలసింది దివాన్గిరీ!

గుడ్డివాడైనా చెబుతాడు, యీ మూడు పాత్రలు సమకాలిక వ్యక్తుల కెవరికోగాని ప్రతికృతులని!

మాధవయ్యగారికి రావుబహద్దర్ బిరుదం ఒకటి ఉంది. బ్రాహ్మ సమాజంలో వుంటూనే, సలక్షణంగా సంస్కరణ వివాహాలు జరిపిస్తున్నాడు. ఎన్నో గ్రంథాలు - ఉపదేశాత్మక లఘు గంథాలు, హేళనాత్మక గ్రంథాలు, ఖండనాత్మక గ్రంథాలు - రాసి వున్నాడు. వేంగినాటి గుణాలు పుట్టుకతో అబ్బకపోయినా, ఒంటు పట్టించు కొన్నాడు. కనిపిస్తున్నాడా లేదా వీరేశలింగంపంతులు మాధవయ్యలో? లేదంటే, ఆ వీరేశలింగంపంతులునే బరిలోకి పిలుద్దాం.

"మతసంస్కారము లేక సంఘ సంస్కారముగాని మరి యే ఇతర సంస్కారముగాని జయప్రదముగా సాగదని చిరకాలానుభవము వలన నేను దృఢముగా దలచుచున్నాను. మీరు (అనుష్ఠానపరులయిన బ్రాహ్మలను నిందించుచున్నవారు) పడుచున్న భ్రమలోనె నేనును తగులుకొనియుండి మతవిషయకములైన నా విశ్వాసములను గొన్నిటిని కార్యములలో జూపక యాత్మవంచకుఁడ నయి వితంతు వివాహ సంస్కారం చెడునని కడచిన యిరువదియైదు సంవత్సరములనుండి యీశ్వరవంచకుఁడనయి ప్రవర్తించినాను. (3)

ఈ మాటలు వీరేశలింగంగారివే గాని, మాధవయ్య గురించి రాజారాం చేసిన విమర్శలోనివైనా ఆశ్చర్య పడనక్కరలేదు వితంతు వివాహాలలోనే గాక, యజ్ఞోపవీత సన్యాసంవంటి వాట్లలోనూ పూర్వ మతాచారాలను ఆయన సులువుగా వదులుకో లేదు. వితంతు వివాహ కార్యంలో మతంతంతు వైదొలగినట్లయితే, అనేక హిందూ వధూవరులు ముందుకు రారేమోనని ఆయన భయపడినట్లు, 'స్వీయ చరిత్ర' లో చెప్పుకొన్నాడు.

ఇక, కేశవరాయ డెవరై వుంటాడు? ఈ పాత్రకు రఘుపతి వేంకటరత్నం నాయనితో కొన్ని పోలికలు వున్నవేగాని, అవి బలీయ మైన నిర్ణయాలకు దారి తీయవేమో! ఇద్దరూ విద్యా సంస్థాధిపతులు. ఒకచోట రాయడు, 'నాయడు'గా ప్రసక్తుడైనాడు. సంస్కారోద్యమం లోనేగాక, బ్రాహ్మ సమాజంలోనూ మాధవయ్యతో పోటీ పడగలిగిన

తాహతు ఒక్క కేశవయ్యకే వుందని ఒకచోట గిరీశం అంటాడు. అయితే, వీరేశలింగంగారికీ, వేంకరత్నం నాయడికీ ఇంత తీవ్ర విభేదా లున్నట్లు మనకు ఇప్పటికేం దాఖలాలు లేవు కాబట్టి, ఈ విషయంలో తొందరపడి అప్పుడే ఒక తీర్పు చెప్పడం దుస్సాహస మౌతుంది.

దివాన్ బాహద్దర్ రాజారాం, ఏ వ్యక్తికీ నకలు కాకపోవచ్చు. లౌకికం తెలిసి ప్రభువుల ప్రాపకంకోసం రుచించని కూళ్లు కుడిచే అలాంటి వ్యక్తులు అనేకులు ఆ కాలంలో వుండి వుంటారు. ఇది ఊహా మటుకే కాదు. వీరేశలింగంగారి స్వీయ చరిత్ర చదువుతూంటే, 269–270 పుటలలో రాజారాం పాత్ర, దివాన్ బాహద్దర్ రఘునాథరావు అనే యథార్థ వ్యక్తిగా దర్శనమిస్తాడు. బరోడా దివానుగా వుండి వచ్చి మద్రాసులో స్థిరపడి విధవా పునర్వివాహోద్యమంలో తల దూర్చి, ఒక పెళ్ళి జరిపిద్దామని వీరేశలింగంగారు మద్రాసుకుపోయి ఆయన ఇంటికి పదే పదే వెళ్ళినా, లోకులకు వెరచి వుద్యమంనుండి విరమించుకొన్న మహానుభావు డాయన.

దివ్యజ్ఞాన సమాజం వారిని గురించికూడా ఒకటి రెండు విసుర్లు కొండుభట్టీయంలో వున్నాయి. అప్పారావుగారి పరిచితుడు, పేరు మోసిన న్యాయవాది అయిన శ్రీనివాసాచారి థియాసఫిస్టుగా మారి, ప్రతీ పూర్వాచారానికీ ఉపపత్తి కల్పించి సమర్థిస్తూవున్నట్లు ఒకచోట అప్పారావు అంటాడు మద్రాసులో అప్పటికే వేళ్ళు తన్నుకొని, మేధావులను అనేకులను ఆకర్షించి, హిందూమతం స్థానే మరొక మతాన్ని స్థాపించే ఈ ఉద్యమం, అప్పారావు విమర్శను చూరగొన్నది. బ్రాహ్మసమాజమయినా మేలు: 'రేషనల్ రెలిజన్'! "థియాసఫిస్టు మతమువలె పేడా బెల్లం కలిపి మనవాళ్ళు సంతోషించడముకొరకు ప్రతి వెర్రిమొర్రివ్రాతకు సుందర్భార్థము కల్పించడమూ, ప్రతి అవక తవక ఆచారమునకూ రహస్య సవబులు, గుణములు కల్పించడము,... యేమంటారు? తాము అట్టి వెర్రిమాయలు నమ్మజాలరే?" అంటాడు రాజారాం. ఆత్మశ్లాఘ, పరనింద ఇలాగే వుంటుంది మరి! తానొకవైపు హిందూమత గ్రంథములలో "భగవద్గీతాది మహాగ్రంథముల సాహాయ్య మున ఆర్యమతమునకు చిరకాల మావరించిన త్రుప్పును గడగి ఆచార్య

నిర్దిష్టకర్మ, వేదాంతమార్గములను చదువరులకంటె కింపుగ గనపర్చ ప్రయత్నిస్తున్నాను," అంటాడు. బ్రహ్మసమాజం నాస్తికతాప్రవాహానికి పెద్ద ఆనకట్టవలె వుపకరిస్తున్న దంటాడు. థియోసఫీచేస్తున్న ఉపకారమేదైనావుంటె (మతతత్పరులకు), కొత్తపునాదులమీద పాత భవంతినే నిలపడం కాదా ? దివ్యజ్ఞానసమాజ సారథి, ఆనీ బెసెంటు మ్మను జవాబు చెప్పనిద్దాం, రాజారాంకు: 'థియాసఫీ' అనే గ్రంథంలో, ప్రపంచంలో పెచ్చుమీరిపోతున్న నిరీశ్వరవాదానికీ భౌతికవాదానికీ అడ్డుకట్టవేసేటందుకుగాను, వివిధ మతాలకు సాధారణమైన కొన్ని ప్రాతిపదికలను సమకూర్చుకొని, థియోసఫీ ఒక ఉద్యమరూపం ధరించిందని ఆమె రాసింది. ఏ మతానికైనా హృదయ పదార్థ మనదగిన దివ్యజ్ఞానాన్ని వ్యక్తిమాత్రుడు తనకు తానై సహజానుభూతిద్వారా (intuition) పొందగలడేగాని, బోధనద్వారానూ సిద్ధాంత ప్రతిపాదనద్వారానూ కాదట. ఈ సహజానుభూతి, మానవుని హేతుబుద్ధికి (Reason) బాహిరమైనదీ, అతీతమైనదిన్నీ. దేశదేశాల దేవతాకథలను (mythology) సరిపోల్చి చూసేపద్ధతిగానీ, భౌతికవాద దృక్పథంగానీ, ఈ మతసత్యాన్ని కనుగొనపోవటు. (4) శాస్త్రాతీతమైన ఆత్మవిద్యతో మొదలైన యీ నూతన మతోద్యమం కొత్తదేవతలను కొత్త అవతారాలను సృష్టించడంతోకూడా సరిపెట్టుకోలేదు. పాత మతవిశ్వాసాలను, సంస్థలను సమర్థించే పక్కిగూడా పూనుకొంది. "ఉన్నతలోకాల ప్రభావాలను భక్తులకూ సత్పురుషులకూ చేరవేసేందుకై దివ్యజ్ఞానసంపన్నులైన మహామహులు క్రమపద్ధతిలో ఏర్పాటుచేసిన వివి," అంటూ మతవిహిత కర్మాదికాలను బెసెంటమ్మ సమర్థించింది. (5) కాబట్టి రాజారాం విమర్శలోనూ, తన మిత్రుడైన శ్రీనివాసాచారిగారి కొత్త చాదస్తం గురించి అప్పారావు చేసిన వ్యాఖ్యలోనూ అసంగతమైన దేదీలేదు. అయితే దివ్యజ్ఞాన సమాజంకంటె బ్రాహ్మసమాజం ఉన్నతమైన స్థాయిలో ఉన్నదనుకోవడం భ్రమాజనితలోపమని భావించవలసి వుంటుంది.

నాటక ప్రదర్శనం కంటె చలన చిత్రానికి అనువుగావున్న అనేక రంగాలు, నాతి దీర్ఘ సంభాషణలు, చకచక కదిలి, గబగబ మారి

పోయే చిటిపొటి సన్నివేశాలు, ఆఖరుకు రంగస్థలంమీద కనిపించే శైలుపెట్టె - ఇవన్నీ చేరి, కొండుభట్టీయ నాటకం ప్రయోగరీత్యా బలహీ॰మని ఎట్లాగూ తెలియజేస్తాయి. అది చాలా అపురూపమైన కొత్త పోకడ అనికూడా నిరూపిస్తాయి విధవరాలైన పార్వతికీ కన్యా శుల్కంలోని మీనాక్షికీ, అమాయకుడైన వెంకన్నకూ కన్యాశుల్కం లోని కొండుభట్టుకూ, కాస్తకూ స్త సంబంధం లేకపోలేదుగాని, కొండు భట్టీయంలోని సంస్కర్తాత్రయమే దీనికి ప్రత్యేకతను చేకూరుస్తుంది.

## 2

"ఆత్మబలమున్న వ్యక్తిని మీరు ఈసడించినా, అవమానపరచినా, అతను మిమ్మల్ని దూషించడు మీకు అపకారంచేయడు. కోపగిం చడు మీకేదో ఒక ఉపకారంచేసి తన ప్రతీకారాన్ని తీర్చుకుంటాడు. అతని వైఖరివల్ల మీకే జ్ఞానం కలుగుతుంది. సజ్జనుని అనవసరంగా తూలనాడితిమని మీరే గ్రహిస్తారు. అదే అతను మీకు కలిగించే వివేకం."

— ఆనందగజపతి సుభాషితం : మాటామంతీ - అవీ : ఇవీ.

సుపసిద్ధమైన బిల్హణుని ప్రణయోదంతాన్ని చేబూని దాదాపు స్వకపోలకల్పిత మనిపించేటంత కొత్తగా, "బిల్హణీయం" నాటకం అప్పారావు రూపొందించాడు. "లవణరాజుకల" అనే గేయాన్ని విమర్శిస్తూ, ప్రాచీన కథను ఈ విధంగా మార్చుకోవడం తగనిపని అంటూ 'జయంతి' పత్రికలో ఒక ఆక్షేపణ వెలువడింది. అయితే అప్పా రావు చూపు మరొకతెన్ను పట్టినట్లుంది. ఈ రెండు సందర్భాలలోనూ ఆయన పూర్తి స్వేచ్ఛవహించి, పూర్వకథలకు గడ్డాలూ, మీసాలూ పెట్టి రూపు చెరిపివేయలేదు. అభూతకల్పనలపట్ల మరొకచోట తన వైముఖ్యాన్ని వాచ్యం చేశాడు కూడాను. ఎన్నడోజరిగి చరిత్రలో మణగిపోయిన ఒక అంశాన్ని ఇతివృత్తంగా (6) గ్రహించినప్పుడు, రచయిత అభిమానాల ననుసరించి దానికి వన్నెచిన్నెలు కూర్చడం, తరచూ జరుగుతుంది. అయితే ఇవి పచ్చి అబద్ధాలుగా, నిజంతోటి

అసంబద్ధాలుగా మాత్రం పరిణమించ గూడదు. అంతే, అలాంటిరచయితకు కొన్ని పరిమితులున్నాయి. "ప్రతాపరుద్రీయ" నాటకంలో దేశభక్త్యాత్మక కల్పనను మెచ్చుకొంటూనే చారిత్రకాంశాల అవాస్తవికతను అప్పారావు విమర్శించింది ఇందుచేతనే.

అసలు పూర్వగాథలను చర్విత చర్వణంగా నవీనరచయితలు పునః ప్రాణ ప్రతిష్ఠ చెయ్యడంగురించి అభ్యంతరం తెలిపిన (7) అప్పారావు, తానే అలాంటికథను ఎందుకు చేబూనవలసి వచ్చింది? ఆయనే కారణం వివరించాడు : "ఉదాత్తగంభీరభావాల అనుభూతుల అభివ్యక్తికరణకు వాడుకభాష అన్ని విధాల యోగ్యమైనదని చూపడానికి బిల్హణుని కథను నాటకంగా రచిస్తున్నాను." (8) డాక్టరు బుర్రా శేషగిరిరావు కూడా ఈ విషయాన్ని నిర్ధరించాడు. "'పరిశుద్ధవాదులకు' అంగీకారముగా వుండేటట్టు శృంగార ప్రాధాన్యముగల యితి వృత్తమును నాటకమునుచేసి వ్యావహారిక భాషను వ్రాస్తాను అని సంకల్పించి బిల్హణీయము యెత్తుబడి చేశారు." (9) ఎత్తుబడి అయితే జరిగిందిగాని, ఇది పూర్తి కాలేదు. రెండంకాలే అచ్చులో వున్నాయి.

అచ్చైన యీ రెండంకాలైనా, కథలోకి దిగకుండా దాని అంచుల్లోనే తిరిగినట్లు, నాయికను ప్రవేశ పెట్టకుండా కర్ణమహారాజు ఆస్థాన విశేషాలతో సరిపుచ్చు కొన్నాయి. అప్పారావు చిత్తుగా రాసి పెట్టిన దానినిబట్టి ముఖ్యకథ మూడవ అంకంలోనే మొదలౌతుందని వూహించవచ్చు. ఈ కథలో కాశ్మీర కవి బిల్హణుడు యామినీ పూర్ణతిలకను (రాజపుత్రిక) ప్రేమించే సూచనలు లేవు. కాశ్మీర రాజ్యం నుంచి అనిహిల్వాడా ప్రాంతానికి పారిపోయివచ్చి కాపురముంటున్న సంపన్న కుటుంబులలో రణసింహుడనే యువకునికీ, యామినీ పూర్ణతిలకకూ ప్రేమను కలిగించి, పెళ్ళి నడిపించడమే బిల్హణ మహాకవి ప్రస్తుత లక్ష్యమైనట్లు కనిపిస్తుంది. అతనివద్ద ఆమెనూ ఆమెవద్ద అతన్నీ పొగడి కార్యం నేరవేర్చుకో జూచినట్లుంది. అయితే విధి ఈ ఆటకు అనుకూలించలేదు. యామినీ దేవికి బిల్హణునిపై ప్రేమ వుదయిస్తుంది. ఇది తెలుసుకొని, రణసింహుని ప్రేమించమని యామినికి జాబురాసి, కవి దేశాంతరం పోతాడు. ఈ ప్రధాన కథను చేబట్టే ముందుగానే,

గ్రాంథిక వ్యావహారిక భాషావాద వివాదాలు కారణంగా, అప్పారావు సృజనాత్మక రచన ఆగిపోవలసి వచ్చింది.

అనిహిల్వాడా రాజు కర్ణుని అస్థానికుల చిత్రణమే లోకానికి మిగిలింది. ఇది కొద్దిపాటిదే అయినా, ఎక్కువ విలువ కలిగిన భాగం. ప్రధానకథ ప్రాచీనమైనా, ఈ భాగం మాత్రం నవీనం. ఎంత నవీన మంటే అప్పారావుకు సమకాలిక వాస్తవమైనంత! చారిత్రక కథలో కూడా వాస్తవ చిత్రణ చేసినందుకే అప్పారావును మెచ్చాలి. ఆ రాజు ముమ్మూర్తులా ఆనంద గజపతి మహారాజు — 'రాజ పండితుడు', 'రాజర్షి'. కర్రా పాపయ్యశాస్త్రి అనే అస్థాన నాటక సమాజంలో విదూషక పాత్రధారి, వైయాకరణి మండ లక్ష్మీనారాయణ, ఉభయ భాషా పండితుడు ముడుంబి నరసింహా చార్యులు, దివాను అనంతరావు, నాటకపాత్రలకు కొంతవరకు మూలాలైనట్లు అవసరాల సూర్యారావు రాసిన అవతారికలో వుంది. ఆనందగజపతి దర్బారు సరస్వతీ స్థానంగా విరాజిల్లింది. కళలు, శాస్త్రాలు అక్కడ కాపురం చేశాయి. అనేక అంశాలగురించి పండి తులు చర్చించే వాడుక వుండింది. రాజు వట్టి శ్రోతగానే గాక, స్వయంగా పాల్గొని యీ చర్చలను ప్రోత్సహించేవాడు. జ్ఞానంతో చైతన్యంతో స్పందించే ఆ విద్వద్గోష్ఠికి చెందిన వాతావరణమే బిల్హణీ యంలో అప్పటంగా కనిపిస్తున్నది. ప్రభువులున్నచోట ప్రాపకం కోసం అశ్రితులు ఒకరిపై నొకరు చెప్పుకొనే కొండేలు, ఒకరి మే లొకరు కోరక ఒకరి విలువ నొకరు గుర్తించక జిహ్వా ఖడ్గాలతో పర స్పర ప్రతిష్ఠా సంహారోద్యోగాలకు పూనికచేసే కుటిలత్వంకూడా బయల్పడింది.

'ఎవరో ఒకరిని ఆశ్రయించుకొని, బతుకు తెల్లవారు ్చ కోవడం గొప్పకాదు. కాని ఆశ్రయింపులకోసం అందరూ ఆశిస్తారు. ఎవరో ఒకరు, ఎవరైతేనేమి, తమ కోరికలు నెరవేరితే చాలును. ఇతరులకు నష్టంకలిగినా, ఇదివరకు తమను నమ్మినవారికి కష్టము కలిగినా, ఈ ఆశ్రితులకు లెక్కలేదు. పరుల శ్రేయస్సును పణముగా ఒడ్డడమే వారి పని. కొట్లాటలకూ కుట్రలకూ అంతూ పొంతూ

వుండదు. ఎత్తుకు పైఎత్తు వేసి ఎలాగైనా అధికారాన్ని చేజిక్కించుకోవడమే వాళ్ళకు కావాలి." (10)

ఈ వ్యాఖ్య బిల్హణీయ నాటక వాతావరణానికి సరిగ్గా అమరిపోతుంది. కాని, ఇది ఆనంద గజపతి దర్బారు వింతలను గురించి రాస్తూ అప్పారావు చేసుకొన్న పరిశీలనా సారాంశం. అయితే కర్ణ మహారాజు వలెనే ఆనంద గజపతి, (ఆనందగజపతి వలెనే కర్ణ మహారాజెందుకు కాగూడదు?) సమన్వయ దృక్పథం కలిగి, "ఆయన వద్ద మెలిగే విద్యావంతులవల్ల అపుడపుడు ఆయనకు మనఃక్లేశము కలిగేది" నిజమైనా, ఏ ఒక్కరినీ నిరాదరించక దగ్గరకు చేరదీసేవారు. ఈ వ్యాస విభాగానికి ముందుంచిన ఆనందగజపతి సుభాషితం, బిల్హణీయంలో ఈర్ష్యాళువులైన ఇతరపండితుల నుద్దేశించి కర్ణమహారాజు చెప్పదగింది. అందుచేత, వాస్తవ జీవితంలో తనకు ఆరాధ్యుడై బతికిన ఆనందగజపతి గతించిన పదేళ్ళకు, బిల్హణీయ నాటకంలో అప్పారావు ప్రాణంపోయగా, సాహిత్యంలో జీవిస్తున్నాడు.

ఈ నాటక రచనలో చూపినంత వాక్చమత్కారం అప్పారావు మరెక్కడా చూపలేదనాలి. ముఖ్యంగా విదూషకపాత్ర హాస్యానికి గాక, అపహాస్యానికే నిర్దిష్టమైనట్లుంది. నానామంత్రినీ, లంచగొండి వుద్యోగులనూ, మత్సరగ్రస్తులైన పండితమ్మన్యులనూ గౌతముడు నొవ్వనాడిన తీరు సంస్కృత నాటకాలలోని విదూషక పాత్రలకే పాఠాలు చెప్పగలదు. ఈ పాత్రయొక్క ప్రయోజనం గురించి కర్ణ మహారాజే చెప్పాడు: "హద్దుమీరిన మనిషి ఒక్కొక్కడు ఉంటేనే గాని, హద్దుయొక్క గుణాగుణములు తెలియవు. మనవలె ఉచ్ఛ్రావస్థలో నున్నవారిని స్వేచ్ఛగా తిట్టగలిగినవారిని వకరిని, అచ్చుబోసి వదిలితేనే గాని మననుగూర్చి లోకం ఏమనేదీ మనకు తెలియబోదు." వ్యాకరణ సూక్ష్మాలుమొదలు, రాజోద్యోగుల అర్థసంగ్రహణ పద్ధతులవరకూ సాధికారంగా మాట్లాడగలిగిన విదూషకుడు బిల్హణీయకథాసారస్యానికి జీవగఱ్ఱ. రాచరికమంటే పొడగిట్టనివాళ్ళు కూడా, "పండితుడన్న వాడికి కాలుగాలిన పిల్లిలాగ దేశాలు తిరిగి కష్టజీవనం కల్పించుకోవడానికి బదులుగా, గొప్ప ఆస్థానమందు పెద్ద ఉపాధికలగడం పెద్ద

అదృష్టంకాదా," అనే మాటలతో ఏకీభవించవలసివస్తుంది. ఈ నాటకములో సరిగా నప్పని అంశం ఒకే వొకటి: బిల్హణుడు మిగతవారి కంటె భిన్నంగా, అందరూ వ్యావహారికంలో మాట్లాడితే, తానుమాత్రం తెచ్చిపెట్టుకొన్న గ్రాంథికం నిక్కుతో మాట్లాడుతాడు. ఒక కొన్ని చోట్ల యీ నియమం భంగపడినా, మొత్తంమీద కనీసం ఒక సులభ గ్రాంథికవాదివలెనైనా ధ్వనిస్తున్నాడు పాత్రోచితభాషా ఛాదస్తం అప్పారావును బలిగోరి భ్రమపెట్టిందా ఏమిటి? అతని మాటల తీరు గమనించాలి. ఒకచోట, "యీ అపూర్వమయినమాల, రాజప డితుడైన కర్ణమహారాజు కంఠమును మున్ను అలంకరించెను. ఇప్పు డది పండిత రాజు కంఠము నలంకరించినది." మరోచోట, "నావల్ల భగవద్గీతలు వింటే, మీరు ఉద్యోగం మానుకొంటారు. మహారాజకుమారికా వారు వివాహం మాని, సంసారం పరిత్యజిస్తారు." సగం సాలెనేత, సగం మాలనేత అనుకోవలసి వుంటుంది అప్రయత్నంగా ఈ వైరుధ్యం దూరివుంటుందని తీర్మానించాలి. కన్యాశుల్కంలోకూడా, ఒక పాత్ర ప్రసంగించినట్లు మరొకటి ప్రసంగించదు. ఈ రెండు నాటకాలలో అప్పారావు పాత్రోచిత వ్యావహారికం వాడినాడనాలి.

## 3

"...ఎప్పుడూ యేదో ఆలోచిస్తూ, యేదో రాస్తూవుండే నాకు 'విశ్రాంతి' అనేది కల్ల. నా మెదడు ఎప్పుడూ పని చేస్తూనే వుంటుంది". అప్పారావు : డైరీలు.

జ్వరోద్విగ్నమైన మనస్సులో తెరలుతెరలుగా వచ్చి ఎక్కువ కాలం నిలువలేక అంతలోకి నీరసించిపోయే ఆలోచనలు అప్పారావుకు తప్పలేదు. దేహం దుర్బలమయ్యేకొద్దీ ఆలోచనలు లావయ్యాయి. నిరంతరమైన అనారోగ్యానికి బహుకార్య లంపటత్వమనేది తోడైంది. ఎన్నో ప్రణాళికలు. ఏ ఒక్కటీ కార్యరూపం ధరించలేదు. ధరించినా సమగ్ర సుందరంగా కాదు. చెల్లాచెదరుగా, తునకలు తుంటలుగా ఈ బహుముఖాసక్తి ఫలించింది. అందుచేతనే డైరీలలోనూ, "మాటా

మంత్రి : అవీ యివీ' లోనూ, సమాప్తాలైవుంటే ఘనత నాశించి వుండ గల అసమాప్త రచనలు, ఒక మహాప్రయత్నంయొక్క శకలాలవలె పడివున్నాయి. పాత్రలపేరుతో సన్నివేశాల పేరుతో ఎన్నో కథలకు బీజాలు. తోచినవి తోచినట్లుగా కాగితంమీది కెక్కిన సంభాషణలు. అవిగాక, ఒకటి రెండు చారిత్రక నాటకఘట్టాలు. ఒక యూరేషియన్ నాటకకథా సంగ్రహం. వీటన్నిటినీ పర్యాలోకన చేయడం వీలుపడదు.

చిన్నవాటిని విడిచిపెట్టి చూస్తే, చిత్రాంగి కథనూ రామ రాయల కథనూ అప్పారావు నాటకీకరించ దలచినట్లు తెలుస్తుంది. "తెలుగులో కొన్ని చారిత్రకనాటకాలను, నవలలను వ్రాయ తల పెట్టాను. అందుకోసం ఎట్టి విప్రతిపత్తిలేని దక్షిణ భారతదేశ చరిత్ర నాకు అవసరం. సరియైన చారిత్రక యితివృత్తం, పథకం నా నాటకాలలో, నవలలలో స్వీకరించాలని నా తలంపు."(11) అందు కోసమే మద్రాసు, బెంగుళూరు వంటి చోట్ల మ్యూజియములూ, గ్రంథాలయాలూ దర్శించీ, విద్వాంసులతో మాట్లాడీ, శాసనాలు పరిశోధించీ చాలా విషయసామగ్రిని సేకరించాడు. ముఖ్యంగా విజయనగరపు పూసపాటి రాజవంశీకుల చరిత్రను రచించాలనే సంకల్పం ప్రబలంగా వుండేది. ఆ వెదకులాటలో పూసపాటి మాధవ వర్మనుగురించి భోగట్టా దొరికింది. తళ్ళికోట యుద్ధకాలంలో, బీజపుర సుల్తానైన ఆలీ ఆదిల్షా పొందుచేసి, తర్వాత బెజవాడను ఏలినట్లు తెలియవచ్చిన రామదేవ మాధవవర్మను ప్రముఖపాత్రనుజేసి నాటకం రచించబూనుకొని, కొన్ని దృశ్యాలను మాత్రమే చిత్తుగా రాసి పెట్టాడు. ఇందుతో సౌదామిని అనే పాత్ర ఘటికురాలైన వ్యక్తిగా కనిపిస్తుంది (12)

ఇంగ్లీషులో చిత్రాంగి నాటకం రాయ సమకట్టినట్లు కూడా తెలుస్తుంది. కుమారుడైన సారంగధరుడికోసం కన్యాన్వేషణంచేస్తూ నెల్లూరికివచ్చి, అక్కడి రాజకుమార్తె చిత్రాంగినిచూసి మెచ్చి తానే వివాహమాడిన రాజరాజనరేంద్రుడి వెర్రి చేష్టవరకే మనకు లభ్యమైన దృశ్యంలో వుంది. ఆ వరకే సారంగధరుణ్ణి వలచియుండిన చిత్రాంగి విధిలేక రాజరాజును పెళ్లాడుతుంది. అశుభాన్ని శంకిస్తూనే భర్త

రాజ్యానికి ప్రయాణమౌతుంది. కాబట్టి ఊరిపేరు మార్పు తప్ప, చిత్రాంగి కథగా ప్రసిద్ధమైనదానికి అభిన్నంగానే నాటకం రచించ బూనినట్లు వూహించవచ్చు.

ఆంగ్లో-ఇండియన్లుగా వుండి ఇంగిలీషువాళ్ళు పెట్టే క్షోభకు లోనైన 'యూరేషియన్ల' గురించి ఇంగ్లీషులో ఒక నాటకం రాసి, 'ఇంగిలీషులే తల వంచుకొనేటట్లు చేయవలెను', అని 1895 మే 4వ తేదీన అప్పారావు సంకల్పించాడు (13) వారం తిరగకముందే కథ కూడా స్థూలంగా నిర్ణయమైంది. అప్పారావే దాని నిట్లా రాసి పెట్టు కొన్నాడు.(14)

'ది యూరేషియను డ్రామా. ఒక గొప్ప 'సివిలియను' ఒక కొండజాతి స్త్రీని వుంచుకుంటాడు. అతనికి ఇద్దరు సంతానం. ఈ ఇద్దరూ ఇంగ్లండులో పెరిగారు. పరిస్థితుల ప్రభావం వలన తల్లీ, పిల్లలూ ఒకరి కొకరు దూరమౌతారు. అతను ఆమెతో సంబంధాలను తెంచుకుంటాడు అతను ఎక్కడ వున్నాడో, అతని ఆనుపాను లేమో ఆమెకు తెలియదు. ఒక ముసల్మాను వర్తకుడు ఆమెకు ధనం యిస్తూ వుంటాడు. ఇంటికి కావలసిన వస్తువులు తెచ్చి పడవేస్తూ వుంటాడు. ఇతను మొదట బట్లరు. తర్వాత వర్తకుడైనాడు. కొంత కాలానికి ఆమె కొడుకూ కూతురూ తిరిగి వస్తారు. కొడుకుకు తన తల్లి కొండజాతి స్త్రీ అని మొదట తెలియదు. తన తండ్రి చనిపోయాడని అనుకుంటాడు. కాని అతను ఇండియాకు రాగానే పరిస్థితులన్నీ అవగాహనవుతాయి. ఇంటికి వచ్చే సప్లయిలు కొన్ని రోజులనుంచి ఆగిపోతాయి. కూతురు పనిచేస్తూ వుంటుంది. ఆమెకు చదువు వచ్చును. సప్లయిలు బంద్ అయినప్పుడు, అట్టి సన్నివేశంలోనే పిల్లలిద్దరూ ఇండియా చేరినట్లు చిత్రించేదా?

'ఆ యూరోపియను ఒక పిల్లను పెళ్ళాడుతాడు. అతనికి పిల్లలు కలుగుతారు. దగుల్బాజీ. ఇంకొకపిల్లను ప్రేమిస్తాడు.''

ఇదే విధంగా, ఇంగ్లడులో ప్రచురించుటకు కొన్ని కథలు, ఆధునిక జీవితం గురించి ఒక నవల, ఇంగ్లీషుభాషలో రాయాలను కొన్నాడు. ఒక కథ Stooping to Rise లభించింది. (ఆణిముత్యాలు :

సంస్కృతహృదయం) నవలా ప్రణాళికగూడా దొరికినట్లు అవసరాల సూర్యారావు డైరీలకు చేర్చిన పాద దీపికలో పేర్కొన్నారు. అయితే ఏ గ్రంథంలోనూ దానిని చేర్చినట్లులేదు.

అప్పారావు చేసి చూపెట్టిన దానికంటె ఎన్నో రెట్లు ఎక్కువగా చూపెట్టి చేయలేకపోయాడు. త్రాణలేని ఆ మనిషి ఆరోగ్యవంతుడై వుంటే, ఇందులో ఏదీ అతనికి అసాధ్యమైవుండేదికాదు. తెలుగుదేశం గర్వించదగిన మహా మేధావులలో అగ్రస్థానానికి చెందిన అప్పారావుయొక్క ఆరోగ్యమే, మహా దౌర్భాగ్యం!

---

## పాదపీఠికలు (Foot notes)

(1) కొండుభట్టీయం, అవతారిక, పు. iii, (2) లేఖలు, పు. 89 (3) శ్రీ దేశిరాజు పెదబాపయ్య జీవనస్మృతి & రచన మంజరి, పు. 136-137, (4) Theosophy : Annie Besant పు. 9-15, (5) అదే, పు. 41, (6) లేఖలు: పు. 76, (7) అదే, పు. 15, (8) అదే, పు. 104, (9) కొండుభట్టీయం, అవతారిక, పు. v (10) మాటామంతీ, అవీ : యివీ, పు. 153, (11) డైరీలు పు. 44, (12) మాటామంతీ, అవీ : యివీ, పు. 186-198 (13) డైరీలు, పు. 107, (14) అదే, పు. 112.

# 12. కవిత్వ తత్వం

"కవనమనగా లేని కానివానికి
రూపు కల్పించుటయేగా, ఈ
యవనితో జేరిన పనులకు
దానితో నయ్యే లాభ మేమి ?"

— పండిత రాజసంవాదము :
నీలగిరి పాటలు

ఆ రాజు వీర 'భౌతికవాది' లాగున్నాడు. ప్రాపంచిక వ్యవహారాలకు అక్కరలేని దేయొక్కటీ సన్మానార్హం కాదని వాదిస్తున్నాడు. కలికాలములో, నాలుగు రూకలు చేరవేసుకోవలెనంటే, కంసాలిపనీ, తాపీపనీ ఎంతో లాభసాటిగాని, కవిత్వంవల్ల ఉన్నది పోవడమే తప్ప, లేనిది రావడమంటూ ఉండదని అంటున్నాడు. మధురవాణీ అదే అంది: "డబ్బురాని విద్య దారిద్ర్యహేతువ". అనడంలో కూడ పద్యపాదంలో సూత్రీకరణలాగా అనగలిగింది ఆ చమత్కారి.

ఇంత బతుకూ బతికి పెరట్లో కాలధర్మం చేసినట్లుగా, 'నానృషిః కురుతే కావ్యం' అనే శిఖరాన మొదలైన కవిత్వ వ్యాసంగం చివరికి అపహాస్యం పాలైంది. దీనికి ఎవరో కాదు, కవులే కారకులు. ఎందుకంటారేమో, ప్రతివాడూ కవిగట్టు ప్రారంభించాడు. రాజాశ్రయానికి ఇదే రాచబాట అనుకొన్నాడు. ఛందస్సు లోబడడమే తరు

వాయిగా, యతి ప్రాసలకోసం తంటాలుపడి, పొల్లుపదాలు జోడించి, స్తోత్రపాఠం చెయ్యసాగాడు. పూర్వకాలంలో రాజులకు, వందిమాగధులంటూ కైవారాలు చేసేవాళ్ళు, పరాకులు చెప్పేవాళ్ళు ఉండేవాళ్ళు. విదూషకులంటూ వెర్రివెంగళప్పల వేషం మాత్రమే వేసుకొని, తెలివిగా మాట్లాడి, ఇతరులను నవ్వించి, సొంతపబ్బం గడుపుకొనేవాళ్ళు కూడా. ఈ వందిమాగధుల, విదూషకుల స్థానాన్ని అయ్యో! కవు లాక్రమించవలసి వచ్చింది. చాటువులు తెలివిడి చెయ్యడంలేదూ? కట్టుకథలు చాటింపు చెయ్యడంలేదూ? చిత్ర కవిత్వం, బంధకవిత్వం, ఆశుకవిత్వం, గర్భకవిత్వం, కవికోకిల దువ్వూరి రామిరెడ్డి వెక్కిరించినట్లు "గర్భ నిర్భేదక కవిత్వం" అవతరించాయి.(1) కళ అయిన కవిత్వం దాదాపు ఒక శాస్త్రంగా మారింది. సాముగరిడీల శాస్త్రం. జాతి గుండెను సూటిగా తాకి, సానుభూతిని తట్టి లేపగలశక్తి నీరసించింది. కాకుంటే ఉబుసుపోకకో, వేడుకకో, వినోదానికో మాత్రమే ఈ కుక్కమూతి పిందెలు ఉపకరించగలిగాయి. కావ్యధర్మం, కవి బాధ్యత, మరుగున మరుపున పడ్డాయి అంటే కవులు తమల్ని తాము చులకన చేసుకొన్నారు. కాబట్టే రాజులు, పాలెగాళ్ళు, జమీందార్లు, భూస్వాములు కవుల్ని చులకనచేశారు. సూక్ష్మీకరించవలెనంటే, కవిత్వం ఒక వృత్తిస్థాయికి, జీవనోపాధిగా మార్పు చెందింది. ఇట్టి దుస్థితి, అప్పారావుగారి కావ్యవ్యాసంగానికి పూర్వరంగమై నిలిచింది. ఆ దుస్థితిని కొత్త రూపంలో పునస్సృష్టించదలచిన వాళ్ళే అప్పారావును 'అకవి' అంటున్నారు. ఆ దుస్థితిని చరిత్రాంశంగా, మ్యూజియమ్ వస్తువుగా మాత్రమే తలచేవాళ్లు, అప్పారావును "మహాకవి" అంటున్నారు.

గురజాడ అప్పారావు అకవా? మహాకవా? ఈ చర్చ మళ్ళీ మొదలెట్టడం పూర్తిగా అనవసరం. ఎందుకంటే మహాకవు లెలాంటి వాళ్ళో, సాంప్రదాయికులకూ నవీనులకూ కొలత బద్దలలోనే తేడా వుంది. కాబట్టి అప్పారావుగారిని కవిగామాత్రమే యెంచి, ఆయన ప్రవచించిన కావ్యసిద్ధాంతాలూ, ప్రపంచించిన కావ్యాల గుణాగుణాల గురించి మాత్రమే రాయ సంకల్పించాను.

ప్రాచ్య పాశ్చాత్య, పురాతన నవీన కవిత్వాలను గురించి మాత్రమేగాక, ఆంధ్ర సాహిత్యంలోని మార్గ దేశి విభేదాలను గురించి కూడా అప్పారావు పూర్తిగా గాకున్నా, హెచ్చుగానే చదివి తెలుసుకున్నాడు. లేకుంటే, ఒకే ఊపులో కాళిదాసునూ రాబర్ట్ బర్న్స్‌నూ, వర్డ్సు వర్తునూ, వెల్ష్ (వేల్సు దేశపు) బార్డర్ బేలడ్స్‌నూ, విరాటపర్వాన్నీ కాంతాలలామ శతకాన్నీ కలిపి మెచ్చగల మనోవైశాల్యం ఎట్లా ఏర్పడి వుంటుంది? ఇన్నిటితో అప్పారావుకుగల విశేష పరిచయంవల్లనే ఆయన ఒక కొత్త కావ్యతత్వానికి తెలుగులో బీజారోపణ చేయ గలిగాడు. ఈ తత్వం కావ్యరీతినేగాక, కావ్య వస్తువును కూడా స్పృశించింది. పైపై మార్పులేగాక, సమూల పరిణామాలను కలిగించేందుకు తెలిసితెలిసీ, పూనిక చేసింది. అందుచేతనే అనేక నవ కవుల దృష్టిలో గురజాడ అభినవ వాల్మీకి కాగలిగాడు. మహాకవి అయినా కాకున్నా, అప్పారావు ఆధునికులకు ఆది కవి.

తెలుగులో కవిత్వం గిలకకముందే అప్పారావు ఇంగ్లీషులో గిలికాడు. నవయౌవనంలో ఇంగ్లీషుకవిత్వం రాసి, పునర్నవమైన వృద్ధాప్యంలో తెలుగు కవిత్వానికి మనసప్పగించాడు. విద్యార్థిగా వున్నప్పుడు వేడుకకోసం ఇంగ్లీషులోనూ, విద్యాదాత అయిన తర్వాత తన-మన అక్కరకొద్దీ తెలుగులోనూ అప్పారావు కావ్యాలురాసినా, అవీ ఇవీ చాలా కొద్దిపాటివి ప్రిన్సిపాలైన చంద్రశేఖరశాస్త్రిగారు అప్పారావును మెచ్చి, తన యింటనే ఆశ్రయమిచ్చి, ఆనందగజపతి మహారాజుతో పరిచయం కల్పించింది, మరెవ్వరో సిఫారసుచేస్తే గాదు. అప్పారావు కావ్యప్రతిభ తొలి నిప్పురవ్వలే అతనికి యోగ్యతాపత్రాలయ్యాయి. కవిత్వంతో-అదీ ఇంగ్లీషు కవిత్వంతో-పెద్దల సన్నిధికీ, మహారాజ సముఖానికీ, దారి చెలగుకొన్న ఈ అభిమన్యుడు ఆంధ్రదేశం ఉత్తరాగ్రంనుండి అవలీలగా వంగదేశం నడిబొడ్డులోకి తారాజువ్వవలె దూసుకొని పోగలిగాడు.

ఇరవై యొక్క ఏళ్ళేనని అనవచ్చునేమో గాని, అప్పారావు ఆ వయస్సులోనే రాసిన ఇంగ్లీషు కావ్యమైన "సారంగధర" ఏభైయేళ్ల వాళ్ళను గూడా ఆశ్చర్యచకితుల్ని చేసింది. "అఖండ మేధాసంపత్తిగల

కొద్దిమంది విద్యార్థులలో అప్పారావు వొకడు... నిరంతర సాహిత్య వ్యాసంగము అతని వ్యసనము. సహజ ప్రేరేపణవలన కలిగిన అతని కవితాశక్తి అపారమైనది."(3) ఈ పద్యకావ్యాన్ని "ది ఇండియన్ లెఝర్ అవర్" (The Indian Leisure Hour) ముద్రించింది. అది స్థానిక పత్రిక మాత్రమే అయినా, వంగదేశంలో "రీస్ అండ్ రయత్" పత్రికా సంపాదకుడైన శంభు చంద్ర ముఖర్జీ దృష్టి నాకర్షించింది. తన పత్రికలో ఈ కావ్యాన్ని పునర్ముద్రించుకొనేందుకుగూడా ఆయన సిద్ధపడ్డాడు. ఇంత "చెప్పుకోతగ్గ కల్పన"ను చేయగలిగిన కవి భవిష్యత్తు గురించి ఎంతో విశ్వాసం ప్రకటిస్తూ, రచయితకు కొన్ని సలహాలిచ్చాడు. ఈ సలహా వత్తి లాయరు సలహా వంటిదైతే, లేక, ఒక ప్రసిద్ధ సాహితీపరుడు సరికొత్త రచయితను అర్ధ మనస్సుతో వ్యర్థపదాలతో ప్రోత్సహించే సలహావంటిదైతే, దానిని పునశ్చరించ నక్కర్లేదు. అది అలాంటిదికాదు. ఎందుచేత? అప్పారావుగారి కావ్యతత్వమూ మానవ దర్శనమూ కొంతవరకైనా ప్రగాఢంగా ఈ సలహావల్ల ప్రభావితాలయ్యాయి. శంభుచంద్ర ముఖర్జీ ఒక మహావ్యక్తిత్వాన్ని నిద్ర లేవగొట్టాడు; తప్పటడుగులను దిద్ది చేయూతనిచ్చి నడక నేర్పించాడు.

"... ....మానవ రూపంలో అరుదుగా, అందంగా గోచరించే దైవాంశమును చూడడం మరవకండి. మీ హృదయాన్ని, యితరుల హృదయాలను పరిశీలించండి. వాటి బలాన్ని, దౌర్బల్యాన్ని పరీక్షించండి. ఇతరులు సాధించిన గొప్పతనాన్ని తెలుసుకోండి; కాని ఇతరుల మీద ఎన్నడూ ఆధారపడవద్దు... ..."

"నిరంతర పఠనం అవసరం. మీరు అన్యభాషలో వ్రాస్తున్నారు. కనుక ఆ భాషపై సంపూర్ణ అధికారం మీకు సిద్ధించాలి. గొప్ప గొప్ప కవులు తమ భావాలను ఎలా అభివ్యక్తం చేశారో అకళించుకోండి. భావవ్యక్తీకరణకు తగినంత శబ్దశక్తిని సాధించే వరకూ మీ జీనియస్‌కు సరిపడే నూతనమార్గాన్ని అన్వేషించేవరకూ మీరు ఇతరులను అనుకరించవలసి వుంటుంది. నిజమైన ఉద్రేకంతో,

చిత్తశుద్ధితో వస్తువును దర్శించి, మీరు దానిని వ్యక్తీకరిస్తున్నప్పుడు మీకు విజయం తప్పదు. (4)

పెద్దవాడయ్యాక అప్పారావే గనక ఒక కుర్రకవికి సలహా ఇవ్వవలసి వుంటే, దీనినే వల్లించి వుండేవాడు. అంటే ఏమిటి ? ఈ గురుమంత్రం అప్పారావు లేయెదలో, ఆంజనేయుని గుండెలో శ్రీరాముని మూర్తివలె, తొలుచుకు పోయింది. తాపితమైంది. యతి ప్రాసల నిర్బంధం, కవిత్వానికి ఒక అలంకారమే గానీ దాని హృదయ పదార్థమేమీ కాదని ముఖర్జీ గారి మరొక వాక్యంలో ధ్వని. వితంతు వివాహాలు, రాజకీయ సంచలనాలు గురించి తాను ఆసక్తి కనబరుస్తూ అప్పారావుగారి ఆసక్తినికూడా ఆయన కవ్వించాడు. త్వరలో ఉద్యోగంలో చేరి ఆంగ్ల కవిత్వంతోబాటు శంభుచంద్ర ముఖర్జీని కూడా మరిచిపోతే పోయాడుగాని, అప్పారావు ఒప్పుకొన్నా ఒప్పుకోక పోయినా, ఆయన గురువులలో ఈ ముఖర్జీగారికి గల స్థానం, ఏకలవ్యుని గురువులలో ద్రోణాచార్యునికి గలట్టిదని నే ననుకుంటాను. ఎవరో ఒక అప్పారావు, ఈ నాడు ఇంటి పేరుతోనే మహాకవి బిరుదానికి ఉదాహరణ ప్రాయుడయ్యాడంటే, ఈ మహాకవి హృదయ నిర్మాణంలో పునాదిరాయి శంభుచంద్రముఖర్జీ గారిదని చెప్పాలి. సారంగధరకు జతగా మరొక 500 పంక్తులతో 'చంద్రహాస' పద్య కావ్యాన్నికూడా రాశాడట. రాజకీయ పద్యకావ్యం రాయవలసిందని ముఖర్జీ ప్రోత్సహించాడు. అప్పారావుగారికి సకల్పంగానే నిలిచి పోయిన దీనిని మరోరూపంలో శ్యామలరావు నెరవేర్చాడు. జానపద గేయాలనూ, వివిధ ఛందస్సులలో పద్యాలను రాయమని ముఖర్జీగారు చేసిన సూచన, మరో ఇరవైఅయిదేళ్ళ వరకు ఫలోన్ముఖం కాలేదు.

ఈ నడుమ కాలమంతా అప్పారావు ఏమిచేస్తున్నట్లు ? మిగత విషయాలతోబాటు ఆంగ్ల సాహిత్యాన్ని బోధిస్తూ, కళాశాలలో ఒక్కొక్క మెట్టు పైకెక్కే లెక్చరరునౌకరిలో,పన్నెండేళ్లు గడచిపోయాయి.

1896 లో సంస్థాన చరిత్ర పరిశోధకు డయ్యాడు. కళాశాలో ద్యోగ సమయంలోనే రాసిన కన్యాశుల్కం అచ్చువెయ్యడం 1897 లో జరిగింది. నాటకకర్తగా ప్రసిద్ధి వెనువెంటనే వచ్చింది. కాబట్టి కొందు

భట్టీయం రాయడమో కన్యాశుల్కం రివైజుచెయ్యడమో 1897 నుండి 1906 వరకు జరిగాయి. ఈ మధ్య కొంతకాలం రీవా మహారాణికి పర్సనల్ సెక్రటరీ, మరి కొంతకాలం శాసనపరిశోధన, చరిత్రాన్వేషణ. కాబట్టి తాను జీవించిన చివరి 10 సంవత్సరాలకాలం మొదలయ్యే వరకూ అప్పారావు కావ్యాలవైపు దృష్టి సారించినట్లు లేదు అంటే, కావ్యరచనవైపు. పఠనం పరిశీలనం విమర్శనం సూత్రీకరణం వంటి పాండిత్య సంబంధి వ్యవహారాలు సాఫీగానూ, స్పర్థలతోనూ సాగి పోతూనే వున్నాయిగాని, కావ్యోత్సాహమనేది అప్పారావు గారికి 1910 వరకు కలిగినట్లు లేదు.

కలగక కలగక, గొడ్రాలికి సంతు కలిగినట్లో, మాచకమ్మ సమర్తాడినట్లో గాకున్నా, ముసలివీరుడికి యుద్ధాభిలాష మళ్ళీ కలిగి నట్లో, గడిదేరి మూలకూర్చొన్న రసికుడికి మళ్ళీ స్త్రీలోకంమీద దండ యాత్రకు మనసైనట్లో, అప్పారావుకు ఈ కావ్యోత్సాహం ఎట్లా కలిగింది ? ఇది తెలిస్తే, అప్పారావు కావ్యతత్వంలో ఒక ముఖ్యమైన భాగానికి కీలకం చేజిక్కినట్లే 1910 లో బరంపురంలో నానావర్ణ సహపంక్తివిందు జరుగుతున్నది. అప్పారావు సంతోషంగా పాల్గొ న్నాడు. ఆవరకే కందుకూరి వీరేశలింగం, దేశిరాజు పెద బాపయ్య ప్రభృతులు యజ్ఞోపవీతాన్ని పరిత్యజించారు హైందవ మతాన్ని నిరాకరించారన్న మాట. ఇక రఘుపతి వెంకట రత్నం నాయుడుగారి బ్రహ్మజ్ఞానసమాజోద్యమం శాఖోపశాఖలుగా విస్తరించింది. రైళ్ళలోనూ హొటళ్ళలోనూ తెలియకుండానే మొదలైన వివిధ వర్ణ సహభాగిత్వ, క్రమేపీ సంకల్ప పూర్వ కంగానూ హేతువాద తర్కితంగానూ వర్ణవ్యవస్థపై నిరసనకూ, ఇప్పుడు ఒక సాంకేతప్రాయమైన విందుకూ దారితీసింది విశ్వాసం యెదురెదురుగా తర్కం, అచారానికి ప్రతిస్పర్థిగా స్వతంత్రమైన ఆలోచన, 'శాస్త్రానికి' ఎదురుజ్జీగా సమజీవనం మొదలౌతున్నాయి. అప్పారావుకు ఇది సంఘ సంస్కరణ ప్రయాణ పతాక ప్రతిష్ఠాపనగా కనిపించింది. "పతాక" అనేమాట ఆయన వాడిందే. అది ఒక సంకేతం మాత్రమేగాని, సంఘ సంస్కరణం సర్వస్వం ఇదేకాదు. పైగా ఆయ

నకు అనాటికే బ్రహ్మసమాజీకులతో పరిచయం బాగా వున్నట్టు "కొండుభట్టీయం" తెలుపుతున్నది. వారి లోటుపాట్లనూ, కాప ట్యాన్నీ ఆయన గురించి గిరీశం పాత్రను ఒక బ్రాహ్మనిగా సృష్టిం చాడు అది వేరేచోట. ఈ పాత్రల ద్వారానే కాకుండా, నేరుగా అప్పారావు ఒకచోట థియోసోఫిస్టులను విమర్శించాడు. శ్రీనివాస అయ్యంగారు మొదట స్వతంత్ర యోచనాపరుడైన సంశయ వాదిగా వుంటూ, ఇప్పుడు "అసంబద్ధమైన ప్రతిదానిని విశ్వసించే, మూఢ విశ్వాసాలను శాస్త్రీయ దృష్ట్యా అసంగతంగా సమర్థింపజేసే థియోసోఫిస్టుగా మారిపోయినాడు" అని రాశాడు. (5) అంటే అప్పా రావు మతం, మతమే కానట్టి స్వతంత్ర యోచనా పరమైన సంశయ వాద మన్నమాట! సంశయవాదమంటే ప్రతిదాన్నీ హేతువాద కాంతిలో పరీక్షించిన తర్వాతనే ఆమోదించే హేతువాదమేగాని, ప్రతి దానిని నిష్కారణంగా సందేహించి నిరాకరించే స్కెప్టిసిజమో, నిహి లిజమో కాదు. కాబట్టి నానావర్ణ సహపంక్తి భోజనాన్ని హేతువాద దృష్ట్యానే ఆమోదించి పాల్గొని వచ్చాక, దీని ప్రాముఖ్యం బోధపడి, అప్పారావును ఆంధ్ర కావ్యరచనకు ప్రోద్బలపరచింది.

ఎత్తుగడలోనే అప్పారావు కావ్యాల వైలక్షణ్యం కొట్టవచ్చి నట్టు కనిపిస్తుంది. ప్రాచీన కావ్యసంప్రదాయం క్రమేపీ ఎంతటి దుర్గతి చెందిందో ఆయన గమనిస్తూనే వచ్చాడు. ప్రస్తుత నాగరికతకు సరిపడే కావ్యభాష, ప్రాచీన సంప్రదాయ రచనా వైఖరులలో కనిపించలేదు. కావ్యభాష వ్యవహారభాషకు వీలైనంత దాపులోకి రావాలని అప్పారావు అన్నట్లే, నిన్న మొన్న టి. యస్. ఇలియట్ కూడా అన్నాడు. ఎన్నడో 13 వ శతాబ్దిలో రాసిన వ్యాకరణ సూత్రాలను అంటిపెట్టుకొన్న కావ్యభాషకూ, వాటిని అధిగమించి ఎంతో పెంపొందిపోయిన వాడుక భాషకూ, మధ్యగల అంతరం సమసిపోకున్నా, బాగా కుదించుకొనిపోవాలి. శబ్దసౌష్టవం పేరిట సంస్కృతపద జటిలత్వాన్నీ శబ్దాడంబరాన్నీ తెచ్చిపెడుతున్న కావ్య భాష, 'భాష' అనే మాటకుగల అర్థానికి అతీతమైపోయివుంది కాబట్టి కావ్యభాషనూ, భాషనూ కూడగట్టేందుకే అప్పారావు ఉద్యమిం

చాడు. పద్యమనేది రానేటంతవరకూ, కావ్యభాషకూ భాషకూ మధ్య అఖాతం తప్పనిసరిగా ఉంటుందని ఆయన సరిగ్గా కనిపెట్టాడు. "వాడుకలో నశించిన ప్రాచీనరూపాలు వచనంలోకంటె పద్యంలో అధిక సంఖ్యాకంగా ప్రయుక్తమౌతూ వుంటాయి. అందుకు పద్యరీతి ఒప్పుకుంటుంది ఇప్పటిదాకా తెలుగు పద్య రచన వ్యవహారమున నశించిన పాత పదజాలముతో కొనసాగుతూ వస్తోంది. అందువల్ల మామూలు వాడుక మాటలకు కవితలో అర్థస్ఫూర్తి కలిగే యోగ్యత పట్టడం లేదు."(6)

రాబర్ట్ బర్న్స్ వంటి కవి చేతిలో వాడుకమాటలే ఎంత రసస్ఫూర్తి కలిగించ గలిగాయో, అప్పారావు కనుగొన్నట్టు, అతని డైరీలు తెలియ జేస్తున్నాయి. ఇంగ్లాండు-స్కాట్లాండు సరిహద్దులు, ఇంగ్లాండు-వేల్సు సరిహద్దులు, ఇక్కడ లేచిన జానపద కవిత్వాన్ని పరిశీలించాడు. అందాకా ఎందుకు? ఆంధ్రదేశ సాహిత్యంలో సరస్వతీ నదిలాగ భూగర్భాన అణగి, మణగి, పండితుల నిరాదరణకు పాత్రమైన దేశి సాహిత్యాన్ని పఠించాడు. ఈ అన్నిటిలోనూ, వాడుక మాటలకూ రసస్ఫూర్తికీ చాలా దగ్గర సంబంధ మున్నట్లు, అవే ప్రజల పఠితల శ్రోతల హృదయాలను సూటిగా సులువుగా తాక గలుగుతున్నట్లు తేలింది. 'ఈ జానపద గేయాలలో శబ్దసౌష్టవం లేకపోయినా, కవితాశిల్పం లేకపోలేదు'(7) కాబట్టి పండితప్రకాండులు అనుసరిస్తూ వచ్చిన సాంస్కృతికమైన 'మార్గ' పద్ధతిని వదిలి, పామరులైన ప్రజలాదరిస్తూవచ్చిన 'దేశి' పద్ధతిని పునరుద్ధరించిన భగీరథు డయ్యాడు. కిన్నెరసాని పాట, కోకిలమ్మ పెళ్ళి వంటి గేయకావ్యాలను రాసిన విశ్వనాథ సత్యనారాయణగారు నవ్యసాహిత్య పరిషద్షష్ఠ మహాసభకు అధ్యక్షుడుగా ఉపన్యసించి నపుడు, గురజాడ రసగీతాలను ప్రస్తుతించి, వాడుకమాటలకూ రసస్ఫూర్తికీ గల బాంధవ్యాన్ని సరిగా విలువ కట్టారు.

ద్విపదలనూ, అక్కరలనూ, తరువోజలనూ అప్పారావు వాడుక చేశాడని యెవరూ అనడంలేదు. వాటి ప్రజా సన్నిహితమైన హృదయాన్ని మాత్రమే స్వాధీనం చేసుకొని, దాదాపు స్వకపోల కల్పిత

మైన ఒక కొత్త ఛందస్సును నిర్మించుకొన్నాడు. దానిపేరే "ముత్యాల సరము." వృషభగతి రగడ, కర్ణాటషట్పది, ఈ ఛందస్సుకు మాతృక లని శ్రీ శ్రీ అన్నాడు. ఒక విధమైన పార్శీగజలు నడక ననుసరించి తాను రాసినట్లు అప్పారావే అన్నాడు. ఒకటి అవ్యక్తంగానూ, మరొకటి వ్యక్తంగానూ ఉండి, ముత్యాలసరాన్ని సృష్టించాయేమో! ఇది స్వతంత్రసృష్టి అయినా కాకున్నా, 'సహజధోరణి' అన్నాడు శ్రీశ్రీ.(8)

ముత్యాల సరాలలోని నియమం గురించి అప్పారావే రాస్తూ మొదటి మూడు చరణాలలో సామాన్యంగా పద్నాలుగేసి మాత్రలూ నాల్గో చరణాన ఏడు మొదలు పదునాలుగు మాత్రలూ వుంటాయని, అర్థానుసారంగానూ చెవికి ఇంపుగానూ విరామాన్ని పాటించాననీ చెప్పాడు. ఇంకా ఇట్లన్నాడు తెలిసి తెలిసీ యతిప్రాసలనూ అలంకారాదులనూ ప్రయోగించాడట. ఇది అనుల్లంఘ్యమైన నియమమేఅయినట్లయితే, "యతిప్రాసములకుగాను తెచ్చిపెట్టుకొన్న శబ్దములు అర్థపటుత్వమును చెరచి, సందర్భమును తప్పించి, యీడ్చుకుపోవును." వీటిని తప్పించుకునేందుకే గదూ, కొత్త ఛందస్సును సృష్టించుకొంది? ఆ బెడద ఇక్కడా తప్పనట్లయితే పాత పద్యఛందస్సులే సరిపోయేవి గదూ? ఏదో విధంగా గణాలు సరిపెట్టుకొని, నిఘంటువుల్లో మాటలూ వ్యాకరణాల్లో ప్రత్యయాలూ సేకరించుకొని, రసం చాలని చోటగూడా, "వత్తాలు నిండడంకోసం గంగిరెద్దు గుడ్డలు మెట్లుగా" పడవేసి, అదీ చేతగాకుంటే మాసిన మాటలువాడి, అన్వయాన్ని చెరిచి, పద్యంచేత టొంకర నడకలు నడిపిస్తారు. ఆ కవిత్వం "కపిత్వం" అవుతుంది. పెద్దపెద్ద కవులకే పొల్లు మాట లేకుండా లొంగని వృత్తాలు నానాకవుల చతుల్లోనూపడి, అంత్యగురువుకోసం ఏకాక్షర శబ్దాన్ని అతుకుతూ యతిప్రాసలకోసం నిరర్థక పదాల్ని "ఫర్లాంగు రాళ్ళవలె" నిలవేస్తూ, "కౌపీన సంరక్షణార్థమయం పటాటోపః" అవుతూంది. కాబట్టి, రసస్ఫూర్తి కొరకున్నూ నిర్వహణా సౌలభ్యం కొరకున్నూ, ముత్యాల సరాలను అప్పారావు చేబూనాడు.(10)

అయితే, ముత్యాలసరాన్ని ఒక పటిష్ఠమయిన ఛందస్సుగా రూపొందించక మునుపే, ఈ బిడ్డకు ఆరేళ్ళప్రాయం గడకముందే, దాని తండ్రి చనిపోయాడు. అంతేగాక, దానిని వాడుకచేసేటప్పుడు గూడా ఎక్కువ జాగ్రత్తవహించినట్లు కనిపించదు. కాబట్టి అది "ప్రయోగదశ" లోనే ఉడిపోయినట్లు పిలకా గణపతిశాస్త్రిగారు చెప్పిన తీర్పును శ్రీశ్రీగారు కూడా బలపరిచారు. ఒక్కొక్కచోట నాల్గవ పాదం పరిమితి ఎనిమిది, తొమ్మిది, పన్నెండు పదునాలుగుగా భిన్న భిన్నంగా ఉన్నాయంటారు. నిజమేకానీ అప్పారావుగారే చెప్పినట్లు ఈ హ్రస్వపాదంలో ఏడు మొదలు పదునాలుగు మాత్రల వరకు ఉండవచ్చునని రచయితే సంకల్పించుకొన్నాడు గదా! ఇక "కాసులు" అనే గేయంలో నాలుగుకంటె ఎక్కువ పాదాలు వాడినందువల్లనూ, గతి ఎక్కడికక్కడ మార్పు చెందినందుచేతనూ, అది "స్వరూపరహితం"గా తయారైందని శ్రీశ్రీ అన్నాడు. గనిలో నుండి మొట్టమొదట తీయబడిన లోహానికి అంటిపెట్టుకొన్న అపరిశుభ్రతలూ మోటుతనమూ యీ ఛందస్సుకు అప్పారావు కవితలో ఉండినట్లు అభిప్రాయం ప్రకటించాడు: "వారి ముత్యాలసరం ఛందస్సు అపరిపక్వమనీ, వారి కవిత్వం అగాధమనీ విధిలేక చెప్పవలసి వస్తుంది. మెలకువతో నిర్వహించ లేదనే చెప్పాలి. అలక్ష్య ఫలితములూ, ప్రమాదఫలితములూ అయిన అనేక వ్యాకరణ దోషాలూ, నిర్వహణ వైవిధ్యం లేకపోవడమేగాక, ఎటూకానిచోట విరువబడి పాడయిన పాదాలు అప్పారావుగారిఛందోవ్యవస్థకు బలహీనత అపాదిస్తున్నవి."(11) ఎంతో నిగ్రహంతో చేసిన తీర్పు ఇది!

ఈ నాల్గవపాదాల విషయంలో కొన్ని ఉదాహరణలు చాలు, గతి వైవిధ్యాన్ని సూచిస్తాయి. 'కన్యక'లో "లేకుంటే పొమ్మ", "కాసులు"లో "ప్రేమ నిచ్చిన ప్రేమ వచ్చును" వంటివి ఒకదానికొకటి భిన్నంగా కనిపిస్తాయి. అంతేగాక, అంత తెలిసిన అప్పారావు కొన్ని మాట లెందుకు వాడాడో తెలియడంలేదు. వీలైనంతవరకు కావ్యంలోని పదాలను వాడుక మాటలకు సమీపంగా తీసుకొనివద్దామనే సంకల్పమే ఒక్కొకచోట వికటంగా పర్యవసించిందేమో!

"లవణరాజు కల"లో, "జీరె కోయిల లొకటి వొకటిని" అనే దాన్ని గ్రాంథికంలో అయితే, 'ఒండొంటిని' అని రాయవలసివస్తుంది. దానిలోనే 'వ్రేచెడి' అనే మాట వుంది. వ్రేల్చెడి అనిగానీ, వేచెడి అనిగానీ ఉండవలసిందేమో ఇది! "డామన్ పితియస్"లో, "యింత యిట్టుల మిడుసె" అనే దానికి అర్థ మేమిటో నాకు తెలియకుంది. "లవణరాజు కల"లోనే, "తండ్రి నాకై యెదురు చూసుచు" అనేది కాస్త ఎబ్బెట్టుగా లేదూ? ఆ మాట అన్నది ఒక మాలపడుచే కావచ్చు. గ్రామ్యమే వాడియుండవచ్చు గాని, 'సూచును' అనేదైనా వుండాలి గదా! ఇలాంటివాటినే మనస్సులో పెట్టుకొని శ్రీ శ్రీ ఆ తీర్పు యిచ్చివుంటాడు అయితే, అప్పారావు కావాలనే కొన్నిచోట్ల వ్యాకరణాన్ని ఉల్లంఘించి ఉండవచ్చు. ఆయన గేయాల ఫొటోస్టాట్ కాపీలు చూస్తే, కొట్టివేతలలో కొంత సాక్ష్యం లభిస్తుంది. అదిన్నీ గాక, ఆయనే ఒకచోట వివరించడమూ జరిగింది: "రేఫతో కూడుకున్న కొన్ని గ్రాంధికభాషలోని మాటలు చెవికింపుగావుండవు. అవి రేఫలేక వాడుకభాషలో కనపడి పలుకుటకు సుకరముగాను శ్రావ్యముగాను వుండును. క్రొత్తయని వ్రాయకపోవడమునకు కారణము అది పెటుకని నాకు తోచుటయే...'వ్రాత' వాడుకలో విపర్యముతోలేదు. 'రాత' కద్దు." (12) క్రొత్త. ప్రాత, వ్రాత, మ్రోత వంటి మాటలు వ్యావహారిక భాషావాదులైన అభ్యుదయ కవులు కూడా ఇప్పటికీ వాడుతున్నారు. రేఫతోగూడిన మొదటి అక్షరముగల తెలుగుపదా లకు వాడుకలో రేఫ తొలగిపోతున్నదని భాషా పరిశోధకులు ఇప్పుడు అంటున్నదానినే అప్పారావు ఆనాడు అనగలిగాడు. అంతే ఛందస్సు పట్లగానేగాక కావ్యభాషపట్ల కూడా అప్పారావు ఒక నవ్య వైఖరిని ప్రదర్శించాడు. శ్రీ శ్రీ అన్నట్లు, గణబద్ధఛందస్సుల "ఫ్యూడలిజం" నుండి మాత్రాబద్ధ ఛందస్సుల ప్రజాస్వామ్యయుగానికి సాహిత్య చరిత్రగమనాన్ని మార్చాడు. అంతేగాక, గ్రాంథిక భాషకుగూడా పండిత రాజ సంబంధియైన భూసామ్య వాసనలను తొలగించి, కావ్యభాషను "నవీన నాగరికత"కు అనుగుణంగా మార్చాడు. "నాగరికతా సంపన్న మైనదిగా కావ్యభాషను పెంపొందించుకోవాలంటే, గ్రాంథికంలో చోర

బడిన వ్యవహార భ్రష్టపదాలను, తెనుగు సంప్రదాయవిరుద్ధ సంస్కృత శబ్దరూపాలను పరిహరించి, వాడుకపదాలతో పుష్టివంతం చేసుకొని, దాన్ని వ్యావహారికభాషకు సన్నిహితంగా వుండేటట్లు రూపొందించుకోవలసివుంటుంది." (13) అందుచేతనే గ్రాంథికభాషావాదులకు అప్పారావు ఒక కన్సెషన్ ఇచ్చేందుకుగూడా సిద్ధమయ్యాడు. ఎవరికైనా గ్రాంథికభాషా వ్యాకరణయుక్త పదాలపై మోజు, వ్యవహారంలో నశించిన పదాలపై గురి వున్నట్లయితే, ఈ బులబాటకం తీర్చుకునేందుకు పద్యాలు రాసుకోమనండి! పద్యాలలోనే ఈ ప్రాచీన రూపాలు ఎక్కువసంఖ్యలో అమరుతాయి. ముత్యాలసరం వంటి కొత్త ఛందస్సులలో వ్యావహారికభాషాపదాలు బాగా ఇముడుతాయి. అదీ లేదన్నా గద్యం పూర్తిగా వ్యావహారికభాషకు ఒదుగుతుంది. కాబట్టి పద్యాలనూ, ఇంకా కావలిస్తే గేయాలను కూడ ఇష్టారాజ్యంగా గ్రాంథికభాషావాదులను ఏలుకోమనండిగాని, వచనాన్ని ముట్టుకోవద్దనండి! రాయప్రోలుతో మొదలైన "నవ్య" కవులు గేయాలలో కూడా గ్రాంథికభాషా ప్రయోగాలను కూర్చారు. కొత్త సీసాలలో పాత సారాయి! అప్పారావు ఛందస్సూ కొత్తది, భాషా కొత్తది కావాలన్నాడు. దువ్వూరి రామిరెడ్డి అన్నట్లు A new phraseology to express a new ideology అప్పారావు ఒక్కడే ఆనాడు వాడుక చేశాడు. అయినా తాను చేస్తున్నది తనకే తృప్తినివ్వలేదు. ఇది ఓనమాలు మాత్రమే. అక్షరప్రపంచంలో అద్భుత విప్లవంసాధించే మహాశక్తి, రాగలయుగంలో ఎవడో మహారచయితకుగాను అప్పారావు భద్రపరచిపెట్టాడు: "నూత్న కావ్యభాషను ఒక మహా రచయిత వ్రాయాలి; తయారుచేయాలి; అందుకు మనం అతనికి అనుకూల పరిస్థితుల్ని వాతావరణాన్ని కలిగిద్దాం". (14) రాముడికోసం వానరులు సేతువు కట్టినట్లు! ఆ రాముడు తానేననే ఐడియా ఆయనకు రాలేదు.

అప్పారావుకూ, రాయప్రోలు వంటి 'నవ్య' కవులకూ మధ్యగల అంతరం కావ్య వస్తువులోకంటే ఎక్కువగా మరెక్కడ కనిపిస్తుంది? 'లవణ రాజు కల' లో, పురాణ కథను చేబూని, ప్రస్తుత వర్ణ సమస్యకూ, అస్పృశ్యతా సమస్యకూ, కులాన్నిబట్టి గుణాన్ని వెలగట్టే వైఖరికి,

మంచి చెడ్డల గురించి ఒక వ్యాఖ్యానానికి అనువుగా తీర్చాడు. 'కన్యక' కథలో మళ్ళీ ఒక గాథను చేబూని, రాజుల దౌష్ట్యాలను సూచించేందుకు పూనుకొన్నాడు. 'పూర్ణమ్మ' లో అతి బాల్యవివాహాలను రోయించుకొనేటట్లు చేశాడు. 'డామన్ - పితియన్' అనే గ్రీకు పౌరాణికాశాన్ని చేబూని, స్నేహ మహాత్మ్యాన్ని, మాట నిలకడనూ ప్రస్తుతించాడు. 'కాసులు'లో ప్రేమ గురించి తన తత్వం ప్రకటించాడు. ఇక 'నీలగిరి పాటలు' వున్నాయి. అవి ఉబుసుపోకకు మాత్రమే రాసినవి కావు. ప్రకృతి వర్ణనం పేర్పులు పేర్పులుగా కనిపిస్తుంది. పండితుల గోలను అణచేందుకు 'సుభద్ర'. చెప్పక విడిచినవి, 'ముత్యాలసరాలు' ఒకటి, 'దేశభక్తి' రెండోది. మొదటిది సంఘసంస్కరణోద్యమం కలిగించిన ఉత్సాహఫలితం. అప్పారావు తన ముందుంచుకొన్న మానవాదర్శాల కిది ఆదర్శకంగా నిలిచి వుంది. 'దేశభక్తి' గేయం గురించి ఎవరూ ఏమీ చెప్పనక్కర లేకుండానే, అది జాతిజనులు పాడుకొనే మంత్రంగా మహిమాన్వితమైంది.

ఇప్పుడు తెలుస్తుంది, అప్పారావు రి కావ్యవస్తువు ఎలాంటిదైందీ. సరళోద్రేకాలు, అంటే నిర్మలానందం, నిర్భ దుఃఖం; సరాజ ఘటనలు, అంటే మానం కాచుకునేందుకు కన్యక అగ్ని ప్రవేశం, దుఃఖం మరచిపోయేందుకు పూర్ణమ్మ దుర్గకొలను సంలీనంకావడం; నిస్తులాదర్శాలు, అంటే ప్రాణస్నేహితం, నిస్వార్థ లౌకిక జీవనం, హృత్కమల సౌరభం, స్వదేశాభిమానం; అందమైన పస్తువులు, అంటే ప్రకృతి సమకూర్చినట్టివీ, మానవుడు తీర్చి వంకరలు దిద్దినట్టివీ — ఇలాంటివి అప్పారావు కావ్యవస్తువు లయ్యాయి. ఇందులో ఏ ఒక్కటీ ఈ దేశానికీ ఈ ప్రజలకూ ఈ పరిస్థితులకూ దూరమైనట్టిది గానీ, భారమైనట్టిదిగానీ లేదు. ఒక్క డామన్-పితియన్ మాత్రమే విదేశీయ ఇతివృత్తం. అయితే అందులోని భావనాక్రమమంతా భారతీయమైనట్టిది.

గమనించవలసిన మరొక ముఖ్యమైన విశేషం, అప్పారావు ప్రేమ తత్వం. దాన్ని గురించి విపులంగా మరొకచోట. 'ప్రేమ'గా ఆంధ్ర సాహిత్యంలో చలామణియైన హృదయానుభూతికీ దీనికీ

ఎలాంటి సంబంధమూ లేదు. అప్పారావుకు 'ప్రేమ' అనేది రెండక్షరాల మంత్రం, లోక యంత్రచాలకశక్తి. అయితే ఆ నాటికే ఈ మాటను ఖరాబు పట్టించగల వైఖరి కొత్త రూపంలో-భావికవిత్వ రూపంలో - దర్శన మివ్వకున్నా, క్షీణ ప్రబంధాల సంభోగ శృంగార వాసనలను మిగుల్చుకొని, ఇంకా ఘాటుగానే కనిపిస్తూ వుండింది వీరేశలింగం గారిని కూడ ఈ సందర్భంలో అప్పారావు క్షమించి విడిచి పెట్ట లేదు. పశ్చిమబూతు శృంగారానికి అప్పారావు చూపిన నిదర్శనం, దుష్టవర్తనుడికి తగిన శిక్షను రచయిత చేకూర్చకపోవడమనేది. అంటే, రచయిత ఆ శృంగారాన్ని ఒకవైపు ఆమోదిస్తూనే, మరోవైపు అనుభవిస్తూకూడా వున్నాడన్నమాట. వీరేశలింగంగారి "అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము"లో ఈ పరకీయ శృంగారము కనిపిస్తున్నదని ఆయన చూపెట్టాడు. (15) ఔచిత్య శోభితంకాని హద్దుమీరిన శృంగారపద్యాలున్న కావ్యభాగాలను పాఠ్యభాగాలుగా వేయరాదని, మద్రాసు యూనివర్శిటీ గ్రంథ నిర్ణాయక సంఘంలో గట్టిగా వాదించాడుగాని, గ్రాంథికవాదులే నెగ్గారు. అప్పారావు శృంగారానికే విముఖుడనికాదు. శృంగారానికి జీవితంలో ప్రముఖస్థానమే వున్నప్పుడు, అది కావ్యాల కెక్కకపోదు. అయితే అది వికారాద్రూపం ధరించకూడదు. అతిలోలత్వం ఇంద్రియ చాపల్యం వర్ణితాలైనప్పుడు, వాటిని ఈసడించుకొనేటట్లు మరొక పాత్రద్వారానో, సన్నివేశం ద్వారానో కవి జాగర్తవహించాలి. అప్పుడే వాటిమీద పఠితకు మోజు కలగకుండా వుంటుంది. దోషాన్నీ, దుర్నడతనూ ఆకర్షవంతం చేయకపోవడమనేది నాటకాల్లోనేగాక, కావ్యాల్లోకూడా అప్పారావు పాటించేందుకు ప్రయత్నించాడు. అంటే, ఎప్పటికప్పుడు, ఒకవైపు సృజన చేస్తూనే, మరోవైపు ఆత్మవిమర్శన సాగించాడన్నమాట, లేదా, సాగించాలన్నాడు.

అప్పారావు ముఖ్యంగా నాటకకర్త, తర్వాతనే కవి. రాశిని బట్టి గుణనిర్ణయం చెయ్యగూడదుగానీ, మహాకవి పరీక్షలో అదీ ఒక ప్రశ్నాంశమే. ఆయన రాసింది కాసింతే అయినా, ఆ యింతలోనే చాలా వింతలుచేసి చూపగలిగాడు. తాను సాధించినదానిని గురించి

ఆయనకు చిన్నచూపు లేదు. ఏదో కొత్తదారి వేశాననీ, అది అనేకు లకు అనుసరణీయ మౌతుందనీ గ్రహించాడు కాబట్టే, ఛాతీ విరుచు కొని ఇట్లనగలిగాడు:

"సాహిత్యరంగంలో యిప్పుడు నేను కావిస్తున్న కృషికి సమ తుల్యమైన కృషి భారతదేశంలో మరెక్కడా కనిపించదు." (15)

బెంగాల్ సాహిత్య ప్రభావాలు అప్పారావు కావ్యభాషా తత్వాన్ని, కొంతవరకు తీర్చిదిద్దాయి. స్వయంగా బెంగాలీభాషా కోవిదుడై, రవీంద్రుని సూర్యరశ్మికి అప్పారావు వెలిబడలేదు. గ్రాంథిక భాషావ్యతిరేకత బెంగాలులో మొదలైన చాలాకాలానికి టెక్‌చంద్, బంకించంద్ర ఛటర్జీలు చూపిన దారిలో, రవీంద్రుడు కావ్యశైలిలో విప్లవం సాధించి 'చల్తీభాష'కు కావ్యగౌరవం కల్పించాడు. అది అప్పారావు ముఖతః వ్యావహారికంగా కావ్యాలలో ప్రయుక్తమైంది. అయితే ఒక్కపెట్టున అప్పారావుకూడా దీనిని కావ్యస్థం చెయ్యలే దనేందుకు ఆయన కావ్యాలేగాక, లేఖావాక్యాలు కూడా సాక్షి. గున్నయ్యశాస్త్రికి పంపిన లేఖలో అప్పారావు చెప్పినదాని సారాంశం ఏమంటే, క్రమానుగతంగా చూసినప్పుడు ముత్యాలసరాల గేయాల శబ్దవిన్యాసంలో క్రమపరిణామం గోచరిస్తుందని. గ్రాంథిక వ్యాకరణ సూత్రాలను, ప్రాచీనకవి ప్రయోగాలను వుల్లంఘించే పదాలనే తొలి గేయాలైన పూర్ణమ్మ, కన్యకలలో ఎక్కువగా వాడుకచేయడం జరిగిందిగాని, వాడుకమాటలను కాదు. అయితే, క్రమేపీ వాడుక మాటలు బహుళాలయ్యాయి "మనిషి" అనే మూడు చరణాల గేయంలో అన్నీ వాడుకమాటలే! ఈ గుణం హెచ్చేకొద్దికీ, ఆ గేయా లకు రసస్ఫూర్తికూడా అతిశయించింది.

---

## పాదపీఠికలు (Foot notes)

(1) కర్షక విలాసము : దువ్వూరి రామిరెడ్డి —— అముద్రిత నాటకం (2) గురజాడ డైరీలు (3) మాటా మంతీ; ఆవీ యివీ, పు. 6-7 (4) అదే:

పు. 13-14 (5) గురజాడ డైరీలు : పు 215 (6) గురజాడ లేఖలు : పు. 202-203 (7) గురజాడ డైరీలు : పు. 226-227 (8) గురజాడ-శ్రీ శ్రీ : మన సాహితి ప్రచురణ పు. 3 (9) వ్యాసచంద్రిక : పు. 3 (10) అదే : పు 54 (11) గురజాడ -శ్రీశ్రీ : పు. 24-25 (12) శ్రీ మహాకవి గురజాడ అప్పారావుగారి గేయములు: వావిళ్ళ ప్రచురణ 1950 (13) మాటామంతీ : అవీ ఇవీ ; పు. 107 (14) గురజాడ లేఖలు పు. 36-43 (5) వ్యాస చంద్రిక : 'కావ్యాలలో శృంగారం' (16) గురజాడ లేఖలు : పు 207.



# 13. కథన కౌశలం

## 1

కాశీకి విజయనగరం ఎంత దూరమో, కాశీమజిలీ కథలకు గురజాడ అప్పారావు కథలు ఇంకా జాస్తి దూరం. అయితే వాటి రచనాకాలంలో ఇంత ఎడము కనిపించదు. కాశీమజిలీ లనే ఏమిటి? అప్పారావు సమకాలికులలో పెద్ద తరానికి చెందిన పరవస్తు చిన్నయ సూరి, కందుకూరి వీరేశలింగం, పంచ తంత్రాన్ని కొత్త మూసలలో పోస్తూ వుండినారు. అదే తరానికి చెందిన వేదం వేంకటరాయశాస్త్రి కథా సరిత్సాగరాన్ని ఆపోశన పట్టుతూ వుండినాడు. సెట్టి లక్ష్మీనరసింహం గ్రీకు పురాణాలను ఆశ్రయించగా, చిలకమర్తి లక్ష్మీనరసింహం రాజస్థాన వీరకథలను చేబట్టాడు.

అప్పారావు కథలను రచించినకాలం ముఖ్యంగా పందొమ్మిదో శతాబ్దమే అయినా, కథా కాలం కూడా ఆ శతాబ్దం కావడమే వాటి విశిష్టతకు ఒక హేతువు. అయితే ఆ కథలలో కనిపించే సమస్యలు ఇరవయ్యో శతాబ్దానికిగూడా చెందడమనేది మరీమరీ చెప్పుకోదగ్గ విషయం కాగా, వాటికి అప్పారావు సూచించిన పరిష్కారాలు ఇప్పటికీ సాహసాలనిపించేటంత కొత్తవి కావడం అతని వ్యక్తిత్వానికి ఘనతను ఆపాదించగల ప్రధానాంశం.

ఒకటి రెండు తెలుగు కథలకు విశ్వప్రశస్తి చేకూరిన నవీన కాలంలోనుంచి పరిశీలించినా, అరడజనుకంటే ఎక్కువ లేని గురజాడ కథలు ఒక్కొక్కటీ ఒక్కొక్క దీపస్తంభంగా నిలిచి తరువాతి కథకు

లకు యావన్మందికీ మార్గాన్నీ గమ్యాన్నీ కాంతిమయం చేసినట్లు తెలిసి వస్తుంది. ఆ యొక్క విక్టోరియా రాణి కాలపు రైలుబద్దీలమీదనే మన రైళ్లు ఈనాటికీ నడుస్తున్నట్లుగానే, గురజాడ కథల జాడలను బట్టే మన కథకుల నడకలు సాగుతున్నాయి.

ముందు మార్గదర్శకుడంటూ ఒకడెవ్వడూ లేకుండా, స్వయంభువులాగా, గురజాడ అప్పారావు తెలుగుకథను ఎట్లా సృష్టించగలిగాడు? పురాణాల, వీరగాథల అనువాదాల దొల్లలను తొలగించి, తెలుగు కథకు తనదని చెప్పుకోదగిన మూర్తినీ, దేహస్ఫూర్తినీ ఎట్లా కల్పించాడు?

ఏమో ఏమో అని సమాధానం చెప్పుకోవలసి వస్తున్నది. ఇంతవరకు ప్రకటితమైన ఆయన వాఙ్మయంనుండి ఎలాంటి ఆధారాలూ లభించడంలేదు. కాకుంటే, ఒకటి చెప్పగలం విదేశ సాహిత్య పరిచయం ఎట్లాగూ విశేషంగా వుంది. నవ్యసాహిత్య ప్రక్రియలపట్ల ఆసక్తి అపారంగా వుంది. గతానుగతికత్వమనే జడబుద్ధి తనకు లేదు. ఈజిప్షియన్ గుర్రపు శాలలను ఒక్క రాత్రిలోనే శుభ్రపరచ గలిగిన హెర్క్యులస్ సంకల్ప స్థైర్యం వంటిది, అనారోగ్యం వాతబడిన తన దుర్బల దేహంలోగూడా చోటు చేసుకుంది. కాబట్టి తనకు శ్రమ అనిపించకుండానే, ఈ కథలు రాయడం జరిగివుంటుంది. లేకుంటే, ఎందుకు రాయవలసి వచ్చిందో, మొదలైన సంగతి సందర్భాలను వివరించి వుండేవాడు.

అయితే, అప్పారావు ఆసక్తిని కవ్వించిన తెలుగుకథలు లేకపో లేదు. ఎవరు రాసినవో తెలియని కల్పనా కథలను మదరాసులోని వివిధ స్థలాలలో డబ్బిచ్చి కొని చదవడం జరిగిందని ఆయన డైరీలు తెలుపుతున్నాయి. మిస్టర్ అండర్‌వుడ్‌కు కథలు అనే శీర్షిక కింద ఏమేమి చిత్రమైన అంశాలున్నాయో చూడండి. 'వైద్యుడు, గుర్రం; వైద్యుడు, కరక్కాయ; రాజు మంగలిని మంత్రిని చేయుట; మిడుతం భట్లు సవారి; ముందూ వెనకా; జ్యోతిష్కుడు; మంచి గంధపుచెట్లు అమ్మడం; ససేమిరా; ఏకఃపంథానుకర్తవ్య; రాజుభార్య రాజును చంపుట; మంత్రి భార్యా బతికించుట; పక్షులు మాట్లాడుకోవడం;

రాచకన్య తాలూకు బట్టలనిమిత్తం రాకుమారుడు—ఒక జాబితాయే అయితే ఫర్వాలేదు. అదే పుట 12 లోనే మరొకటి; రెండు పుటల ముందు ఇంకొకటి, కథాసప్తతి, తెనాలి రామలింగని కథలు, పరమానందయ్య శిష్యుల కథలు. వాటికీ, గురజాడ కథలకూ ఎంతవార! స్వర్ణకారవిద్య తెలిస్తేనే తప్ప, వాటినుంచి ఇవి పుట్టుకు వస్తాయా? కాదు. వీల్లేదు. అప్పారావువి పూర్తిగా స్వతంత్ర రచనలు.

జీవితం నుండి మాత్రం అవి స్వతంత్రించలేదు. నిజానికి జీవితంలోనే, అనుభవంలోనే ఈ ఇతివృత్తాలు ఆయనకు లభించాయి. కన్యాశుల్కం పక్షంగా ఆయన రాసిన లేఖాంశాలు కథలకు కూడా అన్వయిస్తాయి.

"పుష్కలమైన అనంతమైన సంఘటనలతో నిండివున్న ఎంతో గాంభీర్యమూ వైవిధ్యమూ గల నేటి జీవితాన్ని వీక్షించక ప్రపంచ ప్రసిద్ధి కెక్కిన ప్రాచీన కాల్పనిక కథల నుంచి రచయితలు యితివృత్తాలను ఎందుకు స్వీకరిస్తారో అర్థంకాక నాకు ఆశ్చర్యం వేసింది. ఈ కారణాలవల్ల నేను వాస్తవిక జీవితంనుంచి సమకాలిక యితివృత్తాన్ని స్వీకరించి దానిని తెలుగున వాడుక భాషలో నాటకంగా రూపొందించాను."

"పెద్ద మసీదు" అనే చాలా చిన్నకథ తప్ప తక్కినవన్నీ సమకాలిక జీవితం నుంచి తీసుకొన్నవే. "సంస్కర్త హృదయం" అనే పెద్ద కథ అప్పారావు ఇంగ్లాండులో ప్రచురిద్దామని తలపెట్టి ఇంగ్లీషులో రాసివుంచిన కథకు అనువాదం. వీటిలోకల్లా పేరెన్నికగన్న కథ "మీ పేరేమిటి?" అనేది. మత దురావేశాలకు సంబంధించి, శుద్ధ గ్రామసీమలో అసంస్కృత ప్రకృతుల మధ్య జరిగే కథ. ఏదో పూర్వ కాలానికి సంబంధించినట్లు కనిపిస్తుంది అందులోని వాతావరణమంతా. దీనినీ, 'పెద్దమసీదు'నూ ఒక కూటమిచేసి మినహాయిస్తే, మిగతావన్నీ బస్తీలలో విద్యాధికులతో అత్యంత నవీనమైన కాలంలో జరిగినకథలు. వేశ్యా సంస్కార సమస్య, 'కన్యాశుల్కం' అనుబంధంలాగా కనిపిస్తూ 'సంస్కర్త హృదయం'లోనూ, 'దిద్దుబాటు' లో పూర్వరంగంగానూ

కనిపిస్తుంది. పరమసామాన్యమైన దాంపత్యజీవన నైష్ఠుర్యం' మెటిల్డా'లో దర్శనమిస్తుంది.

ఈ కథలన్నిటిలోను ఒక్క 'మెటిల్డా'కే కాస్తో కూస్తో మూలమంటూ ఒకటి లభిస్తుంది. మద్రాసులో విజయనగర సంస్థానంవారికి చెందిన 'అడ్మిరాల్టీ హౌస్'లో అప్పారావు 1895 లో కొన్నాళ్లు విడిది చేశారు. అక్కడ పనిచేసే వంటలక్క ఆయన చెవిని ఆకట్టుకొంది. ప్రేమగీతాలను, భక్తిగీతాల మధ్య సాగదీయడమే గాకుండా, ఒకటి వుంటే పది తగిలించి చిలవలూ పలవలూ పెట్టి వినసొంపుగా కథలు చెప్పేది. వి. యస్. ఆర్. అనే పెద్ద మనిషి పెళ్ళాడిన మధ్యు లమ్మాయి—'శ్రీర' జమీందారుగారి కుమార్తెకు బొంబాయి నగరంలో రోజుకు వంద రూపాయల అద్దెఇంటిలో ఒక రోజున నిలువుటద్దంలో ముఖం చూసుకుంటూ ఉండగా కలిగిన భయంకరానుభవం—పెద్దపులి ఆకృతి కనిపించడం, వంటలక్క చెప్పగా విని అప్పారావు అసక్తి హెచ్చింది. మధ్యులమ్మాయి పూర్తిగా మారిపోయి, ఆ అవస్థలోనే చనిపోయింది.

"ఈ విషాద గాథను విన్నంతనే నా హృదయ భారము మిక్కుటమయింది. మనసులో ఏవేవో ఆలోచనలు చెలరేగి గుండెలలో చేయిపెట్టి కలచినట్లయి, కొంతసేపు మౌనముగ అలాగునే నిలబడిపోయాను. భరించలేని విషాదానుభూతి కలిగింది."(2)

అయితే ఈ కథకు రూపాంతరాలు కూడా త్వరలో చెవిని పడ్డాయి. భర్తకు ఏదో అనుమానం వచ్చి, ఆ అమ్మాయికి ప్రాణాంతక మైందని ఒకటి. "హరి హరీ! ఇదే యదార్థమైతే, కాదనే హృదయ పూర్వకంగా నమ్ముతున్నాను, అతనే ఈ అకృత్యం కావించిన నరపిశాచి అయివుండాలి! ఎంత మూర్ఖాతి మూర్ఖుడు!" (3) అనుమానితుడి వద్దకే వెళ్ళినప్పుడు, అతనినోట అదే ఉదంతం "చాల రొమాంటిక్ కథవలె" వినిపించింది. ఎట్లయితేనేం, ఒక కథకు కావలసిన ఇతివృత్తం లభించింది. అనుమానించే రోగం గల భర్త, అందాల భరిణవంటి అమాయకురాలయిన భార్య. పురుషుని నిరంకుశత్వం, వైవాహిక వ్యవస్థలో లోట్లు ఇవన్నీ ప్రస్తావించవచ్చు.

విన్నది విన్నట్లుగానే రాసేటట్లయితే, కథంటూ ఒకటిఎందుకు? విన్నది అంతరాంతరాలలో దూరి, రచయిత ప్రీత్యప్రీతులలో కలిసి, వాస్తవానికి పూర్తిగా భిన్నంకాని సరికొత్తరూపంతో సాక్షాత్కరించినప్పుడే, సాధారణ అనుభవానికి కళాంశ కలుగుతుంది. జీవితం నుంచి పరిగ్రహించిన పాత్రలైనా, పరిగ్రహించిన విధంగానే రచయిత చిత్రించడని గురజాడ అన్నదానికి అర్థమిదే. జీవితానికి యథామూలమైన నకలుదించడమే అయితే, దానికి కథన కౌశలమంటూ పెద్ద పేరుపెట్టడం అనవసరం. జీవితాన్ని నాటకీయం చెయ్యడంలోనే యిది సార్థకమౌతుంది.

అప్పారావు కథలన్నీ అట్లా నాటకీయం అయిన జీవితఖండాలే. నాటకీయం చెయ్యడమంటేనే, అవిశ్వసనీయమైన విషయాన్నికూడా విశ్వసనీయం చేయడమనుకోగూడదు. జీవితక్రమానికీ వాస్తవ సరళికీ అన్యాయం జరగకుండానే, ఘటనలనూ పాత్రలనూ బలంగా తీర్చిదిద్దడంవల్లనూ గాఢమైన ప్రభావాన్ని కథద్వారా కలిగించడంవల్లనూ ఈ నాటకీయత సిద్ధిస్తుంది. తాను నిర్దేశించిన ప్రభావం యెక్కడా పలచబడి మరుగునబడని విధంగా కథను ఆసాంతం నడపగల కథకుడు గొప్ప కథకుడనిపించుకొంటాడు.

ప్రఖ్యాత రష్యన్ కథకుడైన ఆంటన్ చెఖవ్ ఒకసారి అన్నాడు. కథల సాధారణ ఉపక్రమ ఉపసంహారాలను నిర్దాక్షిణ్యంగా ఉత్తరించి వేయాలట. ఒక ఉపోద్ఘాతమూ ఒక ఫలశ్రుతీ అక్కర్లేదు. కథాశరీరం మాత్రమే, ఎంత కొద్దిపాటిదేగాని, చాలు! అప్పారావు కథలకు ఉపక్రమ ఉపసంహారాలంటూ మూరెడు బారెడేసి అనవసర కాథాబాహ్య విషయాలు లేవు. ఉపక్రమించే పద్ధతిలో సిద్ధహస్తుడనిపిస్తూ, నేరుగా కథలోకి దిగే నేర్పు ఆయన సొత్తు. "దిద్దుబాటు" కథలో "తలుపు! తలుపు!!" ప్రారంభం గురించి అనేకులు అనేకవిధాల అప్పారావును పొగుడుతున్నారు. మళ్ళీ దానిని ఎత్తుకోవడ మెందుకు? ఆ కథలోని ఉపసంహార వాక్యాలుగూడా బహుళ ప్రశంసకు గురిఅయ్యాయి. ఈ అలవాటుకు భిన్నంగా "సంస్కర్త హృదయం" కథా ప్రారంభం, దాదాపు రెండు పేజీలకు పెరిగింది. అయితే, ఇంగ్లీషువాళ్ళ కోసమని

రాసిన కథ కాబట్టి, కథావాతావరణంగురించి ఈమాత్రం వివరణ తప్పని సరి అనుకోవచ్చు. ఐతే, "మీ పేరేమిటి?" కథా ప్రారంభం మాటేమిటి? ఆ కథలో ప్రధానపాత్రలు నాలుగైదు పుటల తర్వాత గాని దర్శనమివ్వరు. ఆ లోపల మతాలు, శాస్త్రీలు, విశ్వాసం, హేతు వాదం, పెనుగులాటలు కనిపిస్తాయి. జంగం శరభయ్య, సాతాని మన వాళ్ళయ్య, రంగాచార్యులు, కృష్ణమాచార్యులు, అతగాని భార్య నాంచారమ్మ అంతవరకూ పరోక్షంగానే కనిపిస్తారు. ఈ కథ యావత్తూ పరోక్ష పద్ధతిలోనే నడిచినా, రెండూ మూడూ భాగాలు కథన కౌశలంవల్ల ప్రత్యక్షమైనంతటి ప్రగాఢత్వంతోటి కథను నడిపాయి. మూడవ భాగం చివర మాత్రం, ఒకటి రెండు పుటలవరకూ కథానంతర వ్యవహారంకూడా ప్రసక్తమైంది. ఇవి లోపాలైతే కావచ్చునేమో గాని, మిగత కథలలో ఇలాటివి మచ్చుకుగూడా కనిపించవు. మొదలుపెట్టింది లగాయతు చివరికంటా గుండెలను కరిగించివేసే విషాద కారుణ్యాలతో 'మెటిల్డా' వృత్తాంతం, లలిత హాస్య చమత్కారాలతో భార్యా సేవకుడూ కలిసి యజమాని పెడబుద్ధులను దిద్దిన 'దిద్దుబాటు' వ్యవహారం, ఉత్తమ శ్రేణికి చెందిన కథలు.

అప్పారావు కథా రచనా పద్ధతి గురించి, అవసరాల సూర్యారావు రాసిన వాక్యాలు ఒకటి రెండు, సమగ్ర చిత్రాన్ని ఇస్తున్నాయి:

"కథానిక రచనలో నాటకీయత, క్లుప్తత వీరిపద్ధతి. అలాగని విషయాన్ని కుదించరు. పాత్రలను మరుగుజ్జులుగా తయారుచేయరు. పాత్రల సన్నివేశాల సంఘటనల అల్లికలో గొప్పతార్కికశక్తిమహత్తర కల్పనా, యోజనా, విస్తీర్ణతా, అడుగడుగునా కన్పిస్తాయి. సన్నివేశానికి తగిన వాతావరణం, వాతావరణానికి తగిన పాత్రీకరణ, కథానికలలో రమ్యంగా అమరి పఠితహృదయంపై చెరగని మొహరులను వేస్తుంది. (4)

## 2

గురజాడ కథావాఙ్మయానికేగాక, కావ్య నాటక వాఙ్మయ సమస్తానికిగూడా సామాన్య లక్షణాలలో ఒకటి, పురుషపాత్రలమీద

స్త్రీ పాత్రల ఆధిక్యం! వేశ్యఅయినా, దుర్నీతిపరురాలైనా, అర్భకురాలైనా, జాణఅయినా, స్త్రీకి గురజాడ ఇచ్చిన ప్రాధాన్యం పురుషునికివ్వలేదు. కథలనే పరిశీలిస్తే, నాంచారమ్మవంటి గుండెదిటవుగల ఆడది జావ గుండెగల మెటిల్డాపక్క, ప్రబలాకర్షణ శక్తిగలిగిన సరళ వంటి వేశ్య, సామాన్య గృహిణియైన కమలిని పక్కనిలిచి, ముఖ్యంగా దాంపత్య జీవన నైష్ఠుర్యానికీ, వైవాహిక సంస్థా దౌర్బల్యానికీ వివిధ రూపాలుగా కనిపిస్తున్నారు. లైంగిక ప్రోద్బలాలనుగురించి వివాహ పద్ధతిగురించి, దాంపత్యంలో స్త్రీ పరాధీనతనుగురించి, గురజాడ అభిప్రాయాలను పరిశీలించేందుకు మరొక వ్యాసం పూనుకోంటుంది. అయితే ఈ అభిప్రాయాల మూలంగానే గురజాడ స్త్రీ పాత్రల ప్రముఖస్థానం మనకు ఆవిష్కృతం కాగలదు.

స్త్రీని మానవవ్యక్తిగా భావిస్తేనే తప్ప, ప్రస్తుత స్త్రీ దైన్యం కళ్ళగట్టదు. మానవ వ్యక్తిగా పురుషుడి సమవుజ్జీగా భావించనందువల్లనే, అనేక అనర్థాలు బయలుదేరివున్నాయి. భర్త దయాదాక్షిణ్యాలమీద అధారపడక తప్పదు. వివాహ మంటేనూ, దాంపత్య జీవిత మంటేనూ ఏకపక్ష వ్యవహారంగా పర్యవసిస్తోంది. సంఘశాసన సంపుటమైన నీతిసూత్రాలకూ మానవ మనోధర్మాలకూ స్పర్ధ.

"స్త్రీలు బానిసలు. స్వాతంత్ర్య మన్నదేమిటో వాళ్ళు ఎరుగరు. భార్యలు తమ భర్తలయం దుండగోరు సద్వర్తన పవిత్రతల కంటె ఎక్కువ సద్వర్తన పవిత్రతలను భార్యలయందు ఉండవలెనని భర్తలు వాంఛిస్తున్నారు ...

... స్త్రీ ఖిన్నురాలు కావడానికి కారణం తాను ఇవ్వగలిగినదానికంటె అధికంగా పురుషుడు తననుంచి వాంఛిస్తున్నాడుకదా అని." (5)

సామాజిక నీతి సూత్రాలు దుస్సాధ్యంగా వుండి, అందుబాటులోకి రాక, మనఃప్రవృత్తులతో వికటించి, ఎన్నో విషాదాలకు ఆకరమౌతున్నాయి. గతంలో సంఘానికి యెంతో ఉపకరించిందికదా అని వివాహసంస్థలో ప్రస్తుతం వున్న లోపాలను విస్మరించకూడదు. నీతియుతమైన స్త్రీ-పురుష సంబంధాలను వాంఛించడంచేతనే, ఆ నీతి సూత్రాల లోపాలను బహిరంగంగా విమర్శించవలసివచ్చింది. కాబట్టి,

ఎంతో విశ్లేషణంచేయగా ఏర్పడిన అభిప్రాయాలతో, గురజాడ ఈ సమస్యను అనేక కోణాలనుంచి స్పృశించాడని తెలుస్తున్నది.

బ్రాహ్మ సామాజికుల పారిశుధ్య వైఖరికీ, గురజాడ వైఖరికీ మధ్య కొంతభేదం లేకపోలేదు. వాళ్ళు ఒక మహోత్తుంగమైన ఆదర్శ శిఖరంనుండి కింది మానవలోకాన్ని వీక్షించడంలో, అనేక హృదయ దౌర్బల్యాలనూ రక్తనిష్ఠమైన ఉద్రేకాలనూ దాదాపుగా విస్మరించక తప్పలేదు. రోగాన్ని నిర్మూలించబోయి రోగినికూడా కంటగించుకునే పద్ధతి చేబట్టక తప్పలేదు. వాళ్ళది శస్త్రచికిత్స, గురజాడది మనశ్చికిత్స. యథార్థాన్ని యథార్థంగా ఆమోదించిన తర్వాతనే, మనుషులను మనుషులుగా గుర్తించిన తర్వాతనే, వైద్యం చేస్తున్నట్లు రోగులకు తెలియకుండానే, సానుభూతి ఔషధాన్ని వాడుకచేశాడు. ఆయన మానవవాదం ఒక మతస్థాయికి ఘనీభవించలేదు. తీవ్రఖండనం గాక, మందలింపుగాక, హృదయాలకు పిలుపులాగ అది విలక్షణమైంది. కోపాన్నిమించిన హృదయతాపం, అసహిష్ణుతనుమించిన ప్రేమానుభవం, దీనికి లక్షణాలయ్యాయి. అందుచేతనే కథల్లోనూ, నాటకాల్లోనూ తన ప్రత్యేక సిద్ధాంతాన్ని బ్రాహ్మ సామాజికులైన సంఘ సంస్కర్తల సిద్ధాంతాలనుండీ, కార్యాచరణ పద్ధతులనుండీ గురజాడ స్పష్టంగా వేరుచేసుకొన్నాడు. అప్పుడప్పుడూ అవతలివారిని అధిక్షేపించడం, అపహసించడం కూడా జరిగింది.

## 3

ఇప్పుడు గురజాడ కథలను స్పృశిద్దాం. అందులోనూ ముఖ్యంగా స్త్రీ పాత్రలను.

"మీా పేరేమిటి" అనే పెద్ద కథలో మిగత పాత్రలన్నీ ఒక ఎత్తు; రంగాచార్యులవారి కోడలైన నాంచారమ్మ ఒకర్తె ఒకఎత్తు. ఆవేశాలూ కావేషాలూ పెరిగి వూరి మోటుమూక మామగారిని చుట్టుముట్టి రభస పెట్టడం చూచింది. ఊరకుంటే పెద్ద వుసురుకే మోసం వస్తుంది.

ముసలాణ్ణి బలవంతాన గుండంలోకి దించి కాళ్ళు కాల్చేటట్లున్నారు. నాంచారమ్మ కథారంగంలోకి చొరబారిన విధమే కొట్టవచ్చి నట్లుంది.

"అంతట ఆ రావిచెట్టు మానుచాటున గప్పున ఒక వెలుతురు పుట్టింది. అందరూ భీతిల్లారు; నిషాలు దిగజార జొచ్చాయి. వెంటనే మానువెనుకనుంచి ఒక చేత కరదీపము, రెండవచేత సూరకత్తి పట్టుకొని వుంగరాల జుత్తు గాలికి తూగులాడు చుండగా, నిబ్బరంగా అడుగులు వేసుకుంటూ వచ్చి, నాంచారమ్మ మామగారి పక్కను నిలిచి, ఆయన రెక్కలు పట్టుకొనివున్న నాయలవంక బాకు మొన జూపి..."

అదిలించింది. అద్భుతంగా వుపన్యసించింది 'గుండం దొక్కుతాను. నా వెంట రాగలిగిన వైష్ణవు లెవరైనావుంటే, యెదటికిరండి.'

నాయల్ని నిష్ప్రతిభుల్నిచేసి, మామగారి ప్రాణగండం తప్పించి, ఇంటికి తిరిగి పోతూవుంది. అంతవరకూ అటకమీది కెక్కి అగడుదగడౌతున్న పిరికి మగడు కృష్ణమాచార్యులు యెదురయ్యాడు. కష్టం తీరిందికదూ, అందుచేత దిగివస్తున్నాడు. నాంచారమ్మ ఏం చెయ్యాలి? వత్తి పరిహాసమా? ఒక్క చూపు చూసిందట – "ఆమె ప్రేమ పరిహాసములు పెనగొను దృష్టితో చూసెను."

నాంచారమ్మను A woman in action అని వర్ణించవచ్చు. కథాస్థలంలో ఒక్క మెరుపు వున్నంత సేపటికంటె అదనం నిలవకున్నా, ఉన్న ప్రతీక్షణమూ హృదయస్పందనాన్ని శీఘ్రతరం చేయగలిగింది.

నాంచారమ్మకు పూర్తిగా విరుద్ధం మెటిల్డా. గ్రామదేవత బలి పీఠాన నిస్సహాయంగా దయనీయంగా నిలచిన మేకపిల్లవంటిది. అదైనా మేలు, రాబోయే దురంతాన్ని వూహించుకొని అరవనైనా అరుస్తుంది. మెటిల్డాకు ఆ స్పృహే లేదు. విధికి లోబడిపోయింది. 'పులి'– అంటే ఆమె భర్త–తో ఒద్దికగా బతకడమే కావలసింది. లేనిపోని బెడదలు తనకేల? కుర్రవాళ్ళ ఓరచూపులూ సైగలూ పిలుపులూ, ఏవీ తనను కవ్వించలేవు. పూర్తిగా లొంగుబాటు తత్వం మెటిల్డాది. అందుకే 'పులి'గారు తనభార్య గురించి ఒక యోగ్యతా పత్రంలాగ మాట్లాడాడు:

"నా పెళ్లాం బహు బుద్ధిమంతురాలు. ఇచ్చిన స్వేచ్ఛనైనా పుచ్చుకోలేదు."

పూర్ణమ్మ వంటిదైనా కాదు ఈ అర్భకురాలు. పూర్ణమ్మకు తనదసి చెప్పుకోదగిన ఇచ్ఛ ఒకటి వుంది. కాటికి కాలుజాపిన ముసలి వాడిచేత తనను పెట్టి పంపుతున్నప్పుడు, తల్లీనీ, తండ్రినీ చూసి నిందాగర్భితంగా నవ్వనైనా నవ్వింది. మెటిల్డాకు వ్యక్తిత్వమే పోయింది. తన అందాన్ని మెచ్చి సైగ చేస్తున్న కుర్రవాణ్ణి దగ్గరకు పిలిచి, "మీరు మీ నేస్తులూ నా కాపరం మన్ననివ్వరా? మీకు నే నేం అపకారం చేశాను? తల వంచుకొని మీ తోవను మీరు పోతే నే బతుకుతాను, లేకపోతే నా ప్రారబ్ధం." పోకున్నా ప్రారబ్ధమే, పోయినా ప్రారబ్ధమే.

కథగా "మెటిల్డా", గురజాడ ఉత్తమ సృష్టి ఏమో! వైపుల్యం లేదు. అనవసరమైన అంశాలు లేవు వట్టి కథనమే. ఐతేనేం? దాని తోనే కన్నీటి సముద్రాలు తిరగతోడగలిగాడు.

"దిద్దుబాటు" అనే కథలో గిరీశాన్ని ఒకవిధంగా గుర్తుకు తెచ్చే గోపాలరావును ప్రవేశపెట్టాడు. అయితే, ఈ గిరీశం కనీసం పశ్చాత్తాప పడగలడు. ఆ గిరీశంలా వేషధారి కాదు. "నేను పశువును" అనుకోగలిగిన చిత్తశుద్ధివుంది, తన వేశ్యా సంపర్కం కారణంగా, భార్య కమలిని పుట్టింటికి వెళ్ళిపోవలసి వచ్చినందుకే ఈ ఆత్మనింద కమలిని మంచి చమత్కారి. నాంచారమ్మవలె రంగమ్మీదికి రాకుండానే తన కార్యం చక్కబెట్టుకోగలదు. ఆద్యంతాలలో కనిపించకున్నా, మధ్యలో లేఖద్వారా కనిపించి, తన అసామాన్యమయిన యుక్తిని చూపెడుతుంది. భర్తను సంబోధిస్తూ, ప్రియా, ప్రాణనాథా అనేటటు వంటి సంసారిపద్ధతి వైదొలగి, 'అయ్యా', అనడంతోటే, ఇక నీకూ, నాకూ ఎలాంటి అనుబంధమూ లేదు అనేభావాన్ని భర్తలో కలిగిస్తుంది. ఇది సంసార ప్రళయం. పూర్తిగా అపుచా, అంతే కాదు. ఆ ఇంటువుండి అతగాని స్వేచ్ఛకు అడ్డువచ్చి, దినదినం అతనిచేతఅబద్ధాలాడించడంకంటె, "మీ త్రోవకు అడ్డుగా నుండ కుండుటయే పతి మేలు కోరిన సతి కర్తవ్యంకాదా?" ఇందుతో మళ్ళీ భర్త మనోను

సరణత్వ మనిపిస్తూనే, సంసారి పద్ధతి అనిపిస్తూనే గుండె లోతులకు దూసుకొని పోగలంత తీక్షణమైన నింద వుంది. జాబు చూసి గోపాల రావు మారిపోయాడు. సేవకుని ద్వారా భార్యకు క్షమాపణ చెప్పు కొన్నాడు. మంచంకింద దూరివున్న కమలిని అంతా విన్నది.

"అంతట మంచము క్రిందనుండి అమృత నిష్యందినియగు కలకల నగవును, కరకంకణముల హృద్యారావమును వినవయ్యెను"

కథ ఆ సాంతమూ ఈ అమృత నిష్యందినిపరోక్షంగా ప్రవహి స్తున్నది. ఎంతో అగ్గిని గుండెల్లో పదిలపరచుకొని గూడా, కమలిని ప్రసన్నముఖం రోషాలను చిమ్మలేదు.

"సంస్కర్త హృదయం" చాల పెద్ద కథమాత్రమేగాక గొప్పది కూడాను. ఇందులో పరిశుద్ధవాది ఐన ఒక సంఘ సంస్కరణోత్సాహి ఆదర్శాల శిఖరాలనుండి యధార్థాల ఎగుడు దిగుళ్ళ బాటమీదికి దిగివచ్చినప్పుడు, తాను ఒకప్పుడు నిర్లక్ష్యంచేసిన సహజోద్రేకాలు తనలోనే పెల్లుబికినప్పుడు, ఆదర్శాల బండారమంతా బయట పడి పోవడం కథావస్తువు.

ప్రొఫెసర్ రంగనాథ అయ్యరు "పుస్తకమ్ములలోని మాటల తత్త్వమెరుగని" వట్టి శాస్త్రజ్ఞుడేగాని, ప్రాజ్ఞుడుకాదు. హృదయ దౌర్బల్యాలపట్ల అతనికి సహనంగాని, సానుభూతిగాని లేవు. అవి నీతిని "ఏరిపారేయాలనే పట్టుదల." క్లాసురూములోకూడా ఈసంస్కరణ మతావేశం వినిపించేది. పూర్వకాలంలో ఒక శైవుడు ఒక వైష్ణవికో, వైష్ణవుడు బసివికో లొంగిపోయేటట్లు, తాను సహించజాలని స్త్రీకి ఈ మతోన్మాదీ లొంగిపోక తప్పదు. ఇతని శిష్యుడైన చందర్ ఒక భూస్వామి కొడుకు, సరళ అనే భోగంపడుచును చేరదీసి వున్నాడు. అయ్యరు బోధలు ఎంతవరకు ఆచరణయోగ్యాలని పరీక్షింప బూను కొన్నాడు. అయ్యరుమీదనే యీ ప్రయోగం జరగాలి. సాధనం సరళ. పరీక్షకు గురైన వస్తువు రంగనాథ అయ్యరు గుండెదిటువు. సిద్ధాంతానికీ ఆచరణకూ సామరస్యం వుందా? లేదా? ఇదే పరిశీల నాంశం.

రంగనాథ అయ్యరు మనిషేగాని, ఋషికాదు. అతనిది గుండే కాని బండకాదు. కాబట్టి రోజూ కొండమీదికి పూజకుపోయే సరళను చూడకుండా, చూచి మెచ్చకుండా, మెచ్చి ఆసక్తి కనబరచకుండా ఉండలేకపోయాడు. అతని "పతనం" అంతా ఒక్క పెట్టున ఘటిల్ల లేదు, దీనిలో అనేక దశలు :

1. మనస్సు నోరుమూయడం : సౌందర్యార్చన వాదంతో అంతరాత్మ సందేహా లన్నిటినీ అణగదొక్కాడు.

2. మానవవాదం : ఆనంద హేతువు బొగంపిల్లగా పుట్టినంత మాత్రాన, "మానవులు ఆమెను ఏవగించుకొని నేరస్థురాలికి మల్లె శిక్షించవచ్చునా ?"

3. వ్యక్తి చాపల్యాన్ని సంఘ దృష్టితో సమర్థించుకోవడం : "ఇంతటి అందగత్తెను విచ్చల విడిగా విహరించనిస్తే, సంఘమూ పాడవుతుంది; ఆవిడా చెడిపోతుంది." సంఘాన్ని కబళించివేయగల ఈ హాలాహలాన్ని నిజమైన సంస్కర్త నీలకంఠుడివలె, తన కంఠసీమలో నిక్షిప్తంచేసుకొని, సంఘాన్ని రక్షించాలి, తాను ఏమైనాసరే !

4. మానవుల బలహీనతలను దేవుళ్ళ కంటగట్టి, రెండవదాని ద్వారా మొదటిదానిని సమర్థించుకోవడం : దేవుడే అర్ధనారీశ్వరుడై స్త్రీ పురుషుల సమాన హక్కులను లోకానికి చాటుతున్నాడుకదా ! ఇంతకుముందు తనలో గట్టిపునాదిలేని ఆస్తికత్వం యిప్పుడు ఒక అక్కరకు జవాబుగా పనికివచ్చింది. "సాజాత్యం వున్న జీవుళ్ళమధ్య అద్భుతాకర్షణ వుండితీరాలి."

5. దుష్టులస్వభావాన్నిమార్చాలి : ఇంత ఉదారమైన సౌందర్యం వున్న సరళ స్వభావాన్నిమార్చిందే, లోకానికి ముప్పుతప్పదు. విషం తియ్యగావుంటే మరేమైనా వుందా ?

సరళ సామాన్య వేశ్యకాదు. మధురవాణివంటి అసంస్కృత ప్రకృతికాదు. నీతి, అవినీతి, మంచి, చెడు గురించి ఇలాంటి సంస్కర్తల కున్న అభిప్రాయలకంటె ఎంతో హేతుబద్ధమైన అభిప్రాయాలను ఏర్పరచుకో గలిగింది. పడుపు పని "మురికికూపం" అనుకొంది. అయితే వివాహం తరుణోపాయమా? సరళ దృష్టిలో కాదు. "ఎవడో

ఒక ఛండాలుడికి నేను కలకాలం పూర్తిగా బానిసనై పడి వుండాలనా మీ తాత్పర్యం?" అటు దాస్యమూ ఇటు విశృంఖలత్వమూ కాని మధ్యే మార్గం లేదా? ఉంటే, వ్యక్తికీ సంఘానికీ అది ఉభయార్థ సాధకం అవుతుంది. గురజాడ పాత్ర అయిన సరళ అభిలాష ఇదే. చివరకు సరళ మార్పు చెందలేదు. ఈ 'సంస్కరణ' ఆమెకు బోధపడ లేదు. సంస్కర్త ముద్దుబెట్టబోయేసరికి, సరళ చేతిలోని వీణ కింద పడి పోయింది. ఇది ఒక సంకేత మనుకొంటే, సంస్కర్త ప్రభావానికి సరళ లోబడి పోలే దనుకోవలసి వస్తుంది. కారణం? ఆ సంస్కర్త లోపం, ఆ సంస్కరణోద్యమ లోపం!

"సంస్కరణ అంటే యిదే! ఒకరిని లేవనెత్తబోయి మనమే కిందపడ్డం!"

బయటినుంచి ఎవరో (చందర్ కాబోలు) అరిచేసరికి రంగనాథ అయ్యర్ గాభరాపడ్డాడు: "దగాలోపడ్డాను, మోసం మోసం" అంటూ వెళ్ళిపోయాడు. ఆ మాట విని, సరళ సిగ్గుపడిపోయింది; ఆశ్చర్యపడింది. అమాయకంగా నవ్వింది. తెల్లబోయి చూసింది. ఎందుచేత? రంగనాథఅయ్యరు పతనానికి కారణం ఎవరు? సరళా? కాదు, రంగనాథఅయ్యరే. ఎట్లా?

అతని "సిద్ధాంతాలు, నమ్మకాలు... అనంతమైన జీవిత సంఘర్షణ నుండి జనించినవి కావు. అందువలన బలీయమైనవికావు.

'కొండుభట్టీయం' నాటకంలోగూడా ఇలాంటి సంస్కర్తల అలసత్వాన్ని గురజాడ మరొకసారి ప్రదర్శించాడు. మానవవాదానికీ, మత విశ్వాసం వంటి వర్తి సంస్కరణ వాదానికీ భేదం గమనించాడు. సౌజన్యారావు వంటి 'అచ్ఛాడీ' చేతనే మధురవాణికి ముద్దు ఇప్పించ బోయాడు. గిరీశంవంటి కుహనా సంస్కర్తలను, గోపాలరావువంటి వేశ్యాలంపటులను, రంగనాథ అయ్యరు వంటి సంస్కరణ మతోత్సాహు లను నవ్వులపాల్జేయడంలో ఆశ్చర్యం ఏమివుంది? 'యాంటీనాచ్' అనే పదాన్నే హాస్యభాజనంచేశాడు. ఆ ముసుగుకింద ఎన్నెన్నిగోత్రాలపెద్ద మనుషులు మసలుతున్నారో చూపాడు. అంటే వేశ్యావృత్తిని సమర్థిం చాడనికాదు. వేశ్యను స్త్రీగానూ, స్త్రీని దమిత మానవ వ్యక్తిగాను

నిరూపించడంలోనే ఈ తబిశీళ్ళన్నీ వచ్చాయి. వాటి సమగ్ర స్వరూపం ఈ కథల్లోకంటె గురజాడ నాటకాల్లో లభిస్తుంది,

---

## పాదపీఠికలు (Foot notes)

(1) లేఖలు. పు. 14. (2) డైరీలు. పు. 95 (3) అదే. (4) అణిముత్యాలు, ప్రవేశిక, పు. iii (5) లేఖలు, పు. 91.



# 14. విదేశీయ ప్రభావాలు

ఆంగ్ల విద్యావ్యాప్తివల్ల భారతీయ విద్యావంతుల హృదయాలతోబాటు మనస్సులుకూడా పరిణతి చెందాయి, అని నేను చెప్పనక్కరలేదు. రాజకీయాలలో స్వేచ్ఛనుగురించి పాశ్చాత్యుల అభిప్రాయాలవల్ల మన జాతీయోద్యమం ఎట్లాగైతే ప్రభావితమయిందో, సంఘనియమాలలో సాహిత్య విషయాలలో కూడా మన స్థితితో వారి స్థితిని పోల్చి చూచుకొని, వారు నేర్పగలదానిని మనవారు నిస్సంకోచంగా స్వీకరించారు. నేను అనేది, వారికి స్వతంత్రాభిప్రాయాలు లేవని కాదు; దేశీయ పరిస్థితులనుండి అవి ఉత్పన్నం కాలేదనీ కాదు. ఏర్పడిన అభిప్రాయాలమీద కొంతవరకు పాశ్చాత్య ప్రభావం ప్రసరించి, వాటి స్వరూప స్వభావాలను స్వల్పంగానో అనల్పంగానో నిర్ణయించగలిగాయని మట్టుకే నా వాదన.

తన మనస్సును మలచిన పాశ్చాత్య మహానుభావు లెవరో గురజాడ నేరుగా ఎక్కడా చెప్పలేదు. కాని సూచన ప్రాయంగా ఆయన రచనలలో ముగ్గురి పేర్లు మట్టుకు ప్రస్తావించారు. వారంతా సుప్రసిద్ధులే. ఒకరు రాబర్టుబర్న్స్; రెండవవారు ఇబ్సెన్; మూడవవారు వర్డ్సువర్తు. వారిలో ఒక్కొక్కరు గురజాడ రచనలలో ఎట్లెట్లా కనిపిస్తారో తెలియపరుస్తాను.

## రాబర్టు బర్న్స్ : గురజాడ

ఇంగ్లాండు దేశాన పారిశ్రామిక విప్లవం వురకలూ పరుగులూ పెడుతున్నా, యింకా వ్యావసాయిక వ్యవస్థలో సతమతమవుతూ

వుండిన స్కాట్లండు దేశంలో రాబర్టు బర్న్సు జన్మ. కులీనుల అధికార ప్రాభవమూ, గతంలో దేశవైభవమూ, కర్షక జనులలో ఎక్కువగా కనిపించకతప్పని ఆచారపరత్వమూ, వీరకథాస్మరణవలన కలిగే మానసిక వివశత్వమూ, బర్న్సు నివసించిన స్కాట్లండుకూ అప్పారావు మసలిన ఆంధ్రకూ సాధారణ లక్షణాలు. కాని ఈ మహాకవు లిద్దరూ క్రాంతదర్శులు. ఫ్రెంచి విప్లవం పరస్పర మారణోద్యోగంగా విషమించిన తర్వాత, దానికి మొదట స్వాగతం పలికిన ఆంగ్లకవి ప్రముఖులందరిలోనూ, చివరకు దాని నిజ స్వరూపాన్ని బర్న్సు ఒక్కడే దర్శించాడు. అతని భావ ప్రపంచమంతా యీ ఫ్రెంచి భావాల సూర్యరశ్మిచేత వెలుగూ వేడీ తెచ్చుకుంది. బర్న్సులో అప్పారావుగారికి కనిపించిన సుగుణాలు కవిగా అతని చిత్తశుద్ధి, సారళ్యము, గేయప్రియత్వము; అన్నిటికంటె మిన్నగా అతని స్వేచ్ఛాపరత్వమూ, వ్యావహారిక భాషా ప్రయోగమూ. పోతన్నవలె హలం నడుపుతూ కలం కదిపే బర్న్సు కర్షక జనభాషనే కావ్యాలలో తన భావాలకు వాహనం కావించుకొన్నాడు. అతని కావ్యాలకు బహుళ ప్రచారం లభించిందికూడా. కాల్పనిక కవితోద్యమంలో అతని స్థానం స్థిరమై పోయింది.

గిడుగు సహవాస ఫలితంగా, స్వకీయభావ పరిణామ ఫలితంగా రాబర్ట్ బర్న్సు కావ్యాలను పఠించకమునుపే వ్యావహారిక భాషావాదాన్ని అప్పారావుగారు స్వీకరించారు. కాని ఆయిన కావ్యాలలో కొన్ని కొన్ని చోట్ల శిష్టజన ప్రయుక్తమైన పలుకుబళ్ళను దిద్ది పామర జన పదాలను వాడినట్లు ఆయన రచనల ఫోటో కాపీలవల్ల తెలుస్తున్నది. బహుశా యిది బర్న్సునుండి సంక్రమించిన ఉత్సాహమేమో!

"ముత్యాలసరాల లక్షణము" అనే వ్యాసంలో తమను విమర్శించిన ఒక శతావధానులుగారికి సమాధానమిస్తూ, "బర్న్సు అను మహాకవిమాట శతావధానులుగారు వినలేదో ?" అంటారు. ఈ వాక్యసందర్భాన్నిబట్టిచూస్తే, వాడుకభాషలోకూడ రసవంతమైన కావ్యాలు వ్రాయవచ్చుననేందుకు అప్పారావుగారు బర్న్సును మేలి నమూనాగా తీసికొన్నట్లు తెలుస్తుంది. (1)

బర్న్స కవితలో కనిపించే యీ సుగుణమే కొంతవరకు ఇంగ్లీషు జానపద కవిత్వంలోనూ కనిపిస్తుంది. అప్పారావుగారు యివి కూడ పఠించారు. ఆయన కార్న్‌హిల్ మేగజిను సంపుటాలలో చదివిన కొన్ని వ్యాసాలపేర్లను తమ డైరీలకు ఎక్కించారు. వాటిలో ఇంగ్లీష్ రూరల్ పొయిట్రీ, ది స్టడీ ఆఫ్ కెల్టిక్ లిటరేచర్, పొయట్రీ ఆఫ్ ఇటాలియన్ డైలెక్ట్స అనేవి యీ అంశాన్ని ధ్రువీకరిస్తాయి. (2)

## ఇబ్సెన్: గురజాడ

నాటకరచనలో ఇబ్సెన్ ఒక విప్లవానికి ఆదిపురుషుడయ్యాడు. రచనా శిల్పంలోనే కాకుండా శీలపరిశీలనలో ఆయన విశిష్టుడు. మనస్తత్వ శాస్త్రం సాధించిన విజయాలు మానవ గుణ నిర్ణయానికి ఇబ్సెను ఉపయోగించుకొన్నాడు. ముఖ్యంగా స్త్రీ పాత్ర చిత్రణలో ఇబ్సెన్ తన ఘనతను నిరూపించుకొన్నాడు. ఒకచోట బెర్నార్డుషా అన్నట్లు, ఇబ్సెన్ నాటకాలతో మహిళాజన విప్లవసంఘటన ప్రారంభమైంది. వంటలక్కగానో, దండుగ కూలిగానో, కేళీ వస్తువుగానో తన వ్యక్తిత్వాన్ని పురుషుని అహంకారానికి లోబరచిన మహిళకు మారుగా, ఒక్కసారిగా ఎదురుతిరిగి వికటంగా నైనాసరే తన వ్యక్తి ప్రత్యేకతను బాహాటం చేసిన కాళికా స్వరూపిణి ఇబ్సెన్ నాటకాలలో తరచు కనిపిస్తుంది.

అప్పారావుగారు ఇబ్సెన్‌నుండి దేనిని, ఎంత మోతాదులో స్వీకరించి వుంటారో తెలియదు. రామమోహన్ రాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగరునివంటి మహాపురుషులు అనాటికే మహిళల తరఫున వకాల్తా పుచ్చుకున్నారు. వీరేశలింగంగారి ధర్మావేశం, రఘుపతి వెంకటరత్నంగారి జీవకారుణ్యం ఆంధ్రదేశాన్ని ఆ నాటికే వుర్రూతలూపుతున్నాయి. అప్పారావుగారి సాంఘిక తత్త్వంకూడా మహిళా విమోచనకు సుముఖంగావుంది. విజయనగరం సంస్థానంవారు బ్రాహ్మణ వివాహాలనుగురించి సేకరించిన భోగట్టాకూడ తమకావరకే ఏర్పడిన అభిప్రాయాలను దృఢపరచింది.

కాని ఇబ్సెన్ నుండి తాము వుత్తేజితులు కాకుంటే, అప్పారావు గారి స్త్రీ పాత్రలకు యింతటి ప్రస్ఫుట వ్యక్తిత్వం సమకూరివుండేది కాదేమోనని నా సందేహం. మధురవాణిని వదిలేద్దాం. కాని మీనాక్షిని, మెటిల్డాను, కన్యకను అప్పారావుగారు రూపు దీర్చిన పద్ధతిలో ఇబ్సెన్ అంశ కనిపిస్తుంది.

స్త్రీ పాత్ర చిత్రణంలోనేగాక, ఇబ్సెన్ అప్పారావుగారికి మానవ వ్యక్తిగుణశీలాదుల అవగాహనకుకూడా తోడ్పడినట్లు అప్పారావుగారే అంగీకరిస్తారు హరిశ్చంద్ర నాటకం ఆంగ్లానువాదానికి ఆయన వ్రాసిన ఉపోద్ఘాతం యీ విషయానికి సాక్షీభూతం. "లోకంలో ఏ వస్తువూ సర్వమూ సుగుణోపేతంగా, అద్యంతమూ ఉత్తమోత్తమంగా వుండబోదని ఎవ్వరికైనా తోస్తుంది. వాతావరణ వంశ పారంపర్య ప్రభావాలు శీల స్వభావాల స్థితిగతులను నిర్ణయిస్తాయనే ఇబ్సనీయను సిద్ధాంతం ఇంతవరకూ పెంపొందిన జ్ఞానదృష్ట్యా యెంతో హేతుబద్ధంగా కనిపిస్తుంది" అంటారు అప్పారావుగారు. (3) ఇంగ్లీషులో ఆయన వ్రాసిన యీ వాక్యం ఒకచోట అనువాదంలో దెబ్బతిన్నది. 'వాతావరణం' అనే మారు పరిసరాలలు అనే మాట ఎన్విరాన్‌మెంటు అనే ఆంగ్ల పదం యొక్క అర్థాన్ని సరిగా వెలిబుస్తుంది. ఈ ఇబ్సనీయను సిద్ధాంతం మన సత్య శాస్త్ర పురోగతిలో పర్యాస్తమయింది. వంశపారంపర్య ప్రభావం దేహం మీదనేగాని, గుణంమీద తన ప్రభావాన్ని ఎక్కువగా ప్రసరించలేదని ఆధునిక జీవశాస్త్రం, మనశ్శాస్త్రం చెబుతున్నాయి. కాని ఆనాటికి అదే సత్యం. కాబట్టి అప్పారావుగారి మానవ దృక్పథం ఇబ్సెన్‌చేత కొంతకు కొంత నిర్ణయింపబడిందని నిస్సంకోచంగా భావించవలసివస్తున్నది.

## వర్డ్సు వర్తు : గురజాడ

ఆంగ్ల కవిత్వంలో కాల్పనికోద్యమ జనకుడుగా వర్డ్సువర్తు సాహిత్య జీవులందరికీ సుపరిచితుడే. "లేక్ పొయట్స్" అని పేరందిన

వారిలో ఆయన సుప్రసిద్ధుడు. అతని విశిష్టత ప్రకృతి చిత్రణ. ప్రకృతిని జడపదార్థంగా భావించి దానిని అక్షర లోకానికి అచ్చు గుద్దినట్లు ఎక్కించే పని వర్డ్సువర్తుకు ముందూ వెనకా చాలమంది కవులు చేస్తూనేవున్నారు. ప్రకృతిలో భేదింప నలవిగాని మర్మాలను చూచి, దానిని దైవికశక్తిగా భావించి, జీవితాన్ని దాని వరవడితో వర్డ్సువర్తు దిద్దడానికి ప్రయత్నించాడు.

అప్పారావుగారు ప్రకృతి సౌందర్యానికి బాల్యంనుండీ పరవశించేవారు. ప్రకృతి ఆయనకు పుస్తకమట. "దివ్యాంశగల ప్రకృతిలో, చేతనాచేతన వస్తుసముదాయంలో, మానవునిలో, మనోహరమైన కాల్పనికత గోచరిస్తుంది" అంటారు (4) ఆయన కావ్యాలలో, రచనలలో అక్కడక్కడ తీర్చిదిద్దిన చిత్తరువులవలె కానవచ్చే ప్రకృతి వర్ణనలకు మూలాలు కావలెనంటే "ప్రకృతి అనే పుస్తకము" అనే రచనలో దొరుకుతాయి.

వర్డ్సువర్తునుండి అప్పారావుగారు తీసికొన్న మరొక సొమ్ము కావ్య నాయకులను గురించిన విశాలమైన దృక్పథం. కృత్రిమత వ్యాపించిన నియో క్లాసిసిస్టు కవితలో నాయకుడుగానీ, తదితర పాత్రలుగానీ సాధారణంగా జీవలోకంలో కనిపించనంతటి సొగసును, లాలిత్యాన్ని, ఔదార్యాన్ని మూర్తీభవించి కొన్నట్టివి. కనుకనే వాటిలో సహజత్వమనే ఆత్మపదార్థం లోపించింది. ఆ పాత్రల భాష కూడా, వాటి స్వరూపస్వభావాదులవలెనే, కృత్రిమమైన ఆడంబరమైన కృతకభాష. అప్పారావుగారికి, ఈ నియో క్లాసిసిస్టు ధోరణి మన ప్రబంధ కావ్యధోరణికి సన్నిహితంగా వున్నట్లు కనిపించింది. వర్డ్సువర్తు సామాన్యులను కావ్యాలలో ప్రవేశపెట్టి, వారి నోట వాడుకమాటలను నిలిపినాడు. కులీను డైనందుచేతనే యెవ్వడూ సర్వోత్కృష్ట గుణసంపన్నుడు కానేరడని, ఈ గుణాలను సామాన్యులలో గూడా దర్శించవచ్చునని వర్డ్సువర్తు అప్పారావుగారికి బోధించాడు. "మనిషే బంగారము, అనగా గుణయోగ్యతలనుబట్టి మనిషికి విలువ కలుగును, గాని ఉద్యోగమువలన, ధనధాన్యములవలన, పెద్దింట పుట్టుటవలన కలుగనేరదు" అంటారు అప్పారావుగారు. (5)

ఈ మానవ వాదంవల్లనే అప్పారావుగారి పాత్రలు సహానుభూతిని చూరకొనగలుగుతున్నవి. అవి జీవంతో తొణికిసలాడుతుంటాయని కీర్తిశేషులు సి. ఆర్. రెడ్డిగారు ప్రస్తుతించారు. చారిత్రిక కల్పనా కథలను తమ నాటకాలకు ఇతివృత్తాలుగా తీసికోక, సాంఘికాలవైపు అప్పారావుగారు మనసయ్యారంటే, ఆదర్శ లోకపు వ్యక్తి కంటె వాస్తవలోకపు వ్యక్తిని ఆయన అభిమానించినందువల్లనే. దేశీయులకు దుర్భ్రమలను వ్యర్థాహంకారాన్ని కలిగించేందుకేగాక జాతీయ వ్యక్తిని నిదుర తట్టిలేపేందుకు కూడ ఈ చారిత్రిక నాటకాలు వుపకరిస్తాయి. కాని మేల్కొన్న జాతిని అవి నడుపలేవు. నేటి ఆపదలను గడుపలేవు. కాబట్టి రక్తమాంస నిర్మితులైన మానవ సామాన్యలనే నాటకీయ పాత్రలుగా జేసి, వారికి సహజమైన గుణవిశేషాలతోబాటు అవలక్షణాలను జోడించి, నిత్యజీవితంలో వినిపించేజీవద్భాషను పలికించి,, అప్పారావుగారు వర్డ్సువర్తు మితులను కూడ మీరిపోయారు. బర్న్స్, ఇబ్సెన్, వర్డ్సువర్తులనుండి ఆయన గ్రహించినది మూడు తెన్నులుగా సాగిన ఒక సాధారణ దృక్పథం మట్టుకే. ఈ ముమ్మూర్తులనూ ఆయన తమలో సంలీనం చేసికొన్న సత్ఫలితాలే, జాతికి జ్ఞానభిక్ష పెట్టే గురజాడ రచనలు.

---

## పాదపీఠికలు (Foot notes)

(1) వ్యాసచంద్రిక : పు. 28 (2) డైరీలు : పు. 119 (3) మాటా-మంతీ : పు. 114-115 (4) మాటా-మంతీ : పు. 31 (5) వ్యాసచంద్రిక : పు. 19.



# 15. లోకాలోకనం

"భావించడం నా ముచ్చట. ఆలోచన నా బలం"

— మాటా మంతీ, అవీ : ఇవీ.

84 పౌన్లు బరువు మాత్రమే తూగిన అణుసన్నిభమయిన గురజాడ అప్పారావు శరీరాన అజాండ సదృశమైన మేధస్సు. రక్కసి మరవలె మెదడు జ్వరతీవ్రంగా పరిశ్రమించింది కనుకనే, దేహారోగ్యం మూలబడింది. విశ్రాంతికి ఆయన ఇచ్చిన నిర్వచనం, ఇతోధిక మేధశ్శ్రమ!

మహారాజావారి కళాశాలలో ఎఫ్. ఏ., బి. ఏ. తరగతులకు ఇతర విషయాలతోబాటు తత్వశాస్త్ర పాఠాలుకూడా చెప్పేందుకు, తన డిగ్రీపరీక్షలో తత్వశాస్త్రం అభిమాన విషయంగా నెగ్గి, అర్హత సంపాదించుకొన్నాడు. అంతమాత్రాన్నే ఆయన తాత్వికుడు కాగలడా? శాస్త్ర పాండిత్యమనేది స్వచ్ఛంద తాత్విక సిద్ధాంతాలకు ప్రాతిపదికను సమకూర్చింది. అధ్యాపక వృత్తికంటె ఆబాల్య చిత్తవృత్తి అనుకూలించి నందుచేత, అతని తాత్విక హృదయానికీ బటువూ విరివీ తోడయ్యాయి.

"చిన్నప్పటినుంచి నాకు కొత్తది యేది కనిపించినా, దాని తత్వము తెలుసుకోవాలని ఆసక్తిగా వుండేది. వింతలు నాకు యిట్టే పొడకట్టేవి." (1)

తత్వమనే సౌధాంతర్భాగానికి ద్వారబంధాలనదగినవి ఈ యొక్క ఆసక్తీ, అద్భుత పూర్ణదృష్టిన్నీ.

"భగవదాస్తిక్య బుద్ధియు మానవసేవాసక్తియు" (2) తన తత్వానికి మూలకందాలైనట్లు బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నం చెప్పుకొన్నాడు. తనకు మార్గదర్శకుడైన ఫ్రెంచి తాత్వికుడైన అగస్తి కామ్తే వలెనే, గురజాడ అప్పారావు కూడా మానవసేవాసక్తిని ప్రథమంగానూ, భగవదాస్తిక్య బుద్ధిని ద్వితీయంగానూ సంభావించాడు. Nihil humanum a me alienum pute – మానవ సంబంధమైన దేనినైనా పరాయిదాన్నిగా నేను భావించను – అనే లేటిను సూక్తిని, అప్పారావు తత్వ సిద్ధాంతాలకు మకుటంగా నిలుపవచ్చు.

ఆయనది ప్రధానంగా ఐహికమైన దృక్పథం తమ తండ్రిని గురించి రాసిన ఒక వ్యాసంలో గురజాడ వెంకట రామదాసు వర్ణించిన దానినిబట్టి, "వారు గంధాక్షతములు ధరించి సంధ్యావందన మొనర్చేవారు." సూర్యగ్రహణ సమయం చూసి, ఒక బత్తుని పిలిచి బంగారు, వెండి, రాగి కలిపిన మిశ్రమంతోటి ఉంగరాలు చేయించవలెనని 1898 లో అయన తలపెట్టినాడంటే, (4) కొన్ని దురూహ్యాలైన వింతనమ్మకాలేవో ఆయనను వదిలిపెట్టలేదని తీర్మానించుకోవాలి. బ్రాహ్మణ్యాన్ని నిలుపుకోవడం ఘోరాపరాధ మేమీ కాకపోవచ్చు. యజ్ఞోపవీత సన్యాసాన్ని దేశిరాజు పెదబాపయ్య, కందుకూరి వీరేశలింగం ప్రభృతి బ్రాహ్మలు అమలుపరుస్తూండిన రోజుల్లో, ఇదికూడా కొంచెం ఎబ్బెట్టుగా కనిపించక తప్పదు. అయినా స్వర్ణకార విద్య (Alchemy) వంటి క్షుద్రాసక్తులు అప్పారావు కుండేవా? ఏమో!

మానవవాదియైన ప్రతి తాత్వికుడూ నిరీశ్వరవాది కానక్కర్లేదు. అట్లాగైనప్పుడే మానవవాదానికి మరింత సమగ్రత చేకూరుతుంది. లోకవృత్తంలో మానవుణ్ణి కేంద్ర బిందువుగా చేసి, 'సృష్టి' భావాన్ని తోసివేసి, మానవుడికి అధినివేశ ప్రతిపత్తినిగాక సంపూర్ణ నైతిక స్వాతంత్ర్యాన్ని ఊహించినప్పుడే, మానవవాదానికి పూర్తి సార్థక్యం.

యూరపులో 15 వ శతాబ్దినాటికి బయల్వెడలిన రినేజాన్సు ఉద్యమ సత్ప్రయోజనాలను తాను సరిగా గుర్తించినట్లు, అప్పారావు రచనలే సాక్ష్యం పలుకుతున్నాయి. అయినా అది భౌతిక వాదంగా పరిణమించనట్లే, అప్పారావు చేబట్టిన మానవవాదం నిరీశ్వర

వాదంగా పర్యవసించలేదు. అయితేమట్టుకు ? కార్యకారణ సంబంధ మనే పరీక్షకు నిలిచి నెగ్గిన అంశాలనే సత్యాలుగా మన్నించాలనే ధోరణి అలవడింది. ప్రశ్నించకుండా, నిగ్గదీయకుండా దేనినీ ఆమోదించ రాదు. De omnibus dubitandum – ప్రతిదాన్నీ సందేహించు! 'యద్దృశ్యమ్ తన్నశ్యమ్' – కనిపించేదంతా నశించేదే – వైఖరి కాదు అప్పారావుది. దృశ్యమాన ప్రపంచం నశ్వరం కాబట్టి త్యాజ్య మనీ, దానికి అతీతమై అనశ్వరమై నామరూపగుణరహితమై అవాఙ్మానస గోచరమైన దేదో అదే పరమసత్యమనీ అయన భావించినట్లు దాఖలా లేమీ లేవు. పారమార్థిక సత్యమంటే ఏమిటి అని నిర్ణయించే గాలి నేతలను వేదాంతులకు విడిచివేసి, "వ్యావహారిక సత్యమే జీవితసత్య" మని (5) ఆయన భావించాడనాలి. ఊపిరి ఆడని ఉన్నత వాయుపథా లలో గాక, అతని భావన ప్రాణపూర్ణమైన మానవలోకంమీద విహ రించింది.

అనుభవాల తత్వం తెలుసుకోలేక "వొట్టి శాస్త్రజ్ఞులు" పుస్త కమ్ములలోని మాటల విస్తరించుచు" శుకప్రాయు లయ్యారు. నిత్యం నిత్యం కానంతమాత్రాన దృశ్యమాన ప్రపంచమూ, బాహ్యప్రకృతీ, ఇంద్రియానుభవ సంచయమూ అసత్యా లైనట్లేనా ? ఇంద్రియాలు సేకరించే అనుభూతులు, ఎప్పటికప్పుడు ఎవడికి వాడికి నిజ పరుస్తు న్నాయి. తత్కాలానికే అనుకొన్నా, ఆ అనుభూతి సత్యం కాగలుగు తున్నది.

"యెప్పటికి అనుభూత మెద్దియొ
అప్పటికి అది నిక్కువంబే"

ఒంగోలు మునిసుబ్రహ్మణ్యంగారికి రాసిన లేఖలో దీనిని వివ రించి చెప్పాడు : "'జీవితం నీటి బుడగవంటిదని సౌందర్యం అశాశ్వత మని' సిద్ధాంతాలు చెప్పే వేదాంతుల సూక్తులమాటకేంలే! ... జీవితమూ సౌందర్యమూ అశాశ్వతమైనవని చెప్పినంతమాత్రంచేత ఇంద్రియ సుఖం విడువతగిందికాదు. నిజమాలోచిస్తే ఇలాంటి వాదములవల్ల ఇంద్రియ సుఖాలు అనుభవింప తగినవనే వాదం ధృవపడుతున్నది." ఇంద్రియాను

భూతివాదం అతి లోలత్వానికి (Hedonism) దారితీయగలదనే విమర్శకుజవాబు, ప్రపంచంక్షణికమనే వాదమేఅతిలోలత్వానికి సమర్థన అవుతుందనే ఎదురుసవాలు. ఇంద్రియానుభూతులను వివేచించేందుకు మానవుని బుద్ధిబలం తోడ్పడుతుంది. అదే కొలబద్ద. ఐహికసంఘటనలకు కర్తను నిర్ణయించడంలో విధినీ, కర్మనూ, దైవాన్నీ ఆశ్రయించవలసిన అగత్యం వుండదు. అప్పుడు తత్వానికి ఆచరణయోగ్యత చేకూరదు. మానవుడు తండ్రిచాటుబిడ్డడు కాదు. ఉగవచ్చిన యువకుడు.

ఆచరణయోగ్యత అనేది ఏ తత్వానికైనా గీటురాయి అయినట్లుగా అప్పారావు భావించాడు. మతవిశ్వాసాలు, సాంఘిక, నైతిక ధర్మసూత్రాలు దీనికి అడ్డు తగిలినట్లైతే, కలిగే చేటంతా వాటికే. అవి ఆయొక్క తత్వానికి ఉక్కుచట్రాలు కాలేవు. అవసరమైనప్పుడు ఈ మాసి, మురిగి, చీకుపడి, చిరుగులతో చెడిన వస్త్రాలను తొలగించక తప్పదు. ఎప్పటికప్పుడు యెదిగే బిడ్డకు అడ్డాలనాటి అరగజం కొలతలతో కుట్టిన బట్టలు యిరుకుగాక తప్పనప్పుడు, అవే చిరిగి మూలబడుతాయిగాని, ఆ త్రివిక్రమశరీరం భంగపడదు. కాబట్టి వాటిని యెప్పటికప్పుడు సవాలుచేసి అవసరం ప్రకారం సంస్కరించే ధైర్యం ఒకటి తాత్వికునికి కావాలి. ఉన్నదానికి వ్యాఖ్యానాలు సమకూర్చి సమర్థనచేస్తే చాలదు, ఉన్నదానిని మార్చాలి. Hitherto Philosophers have interpreted the world. Our duty is now to change it. మార్క్స్ సూచించిన యీ కర్తవ్యం, అప్పారావు చేత గూడా గుర్తింపు పొందింది. అణకువ అనేది మానసికమైన పిరికితనానికి బాహిరలక్షణమని ఆయన స్పష్టంగా చెప్పాడు. స్వతంత్ర కార్యాచరణ, మనఃపరిణతికి వ్యక్తీకరణ.

అందుచేతనే, కొన్ని కొన్ని అంశాలలో అగస్టి కామ్టేతత్వాన్ని కూడా అప్పారావు నిరాకరించవలసి వచ్చింది. సామాజిక శాస్త్రవేత్తగా బయలుదేరిన కామ్టే, మానవునిపై గల మక్కువకొద్దీ మానవమతమనే (Religion of Humanity) వాదానికి ఆద్యుడై దేవుని స్థానంలో మానవుణ్ణి ఆరాధ్యుణ్ణిగా చేశాడు. శాస్త్రాంశ సన్నగిల్లి మరొక విశ్వాసంగా రూపొందిన యీ తత్వాన్ని తప్పులెన్నవలసి

వచ్చింది. ఏక కేంద్రం గాక, అనేక కేంద్రాలు సమానాధికారాలను అమలుజరిపినప్పుడు రాజరికం అరాజకమై పోగలదనే భీతి మాత్రమే దీనికి కారణం కాదు. మతం అనేది ఏదిగానీ స్వచ్ఛంద మనోగతిని నిరోధిస్తుందనే ఊహమాత్రమే ముఖ్యకారణం. అప్పటికి ఎంతో హేతుబద్ధంగా కనిపించిన ఇబ్సనీయను సిద్ధాంతం గురించి అప్పారావు చేసిన మినహాయింపులనుబట్టి, ఈ ధోరణి స్ఫుటతరంగా కనిపిస్తుంది. మానవుల మనస్సులను మలిచి, శీలస్వభావాదులను నిర్ణయించడంలో ఆనువంశిక, పారిసర్య ప్రభావాలు నిర్ణాయక పాత్రను నిర్వహిస్తాయనే సిద్ధాంతం (కొంత సత్యసమ్మతమే అయినా), బేషరత్తుగా అంగీకరిస్తే, పరిస్థితులకు మనిషి కేవల బానిస అనుకొని, అతగాణ్ణి పశుస్థాయికి గానీ, నిర్జీవ సాధనోపకరణ స్థాయికిగానీ దించివేసినట్లౌతుంది. మానవుడు బుద్ధిమంతుడు అనే విషయాన్ని తృణీకరించినట్లౌతుంది. పరిస్థితులు అతనిని మార్చడ మెంత వాస్తవమో, పరిస్థితులను అతను మార్చడమనేది అంతకంటె ఎక్కువ వాస్తవం. అందుచేత అప్పారావు దృష్టిలో, మానవలోకం దాదాపు స్వయంపాలకంగా ఉంది. దైవశాసనంగానీ, పరిస్థితుల దాష్టీకంగానీ, మానవుడి క్రియాపాటవం ముందు బిక్కముఖాలు పడుతున్నాయి.

మరి దైవమనగా ఏమిటి ?

"దైవమనే భావం... అంధుడికి రంగులంటే ఏమిటో తెలియదు; ఏ అభిప్రాయమూ ఉండదు."

ప్రత్యక్షప్రమాణం లేనందుచేత, దైవమనే జటిలమైన భావం మానవుడికి విశదంగా అంతుచిక్కదనా ? తెలివిడి కాదనా ? 'ఇదికాదు' 'ఇదికాదు' (నేతి, నేతి) అని చెప్పుకుంటూ పోగా పోగా, మిగిలే శూన్యమనా ? అంధులలో తానూ ఒకడు కాబట్టి, అప్పారావు దీనిని నిర్వచించలేదు. అస్తి నాస్తి విచికిత్స దండుగపని. గౌతమబుద్ధుని సంశయవాదమే (Agnosticism) ఉన్నంతలో ఉత్తమమైనది. అయినా మనిషికి ఆదర్శమంటూ ఒకటి లేనిదే, అతని శీలం ఉన్నతి చెందలేదేమోనని, సదరు ఆదర్శమయినా సర్వజన సాధ్యంగా ఉండాలని, అది కార్యావలంబనకు ప్రేరేపించేది కావాలని ఆయన

ఉపలక్షించాడు. కొండకోనలలో వెదుకులాడుతూ, రాలురప్పలకు మొక్కుతూవున్న మనిషినిచూసి, దేవుడు ఎక్కడో దాక్కొని ఉన్నట్లుగా వెర్రిగా తిరుగులాడుతా వెందుకు ?

"కన్ను తెరిచిన కానబడడో
మనిషి మాత్రుడి యందులేడో
యెరిగి కోరిన కరిగి యీడో
ముక్తి!"

అన్నాడు. 'ముక్తి' వంటి నలిగినలిగి అర్థం అరిగిపోయిన మాటలను వాడి పక్కతెన్ను పట్టినట్లున్నా, అప్పారావుయోచన ఈ వచనంలో తేటతెల్లమౌతున్నది.

"మంచితనమే దైవము. మంచిని పెరగనివ్వాలి. మంచిని ప్రేమించడమే దైవమును ప్రేమించడము. దుర్గుణములనురోసి, ఆత్మసుగుణ సంపత్తిని పెంపొందించుకొంటున్న కొద్దీ, అది దివ్యత్వమును పొందుతుంది." (5)

మానవనైజం క్రమశః నిర్వక్రమై, దివ్యత్వమనే శిఖరాన్ని చేరుకోగలదనే కేంట్ తత్వం (Perfectibility of Man), దేవుడికీ నరుడికీగల యెడాన్ని కుదించి, ఆ ఇద్దరినీ పరస్పరం పర్యాయపదాలుగా చేస్తుంది.

అప్పారావు సాహిత్యంలో పరతత్వంగురించిన చర్చ కొన్నిచోట్ల జరిగి ఉంది పాత్రల అభిప్రాయాలను రచయితకు అంటకట్టగూడదు కాని, రచయిత అభిప్రాయాల వైఖరిని అవి బింబించకపోవు. 'సంస్కర్త హృదయం' అనే కథలో, ప్రొఫెసరు రంగనాథఅయ్యరుకూ, సరళకూ మధ్యజరిగిన సంభాషణ భావగర్భితమైనట్టిది. సరళ సాధారణ వేశ్య కాదు. బుద్ధిమంతురాలు. చెడ్డను చూడనొల్లని 'అచ్చాఛీ' అయిన అయ్యరుకు, ఉన్న వాస్తవాన్ని ఎరుగజెప్పుతుంది. మర్మవాదం (Mysticism) వాచ్యంచేస్తుంది. దాని సారాంశం ఇది. మంచి, చెడ్డలనేవి పరస్పర విరుద్ధాలు కావచ్చునేమోగాని, ఇరుగు పొరుగుల్లాంటివి. ఒకటి వినా వేరొకటి బోధపడదు. అవి కవలపిల్లల్లాంటివి. వాటి

తల్లి, మాయ. అదిసృష్టికి తోబుట్టువు. మాయలేనిసృష్టిఉండదు. అయితే, మానవునిలో విజ్ఞానోదయమయ్యాక, మంచిపెరగడమూ చెడుగు తరగడమూ జరుగుతుంది. విజ్ఞాని అయినవాడు, చెడుగును ఈసడించుకోవడంలో ఈజీవితసత్యానికి అంధుడూ బధిరుడూ కాగూడదు. ఈవేదాంత తత్వం సామాన్యులకే గాక, దిగ్గంతి పండితులకూ గహనమని, "ప్రత్యక్ష జీవితంలో మనం ఎదుర్కొంటూన్న విషమసమస్యలను పరిష్కరించుకుందుకు ఈ వేదవిజ్ఞానం ఒక్క పిసరు అక్కరకు రాదు" అనిన్నీ రంగనాథ అయ్యరు అభిప్రాయం. పనికివచ్చే విజ్ఞానం ఎలాంటిదై వుండాలి? "దైనందిన జీవితానికి సహాయకారి". ఏమిటి అది? "యుగయుగాల జీవితానుభవం" ఇంత ఘనంగా సిద్ధాంతమైతే చేశాడుగాని, ఆచరించ వచ్చేసరికి పప్పులో కాలువేశాడు. సంఘసంస్కరణ దారుణరణోత్సాహి, శాస్త్రాధ్యాపకుడు, హేతువాది అయితే అయ్యాడుగాని, అయ్యరు అభిప్రాయాలు జీవితానికి పుట్టిన బిడ్డలుకావు, గ్రంథాలనుండి సేకరించుకొన్నట్టివి నినాదాలను పట్టించుకొన్నంతగా, అతని మనస్సు నిజాన్ని పట్టించుకోలేదు. అవినీతిని ఆకళించుకొని సానుభూతితో దానిని సరిదిద్దలేక, దానిని మొదలంటా తుంచివేయాలనే భల్లూకపట్టుతో, అవినీతికి అందగత్తె మూర్తికట్టిన పరిస్థితిలో దానికి లోబడిపోయే మెతక గుండెను రంగనాథఅయ్యరు ప్రదర్శించాడు. అతని పతనానికి కారణం, అప్పారావు దృష్టిలో, అసమగ్రమైన అతని కృత్రిమ తత్వమే. 'సంశయవాదం' కూడా కరిగిపోసాగింది. ఆస్తికుడు కాసాగాడు. "విజ్ఞాన శాస్త్రాభ్యాసం సంశయ నివృత్తికి మారు, సందేహాలను కలిగిస్తోంది".

"ఆత్మ, పరమాత్మ, జీవుడికి వేరేలోకం వున్నాయి; సాజాత్యం వున్న జీవుళ్ళమధ్య అద్భుతాకర్షణ వుండి తీరాలి".

ఇది అప్పారావు అభిప్రాయంకాదు, రంగనాథ అయ్యరుది. అతని మతి వికటించింది సుమా! జీవితసత్యం ఎదురుపడినప్పుడు, దానిని అవగతం చేసుకొనేందుకు శాస్త్రవిజ్ఞానాన్ని ఉపయోగించుకోకుండా, దానితో రాజీపడేందుకై శాస్త్రసత్యాన్ని సవరించుకోవడమే ఇందులో కనిపిస్తుంది.

"మీ పేరేమిటి ?" అనే కథ కూడా కొంతవరకు తత్వచర్చకు అప్పారావుకు వీలు కలుగజేసింది. కథాశీర్షికే భావబంధురమైనట్టిది.

"దేవుడు చేసిన మనుషుల్లారా!
మనుషులు చేసిన దేవుళ్ళారా!
మీ పేరేమిటి ?"

ఆస్తిక్య నాస్తిక్యాలు, శైవ వైష్ణవాల 'వీర' రూపాలు, భక్తి ప్రపత్తి ఘర్షించే ఇతివృత్తం. భక్తి పామరులను ఆశ్రయించింది. మౌఢ్యంగానూ మతావేశంగానూ వక్రించింది. స్పర్థలకు స్థావరమైంది. తామసవ్యాపారంగా పరిణమించింది. ఇదేనా మతమంటేను ? కాదు. ఇది మౌఢ్యం. బాహిరమైనభేదాలను వీలుచేసికొని పెచ్చరిల్లిన పిచ్చి. "అల్లా-రామ్!" అని ఏకబిగిలో అనగలిగిన పీరుసాయెబు లేడూ, అత గాడు సాతాని మనవాళ్ళయ్య కంటె, జంగం శరభయ్య కంటె, మున్సబు నాయడికంటె, అంతరాలు అధికుడు." ఏ మతమైనా ప్రపత్తి వున్నవాడికి త్రోవవుంది" అనేది ఈకథాబోధ. అందుచేతనే శివవిష్ణులు పీర్లు అయిపోయారు. కలికాలం మరి! దేవుళ్లుగూడా సంకరం అవు తున్నారు. అయినా తప్పేమి ? శివుడన్నా, విష్ణన్నా, పీరన్నా, బుద్ధ డన్నా, ఆ పరమాత్మమట్టుకు ఒక్కడేగదా !"

దేవుళ్ళందరూ ఒక్కటేనని ఒప్పుకుంటే, "ఆ పీనుగల్ని అందరినీ ఒక్కచోటే నిలిపి అందరూ కలిసి పూజ తగలెట్టరాదా ?" ఈ ప్రశ్న వెంకయ్యది. వెంకయ్య నాస్తికుడని వేరే చెప్పాలా ? దేవుళ్ళం దరికీ నామం పెట్టిన ఉద్దండ పిండమే అయినా, గురువుగారికి మాత్రం పెట్టలేదు. వెంకయ్యతో ఒక్కటే చిక్కు. దేవుళ్ళమీద పితూరీచేసి మనిషిని గౌరవించడమే అతని మతం. అతనిమీద కథాపాత్రలకుగానీ, కథకుడికిగానీ చిన్నచూపు లేదు. గురువుగారు అతనిని మందలించినా, గురజాడ అప్పారావు అతని తప్పు ఎన్నలేదు సరిగదా, మూఢవిశ్వాసా లను చావుదెబ్బకొట్టే పటుతర సంభాషణలను అతనినోట బెట్టాడు.

"కొండుభట్టీయం" నాటకం తృతీయాంకంకూడా తత్వస్ఫోరక రచనగా కనిపిస్తుంది. ఆర్యమతమునకు పట్టిన తుప్పును కడిగి, "ఆచార్య

నిర్దిష్టకర్మ, వేదాంతమార్గము'లను 'భగవద్గీతాది మహాగ్రంథముల సాహాయ్యమున' ప్రబోధించే ఉద్యమకర్తగా దివాన్ బహద్దర్ రాజారాం నాస్తిక్య ప్రవాహానికి ఆనకట్టవంటి బ్రహ్మసమాజోద్యమా నికి మాధవయ్య, కేశవరాయడుగార్లను ప్రతినిధులుగా నిలిపి, చర్చల ద్వారా గురజాడ అప్పారావు మళ్ళీ తత్వబోధకుపక్రమించాడు. గిరీశం కూడ ఇక్కడ దర్శనమిచ్చి, ఉపనిషత్తులనన్నిటినీ ఊకదంచిన ఘటికుడు లాగా ఉపన్యసించాడు. దివ్యజ్ఞాన సమాజమువారు పూర్వాచారాల కన్నిటికీ యెదో సమర్థన కల్పిస్తూ, 'పేడా బెల్లంకలిపి' కంగాళీ జేస్తున్న పద్ధతినీ, బ్రహ్మసమాజంవారు ఒకవైపు సంఘ సంస్కరణంచేస్తూనే మరొకవైపు పూర్వాచారాలను పాటిస్తున్న పద్ధతినీ రాజారాం ఖండి స్తాడు. రేషనల్ రెలిజన్ అనే నినాదమిస్తాడు. అయితే గిరీశం రాజారాంకంటె రెండాకులు ఎక్కువ చదివినవాడు కనుకనే, మత మనేది మానవుడికి ఒక్కొక్కస్థితిలో ఒక్కొక్కరీతిగా ఉపకరిస్తుందనే లౌకిక సత్యాన్ని చాటాడు.

'యెండవేళ ఒక మతం, చల్లనివేళ ఒక మతం, కడుపుకాల్తూన్న ప్పుడు ఒక మతం, కడుపునిండినప్పుడు ఒక మతం, అందులో అంబలి మతం, పప్పు నెయ్యి మతం, గోధుమరొట్టి మతం, మద్య మాంస మతం, యేరుకుతినే వాకపళ్ళ మతం, డబ్బిచ్చికొనే మామిడిపళ్ళ మతం, గడ వడం గడవకపోవడాన్నిబట్టి అంతర్భేధాలు కలవు! అలిసివున్నప్పుడో మతం, వంటరిగావున్నప్పుడో మతం, అతివచెంతనున్నప్పుడో మతం!'

మతమనేది 'లంగరులేని నావలాగ... మనస్సుయొక్క శరీరము యొక్క స్థితినిపట్టి చెలిస్తూవుంటుంది.' అంటాడు గిరీశం. ఇది ఎబ్బె ట్టుగా వినిపించవచ్చునేమోగాని, 'నిష్కల్మషమయిన మనస్సు అవ్యాజ మయిన భూతదయావుంటే, యే మతమయినా సమ్మతమే' అని గిరీశం అన్నప్పుడు, ఎలాంటిపేచీ వుండనక్కర్లేదు. నిజానికి, గురజాడ అప్పా రావుకు మతమనేది ఒకటి వుండివుంటే, అది ఇదే, అది ఇదే, అది ఇదే!

కన్యాశుల్కంలోనూ, కొండుభట్టీయంలోనూ, బిల్హణీయంలోనూ గీతాప్రశస్తి వుంది. మధురవాణి చిత్తవృత్తిని మార్చగల మూలిక గానూ, ఆర్యమతానికి పట్టిన తుప్పును కడిగివేయగల ద్రావకంగానూ,

ఇంద్రియదమనానికైన ఆయుధంగానూ, భగవద్గీత సంభావితమైంది. గిరీశం సంభాషణ బిల్హణమహాకవి వాచా వెలువడుతుంది!

'కుమార! నిజమైన జ్ఞానమును సాధించవలెనన్న పండితుడికి పరమతములయెడల అసూయ కూడదు. ఈ భూప్రపంచమందు లెక్క లేని మతాలున్నాయి. ...ఏ దేశంలో, ఏ మతంలో యే మేమి మేలు వుంటే, అదల్లా గ్రహించదగిందే.'

జ్ఞానమే పరమగమ్యం. మతం సాధనమాత్రం. విజ్ఞానం పెరిగే కొద్దికీ, సాధనం బటువు కోల్పోయి, దాని అగత్యం తీరిపోకతప్పదు. అందుకే రుషివాక్కులాగా అప్పారావు గేయచరణం ధ్వనించింది :

"మతములన్నియు మాసిపోవును
జ్ఞానమన్నది నిలిచి వెలుగును
అంత స్వర్గ సుఖంబులన్నవి
యవని విలసిల్లున్."

పరంకాదు, ఇహం; దివికాదు భువి; దేవుడుకాదు, నరుడు; మతంకాదు, జ్ఞానం; భక్తికాదు, ప్రపత్తి; అప్పారావు దృష్టిలో ప్రథమస్థానగౌరవం చూరగొన్నవి. అసాధ్యమైన వేదాంతావలంబనం గాక, సర్వజనసాధ్యమైన సౌశీల్యసంపాదనం అతని ప్రబోధమైంది. అతని తత్వం సంఘతత్వ మైంది.

## II

"ఇప్పుడున్న సాంఘిక భావాలు పోయి వాటిస్థానే కొత్తవి రావలసినఅవసరానికీ, అగత్యానికీ మానవపరిణామవాదం దారితీస్తున్నది."

— లేఖలు, పు. 82

ఇంగ్లీషు చదువులవల్ల వస్తుతత్వంగురించి సత్యం గుర్తెరిగిన గురజాడ అప్పారావు, ప్రవక్తలనుండీ మహాకవులనుండీ హృదయ తత్వంగురించి ప్రబోధం పొందాడు. దీనినే ప్రేమతత్వంగా స్థాపించాడు. స్త్రీ పురుషుల మాన్మథానురాగ మొక్కటేగాక, మానవుల పరస్పరాను

రాగమంతా ఇందులో ఇముడుతుంది. మరులొక్కటే ప్రేమ అను కొంటే, అది వయస్సుతో మరలుతుంది. ఒంటి చేవ చావగానే అదీ చావాలి. దేహాల పరస్పరాకర్షణ దీని జన్మస్థానంకాదు. మట్టిలో పుట్టు లేదు. ఇది "హృత్కమలంపు సౌరభము". "పెన్నిధి". "మాయామర్మము లేని నేస్తము". (7) అందుచేతనే, అది తటిల్లతవలె వెలిగి మాసిపోక, నిలిచి వెలిగే దీపకళికవంటిది కాగలుగుతుంది.

మానవ సంఘానికి గల ప్రయోజనం ఆనందం కలిగించడమే అయితే, ప్రేమవల్లగాక మరిదేనివల్లనూ ఇది చేజిక్కబోదు. మనిషిని మనిషితోనూ, మనసును మనస్సుతోనూ అతికి, సంఘంగా మార్చే హృదయ పదార్థాన్ని ప్రేమ అని అప్పారావు పేర్కొన్నాడు. నీ రూపు రేఖలు, నీ గుణగణాలు చూసుకొనే అద్దం, నీ పక్కమనిషి గుండె. నిన్ను వాడూ, అతణ్ణి నువ్వూ 'అర్థం' చేసుకోవాలి. వాడికి పడిశంపడితే నువ్వు తుమ్మాలి. నీ కంట నలుసుచేరితే, వాడి కన్ను కలకవెయ్యాలి. అదే ప్రేమ. ఇదే లోకనిర్వాహక ధర్మసూక్ష్మం! సమిష్టికి పునాది అయిన్నీ, వ్యష్టిని ఆశ్రయించి అందులో మూర్తిని ప్రతిష్ఠించుకొంటుంది. వ్యష్టిని అండగొన్నది కనుకనే, సమిష్టికి పునాది వేయగలిగింది. కార్యావలంబనకు అతీతమైనదిగాక, ఎప్పటికప్పుడు మానవ సంకల్ప బలానికి లొంగి నిత్యజీవితంలో పాటించదగిన సాధారణ సూత్ర సంపుటిగా వర్యవసిస్తున్నది.

మనిషి నాగరికుడయ్యే కొద్దికీ, అతనిలోని చెడుగును అతకరించి మంచి పైదేలుతుంది. చిత్త సంస్కారానికి దోహదం చెయ్యనిదానిని దేనినిగానీ నాగరికత అని పిలవకూడదు. తన పశుత్వాన్నీ ఆటవిక ప్రవృత్తినీ జయించేకొద్దీ, మనిషి తనకు తానై ముక్తినీ స్వేచ్ఛనీ ప్రసాదించుకొంటున్నాడు. యథార్థమైన స్వేచ్ఛ, ఘోరాటవిలోని నిత్య సంఘర్షణలో, జీవనస్పర్థలో అహమే లోక కేంద్రంగా విజృంభించే మారణ ఘాతుకంకాదు (A war of each against all). దాంపత్యం, కుటుంబం, వంశం, తెగ, రాజ్యం, జాతి, లోకైకరీతి అనే అనేక అంతస్థులు కలిగివున్న వర్తమాన మానవ సంఘవ్యవస్థకు పునాది, వ్యక్తిని

సమిష్టికి లోబరచడమే. అందువల్ల అతగాడు తన స్వేచ్ఛను కోల్పోవడు సరిగదా, ప్రమాద భూయిష్టమైన తన ఒంటరితనాన్ని వదలి, సర్వ మంగళకరమైన సమిష్టికి చెంది, దాని మేలులో ఒకానొక భాగంగా తన మేలును పెంపొందించుకొంటాడు. సమాజ నిర్బంధంలోనే మనిషి స్వేచ్ఛనూ సంస్కృతినీ సంపాదించుకొంటాడు.

"నాగరికతతో పాటు ప్రేమభావము పెంపొందుతూ వుంటుంది. ఆటవికుని ప్రేమ తక్కుస్థితిలో వుంటుంది. కపట వేదాంతులు స్వార్థ ప్రవృత్తిని ప్రోత్సహిస్తారు. ప్రేమ మానవజాతికి స్వేచ్ఛను ప్రసాదిస్తుంది."

"స్వార్థాన్ని విడిచిపెట్టాలి. పరులకు ఉపకారం చేయాలి. మనిషిని ప్రేమించాలి. ఇది నిజమైన తాత్వికదృష్టి... ప్రేమ, వ్యక్తి స్వార్థాన్ని పోగొడుతుంది. ప్రేమకన్న పెన్నిధి యింకేముంది ?" (8)

ఈ తాత్విక వచనమే కాలక్రమాన కావ్య ప్రవచనమై, 'దేశ భక్తి' గేయంలో చోటుచేసుకొంది. ఒకరిమేలు తన మేలని ఎంచ డమూ, స్వంతలాభం కొంత మానుకొని పొరుగువాడికి తోడుపడ డమూ, ఒరుల మేలుకు సంతసించడమూ, ఉత్తమ పౌరధర్మాలుగా ప్రసక్తాలయ్యాయి. అంతే, అప్పారావు సంఘతత్వం, పౌరతత్వంగా రాణకెక్కింది.

జాన్ స్టువర్ట్ మిల్, టి. హెచ్. గ్రీన్ వంటి ఇంగ్లీషు తాత్వికులకు ఈ విషయంలో అప్పారావు ఋణపడి వుంటాడా ? వ్యక్తిలోని స్వహిత (Self-regarding), పరహిత (Other-regarding) చింతలలో రెండవదానికి ప్రథమస్థానమిచ్చిన మిల్ అడుగు జాడలలో పయనిస్తూ, హెగెల్‌కుగూడా మనసైన గ్రీన్, వ్యక్తి స్వార్థాన్ని ఈసడించి, లిబరల్ రాజకీయ సిద్ధాంత పరిణతికి కారణభూతుడయ్యాడు. అయితే, గౌతమ బుద్ధునినుంచీ, క్రీస్తునుంచీ, షెల్లీనుంచీ, ఈ ప్రేమతత్వాన్ని తాను రాబట్టినట్లు అప్పారావే చెప్పుకొన్నాడు. (9) వాత్సల్యం, దయ, కరుణ అనేవి, కర్తకూ ఫలభోక్తకూ ఇద్దరికిన్నీ ఆత్మపరితోషాన్ని కలిగిస్తాయి. Twice blest అని షేక్స్పియరు అన్నదికూడా ఇందు గురించే.

సామాన్యంనుంచి విశేషానికి పయనించాడో లేదోగాని, తలవని తలంపుగా ఒకానొక విశేషం ఈ సామాన్య ధర్మాన్ని అప్పారావుకు చూపెట్టింది; అప్పటివరకూ తానూ పదుగురాడే |తోవనుబట్టి పోతూ, నల్లవన్నీ నీళ్ళుగానూ తెల్లవన్నీ పాలుగానూ అనుకొంటూ వున్నాడు. ఒక వేశ్యను ఆనందగజపతి వంటి శీలవంతుడు చేరదీశాడని వినేసరికి, ఆయనపట్ల కుదురుకొని వుండిన గౌరవభావమూ గర్వమూ తనకు వైదొలగిపోయినట్లనిపించింది. మహారాజు కోరిక మేరకు, ఆవిడ యోగ క్షేమాలు విచారించే బాధ్యత తనపై బడింది. విధిలేక ఒప్పుకొన్నాడు. ముభావం చూపాడు. అయితేనేం, మెల్లమెల్లగా తనకే తెలియనంత తేలికగా, తన భావలోకం మార్పుకు లోనైపోయింది. మార్పు తన్ముఖంగా ఏర్పడి వుండవచ్చునేమోగాని, దానివేళ్ళు ఇంకా వెనకటి రోజుల వరకూ తన్నుకొని వున్నాయి. ఆనంద గజపతి వెలువరించే జీవితతత్వ పాఠాలను వింటూ సహనం పెంచుకొంటూ ఆయిష్టాన్ని అధిగమించుకొంటూ సానుభూతిని విస్తరించుకొంటూ వస్తున్నాడు. రాశి మార్పు చెందుతూవచ్చింది. ఇప్పుడీ తాకిడికి, అండం పక్వమై గుల్లను విచ్చుకొని కోడిపిల్ల వెలికి వచ్చింది. "నిజానికి గత ఆరేడు సంవత్సరాలలో కొత్త కొత్త అనుభవాలు కలిగి జీవిత పరిజ్ఞానం అధికమైంది. జీవితానుభవాలు వైవిధ్యము అనుభూతులు నా కొక నూతనదృష్టిని కలిగించాయి. ... అన్నింటికంటె జాలి గొప్పది. మానవులను ప్రాణులను ప్రేమించాలి. ప్రపంచాన్ని ప్రకృతిని కరుణాదృష్టితో వీక్షించాలి. ... వస్తువును వస్తుపరంగా చూడడం ఉత్తమపద్ధతి." (10) వేశ్య, వేశ్యగా గర్హణీయం కాక, మానవిగా అప్పారావు అభిమానాన్ని చూరగొన్నది. మరి మధురవాణి పాత్ర చిత్రణం మొదటికూర్పులో ఉన్నట్లు రెండవకూర్పులో లేదనేందుకు, ఈ మార్పే ప్రధానకారణం అయివుండదా?

వృత్తినిబట్టీ, కులాన్నిబట్టీ మనిషియొక్క మంచిసెబ్బరలు తూచి చెప్పే పద్ధతికిగూడా ఆయన పెడమొగం పెట్టాడు. మాలగా పుట్టినంతమాత్రాన అతనిలో అంతర్నిహితమై వున్న మానవత్వం మరుగున పడవలసిందేనా? మూలంనుండి స్వతంత్రించి, "లవణరాజు కల"లో

వర్ణప్రసక్తిని లేవనెత్తింది ఇందుకే. కనీ వినీవున్న ధర్మాలకు భిన్నమైన "పరమధర్మము" చాటేందుకే. దేహంవల్లనూ, వృత్తివల్లనూ కొందరు మాలలు కాగా మనస్సులలో మురికి నిండారినవాళ్ళెందుకుగారు మాలలు? అయితే ఈ రెండవతెగవాళ్ళే కావాలి అసలు సిసలు మాలలు. అందుకనే పాల్కురికి సోమన్న ఈ "కర్మచండాలు"రను ఎత్తిపట్టారు. గుణయోగ్యతలను బట్టి మనిషి మేలిమి నెంచాలిగానీ, పుట్టుకనుబట్టి కాదు. అట్లా కానప్పుడు వర్ణధర్మమనేది ధర్మానికి విపర్యయం కలిగించి అధర్మమౌతుంది.

వర్ణవ్యవస్థనేగాక, అనేక ఇతర సామాజిక సంస్థలను తీవ్రంగా సంస్కరించవలసి వుంది. ఎందుకో ఏప్పుడో ఏర్పడిన ఈ సంస్థలు, నేటికి తొల్లిటి తమ అక్కరను కోల్పోయి కొన్నీ, ఆచరణకు దుస్సాధ్యమై మరికొన్నీ, ఎన్నో అనర్థాలను కలిగిస్తున్నాయి. సంస్థాధర్మమనేది మనోవృత్తులతో స్పర్ధిస్తున్నది. ఎన్నో కన్నీటి కతలు, ఎన్నో యమ చెరలు, యాతనలూ నిర్బంధాలూ, ప్రత్యక్షజీవితంలో దుర ఘటిల్లుతున్నాయంటే, సంస్థాధర్మాలు పరిస్థితులతోబాటు వి స్తరించక యథాపూర్వ కాఠిన్య కార్కశ్యాలకు స్థావరాలైనందుచేతనే. అలాంటప్పుడు, మారవలసింది మానవమనోధర్మాలు కాదు, సంస్థాధర్మాలు! మనుషులకోసం ధర్మాలుగాని, ధర్మాలకోసం మనుషులు కాదు. సంస్థలు సాధనాలవంటివి. మనిషికి పనిముట్లు. చీటికిమాటికి అతిక్రమించ తగదేమోగాని, మానవసౌఖ్యానికి తీవ్రమైన అంతరాయం కలిగినప్పుడు, పితూరీ అనేది కర్తవ్యమేగాక, హక్కు కూడాను. ఆదర్శాలలోనికి చొచ్చుకొనివచ్చిన విషక్రిములవంటి లోపాలను ఎప్పటికప్పుడు తొలగించుకోవడమే ఆదర్శానికి నిజమైన సేవ. ఆ లోపాలను సమర్థించడమనేది ఆదర్శాలకు అపచారం. అందుచేతనే, ప్రతి పూర్వాచారాన్నీ నవీన ఉపపత్తులతో బలపరచజూచే థియోసోఫిస్టులను అప్పారావు కంటగించుకోవలసి వచ్చింది.

లోపపూరితంగావున్న సామాజిక సంస్థలలో మౌలికమైనది స్త్రీపురుష సంబంధమనేది. దాని లోతులకు దిగి అప్పారావు తరచి

చూశాడు. వివాహమూ, వివాహబాహిరమై సంస్థారూపం ధరించిన వ్యభిచారమూ అతని కారుణ్యదృష్టిని బలంగా ఆకట్టుకొన్నాయి.

వైవాహిక వ్యవస్థకు ఆయన ప్రతికూలుడు కాదు. సంఘనిర్మాణంలో పునాదిరాయిగావుండి, అనేక అభ్యుదయాత్మక పరిణామాలకు పుట్టినిల్లైకూడా, కాలక్రమాన ముదిరి కుక్కమూతి పిందెలను కాస్తున్న వైవాహికవ్యవస్థ విమర్శకూ, సంస్కారానికీ అతీతమేమీ కాదు. వ్యక్తుల స్వచ్ఛంద మనోభీష్టాలకు గొడ్డలిపెట్టై, చిటిపొటి చేర్పులకు కూడా యెడమివ్వలేని పాషాణ కుడ్యమైనందుచేతనే, నిత్యజీవితంలో అనేక ఉల్లంఘనలను సహిస్తూ, నామమాత్రావశిష్టంగా తయారై వుంది. దానిని మళ్ళీ బలీయంచెయ్యాలి. అందుకోసమేగాని, దానిని రూపుమాపేందుకు కాదు, కొన్ని కత్తిరింపులు అవసరమైంది. ఇష్టారాజ్యం మానవసంఘాన్ని మళ్ళీ ఉద్రేకారణ్యాలకు తీసుకెళ్ళగలదు. సంస్కర్తల పని కత్తిమీది సాము. బాధ్యతలకు శృంగభంగంకూడదు. వైవాహికవిధానంపట్ల విరసనను కలిగించవలసిందేగాని, వివాహ ప్రయోజనంగురించి హేళనగానీ, ఖండనగానీ కూడదు. అప్పారావు అక్కడక్కడ చేసిన వ్యాఖ్యలను కలగలిపి పరిశీలించినట్లైతే, ఈ జాగ్రత్తల నన్నిటినీ ఆయన పాటించినట్లు తెలిసి వస్తుంది.

ఒక నవలకు కూర్చిపెట్టుకున్న సన్నివేశాలలో నేరుగా వివాహ ప్రసక్తి వాచ్యమైంది. దాంపత్యజీవిత మనేది స్త్రీకి అత్యావశ్యకమని 'కవి' అంటాడు. స్త్రీకి శరీరసౌందర్యం సన్నగిల్లాకగూడా, భర్త తనను ప్రేమిస్తున్నాడుగదా, ఎందుచేత? సాంసారిక బాంధవ్యం వల్లనూ, జీవనసహభాగిత్వంవల్లనూ ఉభయులమధ్య శరీరసంబంధాలను మించిన అనుబంధ మొకటి ఏర్పడి బలీయమైనందుచేత. అయితే, స్త్రీ స్వేచ్ఛకు వివాహమనేది ఆటంకం కాదా? ఎల్లకాలమూ ఒకడికే లోబడి ఉండడంకాదా? సంసారికీ, సానికీ అంతరం ఇక్కడే. వివాహానికి తల ఒగ్గనందుచేత, నిర్భయంగా లైంగిక స్వేచ్ఛను అనుభవించ గలుగుతోందికదా సాని? సంసార స్త్రీకి ఏది దొంగకూడో, అది సానికి చిరుదిండి. తనవాళ్లు దండిస్తారని భయంవుండేముందు 'తన'వాళ్ళనే వాళ్లు

ఉండాలి కదా ? ఆ నిర్భీకతనే మధురవాణి పూటకూళ్ళమ్మ వద్ద చాటింది. 'సమాజం' తమకు విధించిన 'ధర్మం' ఇది! తాను తన ధర్మాన్ని పాటిస్తున్నది. స్వధర్మం ఇహపరసాధకం కాదా ? అవినీతి పరురాలని వేశ్యను ఆడిపోసే హక్కు ఎవరికుంది ? కలిసికట్టుగా, కసిగా, బాధతో నవ్విపోగలరు వేశ్యలు! మధురవాణి పాత్రను సమర్థిస్తూ, ఒంగోలు మునిసుబ్రహ్మణ్యంగారికి రాసిన లేఖ :

"వ్యభిచారమే తన వృత్తిగా 'లేబిల్' వేయబడ్డ భోగంపడుచు సమాజాన్ని మోసగించడంలేదు. ఆమెకువున్న లేబిల్ దృష్ట్యా ఆమె జీవితం సరియైనతోవనే సాగుతున్నది. ఆమె ఏ వివాహబంధనాలనూ వైవాహిక సూత్రాలనూ ఉల్లంఘించడంలేదు."

మధురవాణి, మంజువాణి, సరళ వంటి వేశ్యల పాత్రలు ఎక్కడో ఒకచోటైనా వైవాహిక బంధనాలకూ సంసారి స్త్రీల అవినీతికీ వ్యతిరేకంగా గొంతెత్తినారు. ఎవరినైనా పెళ్ళాడి పరువుగా జీవించమని రంగనాథఅయ్యరు అనగానే, తోకతొక్కిన తాచులాగై "అంటే ఎవడో ఒకఛండాలుడికి నేను కలకాలం పూర్తిగా బానిసనై పడివుండాలని మీ తాత్పర్యం!" అన్నది సరళ. అయ్యరుతో లేచిపోయి, "ప్రపంచపు చివరికయినా పయనించి వస్తాను" అన్నది కూడా సరళే. అయ్యరు వాంఛించింది అదికాదు. అతనికోరిక సరళ తీర్చదు. సరళకోరిక అతను తీర్చడు. "నాబోటి బోగంపిల్లలను ఏ మర్యాదస్థుడు పెళ్ళాడు తాడో చెప్పండి మీరే!" "నన్నా ? ప్రేమించడమా ? ప్రేమించడం! ఎంత వింతమాటలండీ మీవి." ఇక, మధురవాణి సరళలా సీమకుక్క కాదు. ఏ కాపువాడైనా పెళ్ళాడి, తాను మిరపతోటల్లో చాకిరీచేసినా నయమే అనుకొంది. మంజువాణి సానిపనికి శాశ్వతంగా రాజీనామా చేసి సంసారి కాగోరింది. ఒకవైపు సంసారకాంతలంటే నిరసన (అసూయవల్ల కావచ్చు), ఒకభర్తకు యావజ్జీవ దాస్యమంటే రోయింపు; మరోవైపు మర్యాద మప్పితాలపట్ల గురి, అనురాగాల నిల కడమీద మోజు. కామం అనే అరణ్యంనుండి ప్రేమ అనే ఉద్యాన వనానికి పయనించాలని తపన. ఎవరికో ఒకరికి 'చెంది' పోవాలనే కోరిక. మాన్మథానుభవమనేది, తత్కాలోద్రేకాల ఉపశమనానికే

గాక, భవబంధాల స్థైర్యానికి దారితీయాలనే వాంఛ. ఉన్న ఊరి లోని ఈ వెలిని వదిలించుకొని నలుగురితో నారాయణత్వంకోసం పాకు లాట. ఈ వేశ్య పాత్రలను సంఘర్షణతోనూ తీరనికోరికలతోనూ ఎందుకు నింపినట్లు ? చింతామణిని మహాకవి కాళ్ళకూరి నారాయణ రావు చేసినట్లు యోగినిగా మార్చకున్నా, మధురవాణికి సౌజన్యారావు చేత భగవద్గీతను ఇప్పించినా, శ్రీకృష్ణుడుకూడా ప్రోనాచిగానే మధుర వాణికి కనిపించాడు. అంటే, ఇవి ఆదర్శ పాత్రలు కావు.

కళావంతుల సంఘసంస్కరణం తలపెట్టిన రఘుపతి వెంకటరత్నం ప్రభృతులకూ, గురజాడ అప్పారావుకూ వున్న వ్యత్యాసం, ఆదర్శానికీ యథార్థానికీ మధ్యవున్న అంతరంలాంటిదే వైవాహిక సంఘాలు నెల కొల్పినా, విద్యాసంఘాలను ప్రవర్తిల్లజేసినా, నౌకరీ ఇనాములుగల దేవదాసీలు ధన ప్రలోభంకొద్దీ వృత్తికిఅంటిపెట్టుకొన్నందుచేత, చట్ట రీత్యా సదరు ఇనాములను సేరీలుగా మార్పించే ప్రయత్నాలుచేసినా, భోగంమేళాలను నిషేధించేందుకు నడుముకట్టినా, సంస్కరణవాదులు మొదట వేశ్యల నిరసనకూ అవహేళనకూ గురైనట్లు తెలుస్తున్నది. సంస్కరణవాదులలో ఆషాఢభూతులు ఉండడం ఒకకారణం. "ఫోజు ఫోజంతా మాటల్లో యాంటీనాచే" అయినా, రాత్రులు కొందరు, పక్క వూళ్లోమరికొందరు, దొంగచాటుగా ఇంకొందరు ప్రోనాచే. అంతకన్నా ముఖ్యమైన కారణం, సంస్కరణవాదులు పారిశుద్ధ్యవాదులైనంతగా మన స్తత్వవేత్తలు కాలేదు. ఖండించినంతగా, బోధపరచుకోలేదు. అసహన మున్నంతగా సానుభూతిలేకపోయింది. రోగంతోపాటు రోగికి గూడా ముప్పుకలిగే వీళ్ళున్నట్లు వేశ్యలు భయపడ్డారు. సంపాదన గురించి ఆందోళన చెందారు. అందుచేతనే, ప్రోనాచి పార్టీవాళ్ళంటే "వాళ్ళుకోసి యిచ్చేటంత అభిమానం", యాంటీనాచి పార్టీవాళ్ళంటే అరికాలిమంటగా మారింది. రెండవదే మొదటిదానికి కారణమనాలి. కల వాస్తవాన్ని ఈ విధంగా చిత్రించాడు కాబట్టి, వేశ్యావృత్తిని అప్పారావు బలపరచినట్లుకాదు. సంస్కరణోద్యమ లోపాలను సరిగా గమనించాడు కనుకనే కథలలో యిలాంటి "ఉత్సాహులను" (Enthusiasts) నవ్వులపాలు చేశాడు.

మెటిల్డావంటి సౌందర్యవతి ఒక కర్కోటకుడి బందీ అయిందంటేనూ, బుచ్చమ్మ, అచ్చమ్మ, మీనాక్షివంటి యువతులు సౌఖ్య క్షామానికి గురయ్యారంటేనూ, పూర్ణమ్మ సౌభాగ్యమంతా బూడిదలో పోసిన పన్నీరయిందంటేనూ, వివాహసంస్థ అనర్థంగా పరిణమించిందనక తప్పదు. పెళ్ళితంతు మతానికి సంబంధించిన వ్యవహారంగా మారినందుచేత మంగళసూత్రమనేది భర్తమృతితోబాటుగానీ తెంచుకోరానిదైనందుచేత, "చెప్పనలవిగాని కన్నీటి గాధలకు" కారణంగా మారింది. అట్లని, వివాహాన్నే విధ్వసం చెయ్యకూడదు. విడాకులు, యుక్తవయస్సులో ఈడు జోడు గల పెళ్ళిళ్ళు, దాంపత్య జీవితంలో ఒద్దిక, శరీరసంబంధాన్ని మీరి నిలిచే పరస్పర మానసికాకర్షణ, బాధ్యతలలో సహభాగిత్వం వంటి చేర్పుమార్పులవల్ల ఈ లోపాలు త్వరలో వైదొలగి, సామాజికాదర్శం నిర్వక్ర మౌతుందని అప్పారావు ఆశించాడు. అయితే బాధితురాలైన స్త్రీ వకాల్తాను తాను పుచ్చుకొని వాదించాడు. న్యాయ మనేది ఇరుపక్షాలకు సమానంగా లేనప్పుడు, అది అన్యాయమౌతుంది. ఏకపక్ష నిర్ణయంవంటి పురుషాధిక్యత మానవ జాతిలో సగంపైగా వున్న స్త్రీ జాతి హీనస్థితికి కారణమైంది.

"స్త్రీలు బానిసలు. స్వాతంత్ర్య మన్నదేమిటో వాళ్ళు ఎరగరు. భార్యలు తమ భర్తల యందుండగోరు సద్వర్తన పతివ్రతల కంటె ఎక్కువ సద్వర్తన పవిత్రతలను భార్యల యందుండ వలెనని భర్తలు వాంఛిస్తున్నారు. ...

"... స్త్రీ ఖిన్నురాలు కావడానికి కారణం తాను యివ్వగలిగిన దానికంటె అధికంగా పురుషుడు తననుంచి వాంఛిస్తున్నాడుకదా అని. అయితే పురుషుడు దుఃఖితుడు కావడానికి హేతువు తాను అపేక్షించినంతగా స్త్రీ తనను పువ్వుల్లో పెట్టి పూజించడం లేదని; నిశ్చల భక్తితో ఆరాధించడంలేదని. ..."

ఇవ్వడంవరకు స్త్రీ వంతు; పుచ్చుకోవడం మాత్రం పురుషుడి వంతు అయినంతకాలం, సమాజం సజావుగా సాగదు. ఇచ్చి పుచ్చుకోళ్ళు సరిసమానమైనప్పుడే, రథానికి రెండో చక్రంకూడా సమ

కూరుతుంది. అందుచేత, చరిత్రను తిరిగి రచించవలసిన హక్కు దమిత స్త్రీ జాతిది.

## III

"దేశాభిమానం నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకోకోయి...."

—దేశభక్తి

కొందరి దృష్టిలో, గురజాడ అప్పారావు బ్రిటిష్ రాజభక్తుడైనంతగా, భారత దేశభక్తుడు కాకున్నాడు! ఆనాటి సంస్కర్తల కందరికీ ఇంతో అంతో ఆ అపనిందాముద్ర పడింది. నిజానికి దీనికి ఎంత వారంటే, నిజానికీ అబద్ధానికీ వున్నంత!

గురజాడ రామదాసు కొడుకు లిద్దరున్నూ 'యవనవ్వన' కాలంలోనే జాతీయోద్యమానికి మనస్సుల నర్పించినట్లు దాఖలాలున్నాయి. చిన్నవాడు శ్యామలరావు, కవిత్వానికీ రాజకీయానికీ రాజకీయ కవిత్వానికీ అభిమానాలను పంచాడు. 'ది హిందూ' పత్రికలో రాజద్రోహులను (Seditionists) అభినందిస్తూ ఇంగ్లీషు పద్యాలు ప్రకటించాడు. అప్పారావు వున్నాడు, అతడు రాజకీయ కావ్యం రాద్దామని కూడా ఎందుచేతనో రాయలేదు. అయితే అతని రచనలన్నిట జాతీయవాద కోలాహలం గురించిన అభిప్రాయాలు చెల్లాచెదురుగా వున్నాయి.

1889 లో స్వయంగా స్థానిక కాంగ్రెసు సభలో ఉపన్యసించిన వ్యక్తి నిష్కారణంగా కాంగ్రెసు ఉద్యమాన్ని ఎన్నడూ విమర్శించలేదు. సురేంద్రనాథ బెనర్జీ లగాయతు లక్షోపలక్షల గిరీశాలవరకు ఊకదంపుడు ఉపన్యాసాలకు జాతిని అలవాటు చేశారు. అయితే బెనర్జీ ఒకందుకు, గిరీశాలు మరొకందుకు. పాశ్చాత్య సభ్యత తెచ్చిపెట్టిన అవలక్షణాలలో ఈ వసపిట్టధోరణి ఒకటి అని అప్పారావు అనుకొన్నాడు. వట్టిమాటలవల్ల ఫాయిదా ఏమిటి? ప్రభుత్వాధికారం

హ స్తగతం కానప్పుడు ఏ రాజకీయోద్యమమైనా తలపెట్టే గట్టి మేలే ముంటుంది? అయితే, రాజకీయాలనేగాని సాంఘికా లను స్పృశించని ఉద్యమ మేదైనా, పాక్షికమయ్యే ప్రమాదం ఉంది. ఉపన్యాసాలతో గాక, ఉత్కృష్ట కార్యాచరణతోనే దేశం విముక్త మౌతుందని సంస్కర్తలందరూ భావించారు. సంఘసంస్కరణ ముందా, రాజకీయ పరివర్తన ముందా? ముందు మన ఇంటిని చక్కదిద్ది, లోకాన్ని మరమ్మతు చెయ్యడమా లేక ప్రభుత్వాన్ని హ స్తగతం చేసు కొనేంతవరకూ ఈ సంఘసంస్కరణలను వాయిదా వెయ్యడమా? ఐక్యత అవసరమైన దశలో, మనలో మనకు ఈ చిల్లర తంపులెందుకు, అనర్థానికిగాక? ఇలాంటి వాదోపవాదాలు ఆనాడు ఉండేవి.

అప్పారావు విషయానికి వచ్చేసరికి, ఆయన విమర్శించింది అరాకొరా పద్ధతులనే గాని జాతీయోద్యమాన్ని కాదు. దీనినిబట్టి ఆ ఉద్యమం మరింత ఖచ్చితమైన తీవ్ర వైఖరిని అనుసరించవలెనని ఆయన అభిలషించినట్లు తెలుస్తుంది. ఇంగ్లీషులో ఆయన రాసిన ఒక పద్యానికి శ్రీశ్రీ ఆంధ్రానువాదం 'సామవేదం', యీ విషయాన్నే వెల్లడిస్తుంది. రూల్సుప్రకారం చేసే కాగితాల యుద్ధం నామకార్థమే గాని, ఫలితాల నివ్వగలుగుతుందా? మితవాదులు నేర్పుతుండిన పాఠం, ఎండలనుబట్టి గొడుగులను మార్చడం; అతివాదివై తిరగబడితే, ద్వీపాంతరవాసమే బహుమానం.

"కావున జోరుగ కంఠశోషగా
ఉపన్యసిస్తూ నుంచుందాం!
అ స్తమానమూ లాభంచూడక
రాజభ క్తితో పొంచుందాం!"

ఎలాంటి రాజకీయాలను అప్పారావు అభిమానించాడో అతని రచనలేగాక, జీవితంకూడా తెలువుతుంది మునిసిపల్ కౌన్సిలులో సభ్యుడై కొళ్ళాయిలు వేయించడం, రేట్ పేయర్ల కష్టసుఖాలు విచా రించడం, రైతులను వెంటబెట్టుకొని సంస్థానం రెవిన్యూ ఉద్యోగులవద్ద వారి మొరలను నివేదించడం – ఇవి చిల్లపనులైతే కావచ్చుగాని,

ఓటి నోటిమాటలకంటె ఎంతో మేలు. సుదూరాన నిలిచిన గమ్యం వైపేగాని నీ యెదుటవున్న అవలక్షణాలగురించి నీకు ఆందోళనేలేదా ? నాయకమ్మన్యుల వాగ్ధారాధోరణి సామాన్యులను అట్టే నోరు తెరిపించ లేదు సరిగదా, 'కన్యాశుల్కం' లోని జట్కాబండివానివలె, ప్రజా కంటకులైన ఉద్యోగుల బదిలీలవంటి సన్నిహితసమస్యా పరిష్కారాన్ని కోరేటట్లు చేసింది. దీర్ఘసూత్రుడు గొప్పవాడే కాగాక, ప్రాప్తకాల జ్ఞుడు కూడా అవసరమనే అప్పారావు చెప్పదలచుకొంది. దేశం దేశం అనగా లాభమేమిటి ? దేశంలోని ప్రజాహృదయాన్ని విను, వారి కోరికలు తీర్చు. అట్లాగాక, పబ్బం గడుపుకోవడంకోసం ఎదుటివాడు చెప్పిందల్లా బాగుందంటూ "ఒపినియన్సు అప్పుడప్పుడు ఛేంజిచేస్తూ" పొలిటీషన్ అనే మాటనే హాస్యభాజనం చేయడమేల ?

స్వదేశ సౌభాగ్యస్వాతంత్ర్యాలను గురించి అప్పారావు దీర్ఘంగా గాఢంగా ఆలోచించినట్లు "దేశభక్తి" గేయం ఒక్కటేకాదు, ఎప్పటి కప్పుడు అతని ఆలోచనలను గర్భీకరించుకొన్న వచనభాగాలుకూడా నిరూపిస్తున్నాయి. పాశ్చాత్యభావాలు అతని మనస్సును మలిచా యేమోగాని, పాశ్చాత్యరాజ్య వ్యవస్థమాత్రం అతనిని మభ్యపెట్టలేదు. రవీంద్రనాథ ఠాకూరు ఎన్నోచోట్ల చేసిన విమర్శలాంటిదాన్నే ఒక చోట అప్పారావు చేశాడు :

"ఆధునిక పాశ్చాత్య రాజ్యాంగ వ్యవస్థ, దాని పరిపాలనాపద్ధతి ఒక విచిత్రమైన కలగూరగంప. ఇందులో కొద్ది మానవత్వం ఉన్నప్ప టికీ మితిలేని స్వార్థపరత్వంతో ఇది కూడుకొనివుంది. ఈ రెండింటిలో ఏది జయిస్తుంది ? స్వార్థపరత్వమే కాబోలు ! (13)

వ్యక్తిలాభం (Private Profit) కేంద్ర స్థానమై, 'బహుజన హితాయ, బహుజన సుఖాయ' (The greatest good of the greatest number) అనే లక్ష్యాన్ని వమ్ముచేస్తూ, స్వేచ్ఛపేరిట అగాధదుఃఖాన్ని సృష్టిస్తూన్న ఆధునిక పాశ్చాత్య రాజ్యాంగం, స్వార్థానికి మకుటం తొడిగింది సరే, ప్రాచ్య సాంఘికాదర్శాల ప్రబోధం ఏమిటి ? ఇవి మరో 'అతి'కి దారితీసేవిగా ఉన్నాయి. సాంఘిక మైన నీతి కిచ్చినంత ప్రాముఖ్యాన్ని, వ్యక్తి సౌఖ్యానికి ఇవ్వవు.

హేతువాదప్రచాలితమైనా, పురోగమనశీలమైనా, పాశ్చాత్య నాగరికత రాక్షసయంత్రంవలె, ప్రేమకు వెలిబడి సాంఘిక శ్రేయస్సును కుంటుపరుస్తున్నది. "మన మత నమ్మకములు, సాంఘిక అభిప్రాయములు,ఆశయములు అంతో ఇంతో వ్యక్తిగత జీవితంలో నైతికప్రమాణమును కలుగజేస్తూనే, ఇంకొకవంక పౌరహిత జీవితములో సద్వర్తనమునూ, నీతినీ కలిగించలేకపోతున్నవి." (14) వ్యక్తికీ సమిష్టికీ మధ్య, స్వేచ్ఛకూ సంఘీభావానికీ మధ్య, సౌఖ్యానికీ సౌశీల్యానికీ మధ్య సామరస్యాన్ని కలిగిస్తేనే తప్ప, ఉభయార్థాలూ చేకూరవు.

ఎవరినో కొద్దిమందినే ధనాఢ్యులను చేసే పాశ్చాత్య సాంఘిక రాజకీయ భావాలను కూడా అప్పారావు నిరసించక తప్పలేదు. "పాటకపు జనుల స్థితిగతులను చక్కబరచి, వారిని వృద్ధికి తేవడం ప్రజాస్వామికపు లక్షణం." (15) కానప్పుడు, ఆ ప్రజాస్వామ్యం నామమాత్రమే రాజకీయ సమానత్వం కలిగించడంతోనే తృప్తిపడక, ఆర్థికసమానత్వానికి అది దారితీయవలసి ఉంటుంది. దేశీయార్థిక జీవన సమస్తంలోనూ ప్రజాతంత్ర సూత్రం అమలుజరుగవలసి వుంటుంది.

గాలివాలున వచ్చిపడే సిరులకోసమో, పైవారిచ్చే వరాలకోసమో పడిగాపులుపడే ప్రజలున్నంతకాలం, ఆ దేశం అభివృద్ధి చెందలేదు. శరీరశ్రమ అప్రతిష్ఠాకరమనేఅభిప్రాయంవైదొలగాలి. "పాడిపంటలు పొంగిపొర్లే" విధంగా ప్రతిఒక్కవ్యక్తీ పాటుపడినప్పుడు, దేశం సంపదలను ప్రసాదిస్తుంది. చెట్టపట్టాలు పట్టుకొని మునుసాగే దేశస్థుల మధ్యగల ప్రాదేశిక, భౌతిక,మానసిక అభ్యంతరాలు వైదొలగడం తప్పనిసరి. ఈ చిటిపోటి అభిమానాలను సమన్వయించే 'జాతం' తప్పనిసరి. "ప్రాదేశిక విభేదాలు. వైమనస్యాలు. ఐకమత్యం అవసరం." (16)

జాతిభేదాలను నిరసించడంలో అప్పారావు ఒకచోట పప్పులో కాలువేసినట్లనిపిస్తుంది. ఏకోదరులు కారనేందుకుగూడా వీలులేని హిందువులు, ముస్లిములు ఏకదేశస్థులు. వారిమధ్య తగవులుకూడదు, సరే. ఈ దేశానికి నివాసంకొరకుగాక, అధిపత్యంకొరకు వచ్చిన "ఆంగిలేయులు"కూడా ఈ ప్రేముడిలో భాగస్థులు కాగలరా?

"నిన్న వొచ్చా రింగిలీజులు,
మొన్న వొచ్చిరి ముసలుమనులటు
మొన్న వొచ్చిన వాడ వీవని
మరిచి, వేరులు పెట్టుకోకోయ్"

తోడేలునూ గొర్రెపిల్లలనూ సహజీవనం చేయమనడంగాక, ఈ బోధ ఏమిటి ? ఎవరినుండి దేశానికి స్వేచ్ఛకావాలో, వారు స్వేచ్ఛాకాములకు బద్ధవిరోధులు. వసుధైక కుటుంబ దృక్పథంనుండి సమర్థనీయమౌతుందేమోగాని, జాతి దృక్పథంనుండి ఇది దూష్యమౌతుంది. "అంగిలేయుల ధర్మరాజ్యము" గురించి ఎంత గురివుంటేమట్టుకు, దానికి చిరాయువును అభిలషించడమేనా ? అది జాతికి ఆత్మహత్య. జ్ఞానమిచ్చినమాట నిజమే. కొన్ని సంస్కరణలకు ప్రోత్సాహమిచ్చీ మరికొన్నిటిని ప్రారంభించీ, సంస్కరణవాదులకు పరమాప్తమై పోయినప్పటికీ, అది 'ధర్మ' రాజ్యం ఎట్లా కాగలదు, నిజానికి యమధర్మ రాజ్యమైనప్పుడు ? రాజకీయ పార్టీలలో గ్లాడ్‌స్టన్ గారి లిబరల్ పార్టీ జయప్రదంగా సృష్టించిన భ్రమలు, భారత రాజకీయ నాయకులలో గోఖలే వంటివారితోబాటు సంస్కర్తల నందరినీ అంటి పెట్టుకొన్నాయి. దేశంలోని మేధావులను తృప్తి పరిచేందుకు బ్రిటిషు ప్రభుత్వం చేయసాగిన బిరుద ప్రదానాలవంటివి, వారి నోళ్ళకు పెట్టని తాళంకప్పలయ్యాయి. బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసాలను పెడచెవిని పెట్టిన వీరేశలింగం రావుబహద్దర్ అయ్యాడు. గిడుగు రామమూర్తికి రావుసాహేబు బిరుదు రావడం అప్పారావుకు చాలా సంతోషం కలిగించింది. అప్పారావుకు బిరుదేదీ మీదబడలేదు గాని, మద్రాసు యూనివర్శిటీ 'ఫెలో' హోదా లభించింది. అయితే, ఆయన ప్రమత్తుడు కాలేదు. రచనల్లోనైనా ఈ బిరుదాల కీలకాలను బయల్పరిచాడు. 'కొండుభట్టీయం' లో దర్శనమిచ్చే దివాన్ బహద్దర్ రాజారాం, సంఘసంస్కరణల్లో వేలుబెట్టింది వాటిపట్ల ఆసక్తివల్లకాదు. అతనికి కావలసింది ఏ సంస్థానంలోనైనా దివాన్గిరీ. దానికి దొరల అండదండలు కావాలి. అందుకు ప్రజల్లో పేరు ప్రతిష్ఠలు పెరగాలి.

తానొక సంస్కర్త అనిపించుకోవాలి. గిరీశంద్వారా, రాజారాం గుట్టు అప్పారావు బయట వేశాడు.

గురజాడ అప్పారావు సూచించిన జాతీయతత్వం ఉద్రేకాల పేర్పుగాక, సదాలోచనల కూర్పు. స్వాతంత్ర్యం పొందిన జాతి గురించేగాని, బానిసత్వంలో మగ్గుతూన్న జాతిని గురించి ఆయన ఊహించలేకపోయాడు స్వాతంత్ర్యానంతరకాలాన తన జాతి వికాసం సర్వతోముఖం ఎట్లాగౌతుందో ఊహించి, ఆ రేఖాచిత్రాన్ని దేశీయులకు ఇచ్చి పోవడంకంటె, తాను చేయగలిగింది లేదు.

సస్య సంపన్నమైన వసుంధర అన్న కాటకానికే కాటకం. దేహ దారుఢ్యమూ మానసికోల్లాసమూ గల ప్రజ. రెండు చేతులలో ఒక దానిని వ్యవసాయానికీ రెండవదానిని పరిశ్రమకూ వినియోగించ గల సవ్యసాచిత్వం. కళాస్థానమైన హృదయమూ, శాస్త్రస్థానమైన మెదడూ పూరా విప్పారిచ్చిన క్రియాలోకం. ముందుకీ మీదికీ సాగే సంకల్ప పుష్టి. కత్తులు తుప్పట్టిపోగా విద్యలూ కళలూ పరిఢవిల్లే శాంతిప్రియ మనస్కత. జాతుల మధ్య భావ, వస్తు ఆదానప్రదానాలు. అరమరికలులేక ప్రేమమయమైన మనుష్య గణం. సౌహార్దం, సౌజన్యం, అనురాగం అని త్రిముఖాలుగా పయనించే హృదయకుసుమ సౌరభం. ఇదేకదా భూలోకస్వర్గం. మిన్నుల నుండి దైవనగరాన్ని (Civitas Dei) మానవలోకానికి దింపాడు ఈ మహాభావుకుడు.

"ఒకరి నొకరు ప్రేమించుకోవడం యెంత మహా తరమైనదని. ఈ భూమిమీదికి స్వర్గం దిగివచ్చినంత! భూలోకస్వర్గమే!"(17)

మానవు డొకవైపు దివ్యత్వంవైపు ఎగబ్రాకుతున్నాడు. దేవుడింకొకవైపు మానవునివైపు దిగివస్తున్నాడు. మనుష్యులు దేవతలతో కలిసి తిరగాలనే అశోకరాజర్షి మహితాశయ మిదేనా?

దేశం సరిహద్దులవద్ద అప్పారావును అతని సానుభూతి వదిలి పెట్టి నిలిపివెయ్యలేదు. అది యింకా విస్తరించింది. స్వదేశంవలెనే పరదేశా లన్నికూడా ప్రేమాశ్రమా లైనప్పుడు, దయానిలయా లైనప్పుడు, సహకారజీవన ధర్మాంకితా లైనప్పుడు, జాతీయ

రాజ్యాంగ వ్యవహారంలో దాగివున్న సర్పాల కోరలు వూడిపడి నట్లవుతుంది. అయితే వాస్తవం యిప్పటికీ ఆ విధమైలేదు. మనిషి మనస్సు, జాతి భూభాగాన గిరిగీసుకొని అందులోనుండి కదలకున్నది. వ్యక్తి స్వార్థం, జాతి వ్యక్తికి సంక్రమించి, జాతీయవాదమంటునే రవీంద్రు డన్నట్లు The organised self-interest of a Nation గా పరిణమించి, రాజకీయంగానూ ఆర్థికంగానూ సామ్రాజ్యవాదాలకు, రణాలకు, లోకక్షయానికి పురిటిగది అవుతున్నది. To me, humanity is rich and large అని రవీంద్రు డొకచోట ధైర్యంచేసి చెప్పి, జాతీయవాద విషవలయంనుండి తన ఆత్మవైశాల్యాన్ని కాపాడు కొన్నాడు. గిడుగు సీతాపతితో అప్పారావు మాట్లాడినతీరు అలాంటిదే :

"చూశావా ఈ దేశభక్తి, ఈ స్వదేశాభిమానం మన హృద యాన్ని ఎంత సంకుచితమైన దానినిగా చేస్తుందో ... లోక కళ్యాణానికి భంగం రానీయకుండా, పెద్ద సంఘాల మేలు చెడగొట్టకుండా, నీ చిన్న సంఘం మేలు నీవు కాపాడవలసినదే. కాని, నీవు చేసే మేలు ఈ విశ్వంలో ఎంతవరకు వ్యాపిస్తే అంత గొప్పదవుతుంది. (18)

త్యజస్యేకమ్ కులస్యార్థే ... అనే శ్లోక భావంవలె, పెద్దసంఘాల కోసమని చిన్నవాటిని బలిపెట్టే వైఖరి కాదిది. వాటి పారస్పర్యం అగత్యమని మాత్రమే. పెద్దది అనేది ఏదీ లేనప్పుడు (లక్ష్యంగానైనా) చిన్నవాటికి పరమ గమ్యమంటూ ఒకటి ఉండదు. వ్యక్తినుండి లోక వ్యక్తికి సాగిన అప్పారావు ప్రేమభావన, అంతస్తుమీద మరో అంతస్తు, ఆపైన మరొకటి మరొకటిగా నిర్మించే మహావాస్తుశిల్పియొక్క మనః ప్రాంశుత్వం వంటిది. జాతి బంధాలన్నవి నిర్బంధాలై సంకెళ్ళవలె తెగిపోయేకాలమూ లోకమూ, ఇప్పటికికూడా ఊహాసాధ్యాలే.

"యెల్లలోకము వొక్క యిల్లై
వర్ణ భేదములెల్ల కల్లై
వేల నెరుగని ప్రేమబంధము
వేడుకలు కురియ."

స్వర్గ సుఖాలన్నవి అప్పుడే భూమికి అవతరిస్తాయి. ఇంతటి సుదూరమైన ఊహను, మరి నాలుగేళ్ళలోనే ప్రథమ ప్రపంచ యుద్ధం తుంచి తుత్తునియలు చేసింది. అయినా అప్పారావు నిరాశపడలేదు. కల దెలుసుకున్నవాడివలె, మనోరథాలనుండి దిగి కఠోరవాస్తవంవైపు చూపు సారించాడు. ప్రథమ యుద్ధకాలంలో స్వయంగా అనుభవం సంపాదించుకొన్న హెచ్.డి. డరెల్ వంటి పాశ్చాత్య మిత్రులవద్దనుండి, పత్రికలనుండి, యుద్ధస్వభావాన్ని గురించి గుర్తింపు కలిగింది. మరొక నెల దాటకమునుపే శాశ్వతంగా కనుమూయబోతా డనగా, 1915 అక్టోబరు చివర, అప్పారావు రాసిన "దించు లంగరు" గేయం పుట్టుక లోనిగుట్టు, హెచ్.డి. డరెల్ రాసిన లేఖద్వారా బయల్పడుతుంది.(19) అప్పటికే యుద్ధం ఒక మలుపు తిరిగింది. కైజర్‌కు చుక్క ఎదురైంది. 'మిత్ర' దేశాలకు అదృష్టం కలిసివచ్చే సూచనలు తోస్తున్నాయి. జర్మనీవలె కాకుండా, ఈ 'ప్రజాస్వామిక దేశాలు' తమ శాంతికాముకత గురించి లోకం చెవినిండుగా ప్రచారం చేసిపెట్టాయి. అప్పారావు కూడా దానికి లోబడ్డాడు. త్వరలో మారణం ఆగి, శాంతి నెలకొంటుంది. ఆపైన ఇక యుద్దాలుండవు. అమెరికా అధ్యక్షుడు ఉడ్రూ విల్సన్ ఆశపెట్టినట్టు, ఈ యుద్ధం యుద్ధాలనే తుదముట్టించే యుద్ధం కాదా మరి? (A war to end all wars) ఇదీ అప్పారావు భావనా క్రమం.

"పాత సంధులు పాతిపెట్టుము
యుద్ధముల కవి ఉనికి పట్టులు
లోకమంతయు ఏకమై
యుద్ధమునె మారణము చేయును."

అయితే అప్పారావు మోసపోకముందే, 'మిత్ర' దేశాల కపట ప్రచార వర్షంలో తప్పతడిసిన లోకం నిట్టనిలువునా మోసపోయింది. ఆపాదమస్తకమూ మోసపోయింది. మరొక అక్రమసంధి మరొక మారణ కారణం కాగలదని అప్పటికి ఎవ్వడూ అనుమానించలేదు. యుద్ధానంతరం యెల్లలోకం వొక్క యిల్లు కాలేదు. నానాజాతి

సమితి నానాదౌష్ట్యాల పేరోలగమైంది. ఆంగిలేయుల ధర్మరాజ్యం లాఠీనీ సన్నీనీ కింకర రాజ్యాన్నీ దేశీయులమీద విధించింది. అయితే, భ్రమలు నిశ్శేషంగా కన్నులను వీడిపోక ముందే, మనుషుల మంచితనంమీది గురి సడలక ముందే, అప్పారావు జీవలోక తీరాన్ని వదిలి, అజ్ఞాత సముద్రంమీద లంగరెత్తి పడవను విడిచాడు. ఆయన యెక్కడైతే తన భావ సూత్రాన్ని వదిలి వెళ్ళాడో, అక్కడనే కవికోకిల దువ్వూరి రామిరెడ్డి దానిని అందుకొని, నానా జాతి సమితి నిజ స్వభావాన్నీ, యుద్ధాల మూలకారణాలనూ, వాణిజ్యస్పర్థల దారుణఫలితాలనూ, వెలికిడ్చి వేశాడు. భ్రమలతో లే గతించినా, గురజాడ అప్పారావును ఏదో పశ్చాత్తాపం, చిట్టచివరి ఘడియలలో చుట్టుముట్టింది. తన జీవిత కథను ఆ కొసనుంచి పర్యాలోకించుకొన్నాడు. తాను సాధించింది, ఏమిటి ఇంతకూ? లక్ష్యాన్ని అందుకొన్నట్టేనా? కామితాలను వాస్తవాలుగా మార్చినట్టేనా?

ఇప్పుడుకూడా నా వ్యాఖ్యానమెందుకు? అతనినే చెప్పనిచ్చి నేను సెలవు పుచ్చుకొంటాను, ప్రస్తుతానికి:

"అందజాలని పళ్ళకోసము
అఱ్ఱుజాపితి; నేల పాకిన
చెట్లపళ్ళను విలువ లెరుగక
పాద రక్షల మట్టితిన్.

"తీపి విరిగిన చెరుకువలె ఆ
నాటి కోర్కెలు నేడు బెండౌ
టెంచి నవ్వితి; బుద్ధి చపలత
కొత్తకోర్కెల తగిలితిన్.

"దేవతలతో జోడుకూడితి
రక్కసులతో కూడి ఆడితి
కొత్త మిన్కుల తెలివి పటిమను
మంచి చెడ్డల మార్చితిన్." (20

## పాదపీఠికలు (Foot notes)

(1) మాటామంతీ, అవీ; ఇవీ, పు. 6. (2) బ్రహ్మర్షి రఘుపతి వెంకట రత్నంనాయుఁడుగారి జీవిత చరిత్ర : కోటిపల్లి సూర్యనారాయణ, (3) కృష్ణాపత్రిక, 22-9-1962. (4) డైరీలు, పు. 154. (5) విశాలాంధ్ర, 23-9-1962 (6) మాటామంతీ, పు. 46, (7) కాసలు, ముత్యాలసరాలు. (8) మాటామంతీ, పు. 45. (9) లేఖలు, పు. 86, (10) మాటామంతీ, పు. 127–131 (11)అదే, పు. 222-225 (12) లేఖలు, పు. 83, (13) అదే, పు. 95, (14) డైరీలు, పు. 174 (15) మాటామంతీ, పు. 60. (16) లేఖలు పు. 95, (17) పరిశోధన, డిసెంబరు- జనవరి 1956. (19) లేఖలు పు. 159-163 (20) దించులంగరు, ముత్యాలసరాలు.

1955

# పరిశిష్టం (అనుబంధం) *

## కన్యాశుల్కం నాటకంలోని రసమేది?

రంగ ప్రయోగానుభవం లేని రచయితలు కావడమొక్కటే ఈ బృహత్ పరిణామానికి కారణమనుకోను. చెప్పదలచుకొంది చాలా వుండింది కనక నే ఇంత పెద్ద నాటకాలు రాశారంటే, కుంటిసాకు మాత్రమే అవుతుంది దీనికి కారణం ఒకచోట అప్పారావే చెప్పక చెప్పాడు : 'మూడు అంకాలు ప్రెస్సుకు వెళ్ళిన తరవాత నాటకంలోని ఒక పాత్రపట్ల నాకుగల దృక్పథాన్ని మార్చుకోవలసి వచ్చింది. (1) ఇలాంటి మార్పులన్నీ చేసి, కుదించి అచ్చుకిచ్చివుంటే, నాటకం పరిమితి "చిన్నక్షరాలలో ముద్రించినా రెండువందల పేజీలు" దాటకుండా వుండేది. కాబట్టి రచయితగా అజాగ్రత్త ఒకముఖ్యకారణమైవుండవచ్చు. తమ ఆలోచనలను "సమగ్రంగా" వ్యక్తంచెయ్యాలనే ఆకాంక్షవల్ల, బాహుళ్యాన్నికూడా క్షమించి విడిచిపెట్టవలసివచ్చింది. ఫలితం ఎగుడు దిగుళ్ళు అవసరమైనదీ అనవసరమైనదీ కలగలిసిపోయింది. ఈ సమగ్రతవల్ల కన్యాశుల్క నాటకం సమకాలిక జీవిత వైవిధ్యాన్ని బింబించే సాంఘిక చరిత్రా పత్రంగా భాసించినంత, నాటకంగా రంగస్థలంమీద భాసించలేకపోయింది.

గొప్పవారి లోపాలనుకూడ సుగుణాలుగా చాటే మనోవ్యాధికి విమర్శకులు లే నైతే, వందిమాగధులు వేరుగా అక్కరలేదు. రచయిత

* ఈ వ్యాసభాగం 86 వ పుట తర్వాతది.

ప్రతి సంఘటనకు ఏదో ఒక ప్రయోజనాన్ని ఆశించకుంటే, ఆ ఘటనకు రచనలో చోటే వుండకపోయేది. కన్యాశుల్కంలో "వ్యర్థమైన ఘటన కానరాదు. ప్రతి రంగమందలి సంభాషణ సార్థకముగా నుండును" అని రాసిన వెంటనే, పేకాటరంగము, సారాదుకాణము సీను అవాంతర ఘటనలని పేర్కొన్నవిమర్శకుని చిత్తశుద్ధి మెచ్చదగింది ఈ విమర్శకుడు శ్రీపాద కామేశ్వరరావు. ఆయన ప్రాచ్య, పాశ్చాత్య నాటకరచనా ధోరణుల దృష్ట్యా, యీ నాటకాన్ని ఉగ్గడించాడు. కన్యాశుల్క నాటక కథానిర్వహణం గురించి ఆయన రాసిన పంక్తులను ఉదహరించడం కంటె చెయ్యదగిందిలేదు.

"కథా విన్యాసమున ముఖ్యము లయిన ఘట్టములే చెప్పబడి నవి. సుబ్బి పెళ్ళి మొదట స్థిరపడి, తరువాత రద్దుచేయబడి అనంతరం కొంచెం తడబడి తుదకు భంగపడెను. ఈ కుంఠితగతి నిరూపించడ మందు కవి చాతుర్యము కానవచ్చును."(2) పెళ్ళి పక్షాన పని చేసిన వాళ్లు అగ్నిహోత్రావధాని, రామప్పంతులు, లుబ్ధావధాని, వీళ్ళప్రయత్నం నిరాటంకమైతే వివాహమైతీరుతుంది. అలాగే జరిగితే, వస్తు జటిలత (Complexity of plot) వుండదు. కాబట్టి, రచయిత ఈ ఘటనకు ఘాత చేకూర్చాడు. పెళ్ళికి ప్రతికూలంగా పనిచేసినవాళ్లు కృష్ణరాయపురాగ్రహారంలో బుచ్చమ్మ, వెంకమ్మ, కరటకశాస్త్రి, గిరీశం; రామచంద్రపురంలో మధురవాణి, రామప్పంతులు. "ఈ యిరు వీడులవారి ప్రయత్నములు కలియనంతకాలము పెళ్లియొక్క గతి అనుకూలముగా నుండెను." కరటకశాస్త్రి రామప్పంతుల సాయంపొందిన వెంటనే పెళ్ళి ముహ్పాతికపాలు ఆగింది. గిరీశం, రామప్పంతులు రాసిన ఉత్తరాలు లుబ్ధావధానికి చేరినవెంటనే వివాహసంకల్పం ఊగిసలాడింది. రామప్పంతుల ఉత్తరంవల్ల మాయ సుబ్బి పెళ్లికి అనుకూలమైంది. అగ్నిహోత్రావధాన్లు పెళ్లికి తరలి వచ్చి, లుబ్ధావధాన్లుతో జగడమాడడం, పెళ్ళిని పూర్తిగా వెనక్కి నెట్టి వేసింది. మాయసుబ్బి పరారీకావడం, కూనీకేసు మొదలు కావడం ఘటనాచక్రాన్ని మార్చివేసింది. ఇంతవరకూ స్వార్థపరులు, మోస గాళ్ళు, ఈర్ష్యాగ్రస్తులు నాటి పెంచిన విషవృక్షం ఇప్పుడు

లుబ్ధావధానికి ఫలాల నారగింపు పెట్టింది. ఈ సంతతి నిర్మూలనము కావలెనంటే, ధార్మికులు కార్యభారం వహించాలి. సౌజన్యారావు, మధురవాణి, కరటకశాస్త్రి "వీరు కార్యనిర్వహణము మొదలుపెట్టగనే వంచనా మేఘము లొక్కొక్కటి విరియబారి క్రమముగా పటాపంచలై స్వార్థ ధ్వాంతము దిశలకు పారెను." చివరకు కవితా న్యాయంగా "సత్యమేవ జయతి నానృతమ్" రుజువైంది. కథ ఖేదమోదాంతమైంది (Tragi - comedy).

నాటకం కొనసముట్టు చదివితేనేగాని, కథ తిరిగిన మలుపులన్నీ తెలిసిరావు. తెలిస్తేగాని, అప్పారావు కథను నిర్వహించడంలో చూపిన నేర్పు బోధపడదు. జీవితంలో వున్నవన్నీ కన్యాశుల్కంలో వున్నా యంటాడు శ్రీ శ్రీ. జీవితంలో ప్రతి సందర్భానికి పనికివచ్చే గుణం–"విశ్వతోముఖత్వం" మహాకావ్యాల ప్రధాన లక్షణాలలో ఒకటుటు. (3) విశ్వతోముఖత్వం పేరిట కథా నిర్మాణంలో అనవసరాంశాలను ఎవరు సమర్థించినా మంచిదికాదు. "ఆదిమధ్యాంత రహితమైన నాటకమ"ని శ్రీ శ్రీ ప్రస్తుతించినప్పుడు, ఇందులోని అతిశయోక్తిని గమనించవలసి వుంటుంది. రెంటాల వెంకటసుబ్బారావు, పురాణం సూరిశాస్త్రివంటి విజ్ఞులు విషయ బాహుళ్యాన్ని గమనించినా, ఆ దోషాన్ని సన్నివేశ చమత్కారమో, సంభాషణా మాధుర్యమో, నీతి ప్రయోజనమో పరిహరిస్తున్నాయని భావించారు.

## 4

"నేను యెంత హాస్య ప్రసన్నుడనో అంత గంభీరుడను–భయంకరుడను." మాటా మంతీ; అవీ – ఇవీ

కనకనే కన్యాశుల్క నాటకాన్ని హాస్యమయంచేస్తూకూడా, గంభీరతను దెబ్బతిననీయలేదు. ఏడ్చే లుబ్ధావధాన్లు కోపించే అగ్నిహోత్రావధాన్లు నవ్వుతెప్పిస్తుంటే నవ్వే మధురవాణి, వెర్రిగా మాట్లాడే బుచ్చమ్మ, రంకుతనంచేసే మీనాక్షి ఏడుపుతెప్పిస్తున్నారు.

ఈ పాత్ర లన్నిటికంటె గిరీశం తానే ఒక నవ్వుల పుట్టగా పరిణమించాడు. ఈ నాటకంలో హాస్యం శ్రుతిమించిందని కొందరు విమర్శకులు భావిస్తున్నారు. వారిలో సెట్టి ఈశ్వరరావు ఒకరు. "తూకంలో హాస్యం బరువు కన్యాశుల్కంలో యెక్కువైపోయింది. ఏడిపించవలసిన పరిస్థితులు నవ్విస్తాయి. అగ్నిహోత్రావధాన్లు, రామప్పంతులు, గిరీశం మొదలైనవారు తీవ్రంగా గర్హించవలసినవారు. హేళనచేసి తేలికగా దాటిపోనియ్యవలసినవారు కారు." (5) హేళనకు మారు, ఈశ్వరరావు కోరినగర్హణే వుండివుంటే కన్యాశుల్క నాటకం ప్రత్యక్ష నీతిబోధనకు పూనుకొని, ధర్మశాస్త్ర స్వరూపం తాల్చివుండేది. అటు వీరేశలింగం గారి ప్రహసనాల స్థాయికి దిగకుండానూ, ఇటు నైతిక నియంతల ప్రబోధంగా పరిణమించకుండానూ, కన్యాశుల్కం ఒక విశిష్టస్థానాన్ని ఆర్జించగలిగిందంటే అప్పారావుకు సహజాయుధమైన హాస్యప్రసన్నతే ముఖ్యకారణమనాలి. మనుషుల లోట్లనుజూచి అసహనంగల రచయితే తిట్టుకూ, మొట్టుకూ పూనుకోవాలి. మనిషి ప్రాథమిక సౌజన్యంలో అప్పారావుకు నమ్మకం వుంది. సంస్థలు నీతి చట్టాలు, పట్టింపులువంటి సాంఘిక పరిసరాలవల్ల మరుగున పడిపోయిన ఈ మంచితనాన్ని చెర విడిపించాలి. ఇతరులను కరుణా దృష్టితో వీక్షించాలి. నచ్చజెప్పాలి. వాళ్ళను వాళ్ళకేగాక పదుగురకుచూపి, నవ్వులకు అగ్గంచేసి, ఖిన్నులను గావించి, పరివర్తన కలిగించాలి. ఇందుకు హాస్యం పని చేసినంతగా గర్హణ పనిచెయ్యదు

కన్యాశుల్కం హాస్యం గురించి అనేకులు అనేకసిద్ధాంతాలు చేసివున్నారు. మెరుపులాంటిమాట శ్రీ శ్రీ ముఖతః ఒకటి వినిపించింది: "సెల్యులాయిడ్‌లో కన్యాశుల్కం" అనే వ్యాసంలో, కన్యాశుల్కం నిజానికి హాస్య ప్రధానం కాదనే అభిప్రాయాన్ని ఆయన ఇట్లా వ్యక్తీకరించాడు: "గిరీశం, రామప్పంతులు, లుబ్ధావధానులు మొదలైన వారు నవ్వు పుట్టించేటట్లు మాటలాడే ట్రాజిక్ హీరోలు. వీరిది శిథిలీకృతమవుతూన్న ఒకానొక సాంఘిక వ్యవస్థయొక్క కరాళనృత్యం. కన్యాశుల్కం బీభత్స రసప్రధానమైన విషాదాంత నాటకం" (6)

విషాదాంత నాటక మెట్లా గౌతుంది? హత్యలు లేవు. శవాలు లేవు. రక్తపాతం లేదు దురావేశాలద్వారా సత్సంకల్ప విఘాతాలూ లేవు. విషాదరాహువు గ్రసించినా పాత్రలసాక్ష్యం కథాంతాన గ్రహణం నుండి బయల్పడుతుంది. కన్యా విక్రయ వ్యాపారానికి శాస్తి జరుగుతుంది. సౌజన్యారావు సౌజన్యాన్ని స్థాపిస్తాడు. ఏ విధంగా చూసినా, కన్యాశుల్కం విషాదాంత నాటకం కాదు. కాకుంటే, విషాదకర ఘటనలు, విషాదమగ్నపాత్రలు, సాంఘిక దుస్థితిదట్టంగా వ్యాపించిన రచన. ఒక సాంఘికవ్యవస్థ అంత్యఘట్టానికి ఈ నాటకమే ఒక సాహిత్య సాక్ష్యం. ఆ వ్యవస్థా ప్రతినిధుల క్షోభ,తత్కాలానికి పాఠకులకు సంక్రమించినా చివరకు 'చేసుకొన్న వారికి చేసుకొన్నంత మహదేవ' అనుకోవలసి వస్తుంది కాబట్టి శ్రీపాద కామేశ్వరరావు అన్నట్లు, ఈ నాటకం ట్రేజీ కామెడియే అనిపిస్తుంది.

శ్రీ శ్రీ కంటె యుక్తియుక్తంగా పండిత అయల సోమయాజుల నరసింహశర్మ కన్యాశుల్కం హాస్యం గురించి ఒక వ్యాఖ్యానం చేశాడు. కన్యాశుల్కంలోని ప్రధానరసం బీభత్సమేగాని, హాస్యం కాదని నిరూపి పజూశాడు. 'బీభత్సరసానికి స్థానంకావాలంటే రక్త మాంసాదులే లక్కరలేదు' (7) గర్హ్యంగా వర్ణింపబడే ప్రతిదీ స్థానమౌతుంది. "వస్తుతః శుద్ధములైనా, హేయమైన భావసంకలనచేత వస్తువు హేయంగా వర్ణింపబడుట రెండవ బీభత్సము." కన్యాశుల్క నాటక ప్రయోజనం సంఘ కశ్మలాన్ని ప్రదర్శించడమే కాబట్టి అదే ప్రధానం; దానికి హాస్యము సాధనమై రెండవ స్థానాన్ని ఆక్రమిస్తుంది. అంగరసమైకూడా, హాస్యం వికాసాత్మకమై విజ్ఞానానికి కారణమౌతుంది. అందుచేతనే 'హాస్యం విజ్ఞాన నిలయా' అని పూర్వులన్నారు. అజ్ఞానంలోవున్న సంఘానికి విజ్ఞానం కలిగించడానికి, తద్వారా మార్పును చేకూర్చడానికి హాస్యం పనికివస్తుంది. కాబట్టి "విజ్ఞానం జ్ఞానాన్ని అధిక్షేపిస్తుంది. దీనివల్ల అజ్ఞానంమీాద ఏవ కలుగుతుంది. అది బీభత్సాత్మక విషయం. ఈ పరిస్థితికి కన్యాశుల్కం ఉదాహరణ గ్రంథం".

## పా ద పీ ఠి క లు (Foot notes)

(1) లేఖలు పు. 72. (2) భారతి (పత్రిక), ఆగస్టు 1933. (3) గురజాడ - శ్రీశ్రీ, పు. 56-59. (4) మాటా-మంతీ, పు. 156. (5) మహాకవి-మహాపురుషుడు, సెట్టి ఈశ్వరరావు. (6) గురజాడ—శ్రీశ్రీ. పు. 62. (7) తెలుగుతల్లి (పత్రిక). ఎప్రిల్ 1915.



# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | | ఒప్పు |
|---|---|---|---|---|
| 7. | 19 | సంస్కృతములో | ... | సంస్కృతముతో |
| 14. | 19 | (ఖర్చులిచ్చిరి) | ... | (ఖర్చులిచ్చి) |
| 17. | 8 | ఆంధ్ర యుగాంధ్ర | ... | అంధ యుగాంధ్ర |
| 22. | 22 | నకళ్ళనుగాక | ... | నకళ్ళకుగాక |
| 23. | 4 | ప్రచురించినప్పటి | .. | ప్రచలించినప్పటి |
| | 20 | ప్రకృతిలో | ... | ప్రకృతితో |
| 25. | 16 | రాష్ట్రభక్తిని తగిన మిత్రులకు | ... | రాష్ట్రభక్తికి తగిన మితులకు |
| 26. | 21 | సనువుగ చెలంగు | ... | నను వుగ బెనంగు |
| 30. | 23 | అప్పరాయోపజ్జక | ... | అప్పరాయోపజ్ఞక |
| 35. | 3 | చేయగగా వింతలు | ... | చేయగరాని వింతలు |
| 42. | 4 | ఒక లకజ్ఞుని | ... | ఒక లోకజ్ఞుని |
| 42. | 12 | వీక్షిస్తారు." | ... | వీక్షిస్తారు." (5) |
| 47. | 27 | పరిణమించి, 1910లో | ... | పరిణమించి, 1911లో |
| 49. | 6 | గ్రంధాక్షతలు | ... | గంధాక్షతలు |
| 61. | 14 | సాంఘిక ప్రగతి | ... | 'సాంఘిక ప్రగతి |
| 63. | 15 | చింతనం | ... | చిరంతనం |
| 65. | 7 | ఈ రోజుల్లో | .... | 'ఈ రోజుల్లో |
| 65. | 26 | సంస్కరణా శం | .... | సంస్కరణావేశం |
| 72. | 16 | నైతి ధర్మం | ... | నైతిక ధర్మం |
| 85. | 2 | దానికి చిక | ... | దానికి ఒక |
| 85. | 3 | సాంఘిక శుఒకి | ... | సాంఘిక శుచికి |
| 91. | 18 | జీ తంలో లేనివి | ... | జీవితంలో లేనివి |

| పుట | పంక్తి | తప్పు | | ఒప్పు |
|---|---|---|---|---|
| 96. | 2 | అణ్చమ | ... | అచ్చమ్మ |
| 96. | 3 | ప్రచయ | ... | ప్రణయ |
| 97. | 5 | ర్శించి | ... | ర్శించినా |
| 98. | 16 | అంత కలిగేకాదు | ... | అంతగా కలిగేదికాదు. |
| 98. | 21 | బ్రాహ్మసమాజికులా | ... | బ్రాహ్మసమాజికుడిలా |
| 100. | 6 | స్వీయనాయిక | ... | స్వీయానాయిక |
| 101. | 19 | భవిప్యం | ... | భవిష్యం |
| 102. | 12 | ఆలోచించిన | ... | అ లోపించిన |
| 111. | 17 | తాకీ తట్టే | ... | తాకీతట్టీ |
| 119. | 24 | బ్రాహ్మలను | ... | బ్రాహ్ములను |
| 134 | 15 | మాహావ్యక్తిత్వాన్ని | ... | మహావ్యక్తిత్వాన్ని |
| 136. | 20 | బ్రహ్మజ్ఞానసమాజోద్యమం | | బ్రహ్మసమాజోద్యమం |
| 136. | 24 | సాంకేతప్రాయమై | ... | సంకేతప్రాయమైన |
| 139. | 2 | ఛంచస్సుకు | ... | ఛందస్సుకు |
| 148. | 15 | ఈజిప్షియన్ | ... | ఈజియన్ |
| 155. | 12 | నిష్పతిభుల్ని | ... | నిష్ప్రతిభుల్ని |
| 156. | 29 | భర్త మనోను | ... | భర్తృ మనోను |
| 162 | 5 | మహాకవులిద్దరూ | ... | మహాకవులిద్దరూ |
| 164. | 16 | పరిసరాలలు | ... | పరిసరాలు |
| 169. | 15, 16 | నిత్యాం నిత్యంకానంత మాత్రాన | ... | నిత్యంకానంత మాత్రాన |
| 173 | 1 | మాయలేని సృష్టి | ... | మాయలేని సృష్టే |

★

203

# మహాకవి గురజాడ
# ర చ న లు
## (ఏడు సంపుటాల్లో)

1. వ్యాసచంద్రిక : 2.00
కావ్యాలలో శృంగారం; ముత్యాలసరాల లక్షణము; విద్యా పునరుజ్జీవనము - వాడుకభాషలు వగైరా.
2. కొండుభట్టీయం, బిల్హణీయం : 1.50
3. మహాకవి డైరీలు : 3.00
4. మాటా మంతీ - అవీ యివీ : 2.75
5. లేఖలు : 2.50
6. ముత్యాలసరాలు (గేయసంపుటి) : 1.50
దేశభక్తి; లవణరాజు కల; కన్యక; పూర్ణమ్మ; దించు లంగరు; లంగరెత్తుము - వగైరా.
7. ఆణిముత్యాలు (కథలసంపుటి) : 1.00
మీ పేరేమిటి?; మెటిల్డా; దిద్దుబాటు; పెద్ద మసీదు; సంస్కర్త హృదయం.

1317 పుటలుగల ఈ 7 సంపుటాలూ ఒకేసారి కొనువారికి పోస్టు ఖర్చులు ఉచితం

ప్రతులకు:

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ - 4